

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# శ్రీరామకర్ణామృతము.



## మంగళశ్లోకములు.

శ్లో. మంగళం భగవాన్విష్ణు ర్మంగళం మధుసూదనః,
మంగళం పుండరీకాక్షో మంగళం గరుడధ్వజః.

శా. శ్రీరాముం భువనాభిరాము ఘనరా♦జీవాప్తధాముం బరం
ధాముం బావననాము పాలితమునీం♦ద్రస్తోము నీలాంబుద
శ్యాముం సన్నుతసోము భానుకులదు♦గ్ధాంభోధిసోముం మహో
ద్దామప్రాభవదైత్యభీము నతసు♦త్రాముం మదిం గొల్చెదన్.



శ్లో. మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే,
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్. 1

చ. ప్రకటితకోసలేంద్రునకు ♦ భవ్యగుణాబ్ధికిఁ జక్రవర్తిపు
త్రకునకు సార్వభౌమునకు ♦ రామునకుం నిగమాంతవేదికిం
సకమలమేఘవర్ణునకు ♦ సర్వజగజ్జనమోహనస్వరూ
పకునకుఁ బుణ్యకీర్తికిఁ గృ♦పానిధి కెప్పుడు భద్ర మయ్యెడున్.

తా. కోసలదేశాధిపతి యైనట్టియు, మంచిగుణములకు సముద్రుఁడైనట్టియుఁ, జక్రవర్తికిఁ బుత్రుఁడైనట్టియు, నెల్లభూమి నేలునట్టియు, వేదాంతములచేఁ దెలియఁదగినట్టియు, మేఘములవలె నల్లనైనదేహము గలిగినట్టియుఁ, బురుషులను మోహింపఁజేయురూపము కలిగినట్టియుఁ బవిత్రకీర్తిగలరామునకు శుభ మగుఁగాక.

శ్లో. విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్.
పితృభక్తాయ సతతం భ్రాతృభి స్సహ సీతయా
నందితాఖిలలోకాయ రామచంద్రాయ మంగళమ్. 2

చ. ప్రకటవిదేహభాగ్యపరి◆పాకునకున్ ముదితాంతరంగకౌ
శికునకు పితృభక్తునకు ◆ శీలికి భూమిసుతాసుమిత్రపు
త్త్రకసహితప్రకాశునకుఁ ◆ బ్రస్తుతసాధుజనైకభవ్యమూ
ర్తికి రఘురామచంద్రున క◆రిస్ఫుటపాణికి భద్ర మయ్యెడున్.

తా. విశ్వామిత్రునకు మిక్కిలి యిష్టుఁడైనట్టియు, జనకునిభాగ్యములపంటయైనట్టియు, మంచిరూపము గలిగినట్టియుఁ దమ్ములతోడను సీతతోడను సంతోషింపఁజేయఁబడిన లోకములుగలరామునకు శుభ మగుఁగాక.

శ్లో. త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే
సేవ్యాయ సర్వయమినాం ధీరోదాత్తాయ మంగళమ్.
సౌమిత్రిణాచ జానక్యా చాపబాణాసిధారిణే
సంసేవ్యాయ సదా భక్త్యా సానుజాయాస్తు మంగళమ్. 3

ఉ. హారికయోధ్యసౌఖ్యపరి◆హారికి నందితచిత్రకూటసం
చారికుమారికిన్ వినుత◆సంయమికిన్ శరచాపధారికిన్
త్సారమణీజలక్ష్మణస◆మన్వితమూర్తికి భవ్యకీర్తికిన్
శ్రీరఘురామచంద్రునకు ◆ సేవకసేవధికిన్ శుభం బగున్.

తా. అయోధ్యాపట్టణమును విడిచినట్టియుఁ, జిత్రకూటపర్వతమున విహరించునట్టియు, సర్వమునులకు సేవింపఁదగినట్టియు, ధీరోదాత్తుఁ డనఁగా ధైర్యశాలియైనట్టియు, సీతాలక్ష్మణులతోఁ గూడినట్టియు, ధనుర్బాణాసులను ధరించినట్టియు, భక్తిచే సేవింపఁదగినట్టియుఁ, దమ్మునితోఁ గూడినరామునికి శుభ మగుఁగాక.

శ్లో. దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్.

సాదరం శబరీదత్తఫలమూలాభిలాషిణే
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్. 4

మ. అరివిధ్వంసికి దండకావనవిహా◆రామోదికిన్ గృధ్రశే
ఖరసిద్ధిశ్రేయసదాయికిన్ శబరిసా◆ంత్వోద్దీప్తకారణ్యమూ
ధురిశోధ్యాస్ఫలభోక్తకున్ ప్రవిలస◆ద్దోస్సారికిన్ శౌరికిన్
వరసౌలభ్యగుణప్రపూర్ణునకు నా◆నాభద్రముల్ చేకురున్.

తా. దండకారణ్యములో నివసించినట్టియుఁ, గొట్టఁబడినరాక్షసులు గలిగినట్టియు, భక్తుఁడైనజటాయువుకు మోక్షమిచ్చినట్టియు, శబరియిచ్చుపండ్లు దుంపలు మొదలగుదానిని గోరినట్టియు, భక్తులకు సులభుఁడైనట్టియు సత్వగుణప్రధానుఁడైనరామునికి శుభమగుఁగాక.

శ్లో. హనూమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే
వాలిప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్.
శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసింధవే
జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్. 5

ఉ. పాలితవాయుసూనునకు ◆ భక్తకపిప్రవరేష్టదాయికిన్
వాలివిదారికిన్ ధృతికి ◆ వారిధిసేతునిబన్ధనక్రియా
శాలికి వీరరామునకు ◆ చండపరాక్రమపఙ్క్తికంఠని
ర్మూలనకేళికిన్ నృపతి◆ముఖ్యలలామునకున్ శుభం బగున్.

తా. ఆంజనేయునితోఁ గూడినట్టియు, సుగ్రీవుని కిష్టము నిచ్చినట్టియు, వాలిని సంహరించినట్టియు, ధైర్యవంతుఁడైనట్టియు, రఘువంశవీరుఁడైనట్టియు, గట్టుచేఁ దాఁటఁబడినసముద్రము గలిగినట్టియు, జయించఁబడిన రావణాసురుఁడు గలిగినరామునకు శుభమగుఁగాక.

శ్లో. ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్.
విభీషణకృతే ప్రీత్యా విశ్వాభీష్టప్రదాయినే
జానకీప్రాణనాథాయ సదా రామాయ మంగళమ్. 6

మ. ప్రకటాయోధ్యపురిన్ ధరాతనయతో ◆ బ్రాపించి రాజాధినా
యకసంస్తూయధరాభిషేకము నిజం ◆ బై యున్నలోకాధినా

యశోరత్నంబుచయర్ విభీషణప్రచండాభీష్టసంధాయికిన్
మకుటాంకల్పనిభూమి కొంగుపసిడిన్ మాతాభ్రమముల్ చేకుగున్.

తా. మంచిదియైన యయోధ్య ప్రవేశించి సీతతో బ్రహ్మాభిషిక్తుఁడైనట్టియు, రాజులకు రాజైనట్టియు, విభీషణునకు సంతోషమునే నిచ్చును నిచ్చినట్టియు సీతకుఁ బ్రాణప్రియుఁడైనరాముని కుత్తమమగుఁ గాక. (ఇంతవరకు రామాయణకథ సంగ్రహముగాఁ జెప్పఁబడినది)

---

# ప్రథమాశ్వాసము.

శ్లో. శ్రీరామం త్రిజగద్గురుం సురవరం సీతామనోనాయకమ్
శ్యామాంగం శశికోటిపూర్ణవదనం చంచత్కలాకౌస్తుభమ్
సౌమ్యం సత్యగుణోత్తమం సుసరయూతీరేవసంతం ప్రభుమ్
త్రాతారం సకలార్థసిద్ధిసహితం వందే రఘూణాం పతిమ్. 1

శా. శ్రీరాముర్ శశికోటికాంతివదనుర్ ♦ సీతామనోనాయకుర్
ధీరుర్ విశ్వగురుర్ బరేశు సరయూతీరప్రచారిన్ హరిన్
ధారాభృత్ప్రభునీలు కౌస్తుభధరుర్ ♦ ద్రాతన్ సుపర్వేశ్వరుర్
శౌరిన్ సర్వఫలప్రదుర్ గొలిచెదన్ ♦ సత్యాత్ము సౌమ్యాకృతిన్.

తా. మూఁడులోకములకు గురువైనట్టియు, దేవతాశ్రేష్ఠుఁడైనట్టియు, సీతాదేవిఁ బెనిమిటియైనట్టి నల్లనిశరీరము గలిగినట్టి కోటిచంద్రులవంటిముఖము గలిగినట్టి మంచికాంతిగల కౌస్తుభమణిగల శాంతుఁడైన సత్యవ్రతుఁడైన సరయూనదీతీరమందు నివసించియున్న ప్రభువును రక్షింపువానిని సర్వకార్యసిద్ధులతోఁగూడిన రఘువంశరాజుల కధిపతి యగు శ్రీరామునికి నమస్కరించుచున్నాను.

శ్లో. శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం 2
రామం నిశాచరవినాశకరం నమామి.

ఉ. శ్రీరఘువీరు దాశరథిఁ ♦ జిన్మయు సూర్యకులప్రదీపకున్
సారసపత్రనేత్రు దితి♦సంభవజైత్రు మహీసుతానసాం

భోరుహామిత్రు దీర్ఘకరు♦పుణ్యచరిత్రు జగత్పవిత్రు శృం
గారగుణాభిరాముఁ ద్విజ♦గర్భనిభు నెంతు హృదంతరంబునన్.

తా. రఘువంశసంతానమైనట్టి దశరథునిపుత్రుఁడైనట్టి ఇంతటివాఁడని ప్రమాణించ శక్యముగానట్టి సీతకుఁ బెనిమిటి యైనట్టి రఘురాజుయొక్క శ్రేష్ఠమైనవంశమునకు రత్నదీపమైనట్టి మోకాళ్లపర్యంతముకు చేతులు గలిగినట్టి పద్మపురేకులవలె విశాలములైన నేత్రములు గలిగినట్టి రాక్షసనాశనముఁ జేయునట్టిరామునికి నమస్కరించుచున్నాను.

శ్లో. శ్రీరామం బలవైరినీలచికురం స్మేరాననం శ్యామలమ్
కర్ణాంతాయతలోచనం సురవరం కారుణ్యపాథోనిధిమ్
శోణాంభోరుహపాదపల్లవయుగం క్షోణీతనూజాయుతమ్
రాజత్కుండలగండభాగయుగళం రామం సదాహం భజే. 3

మ. హరినీలాలకు సంస్మితాననుఁ ఘన♦శ్యామాంగు దేవేశు సుం
దరకర్ణాంతవిలోచనుఁ రఘువరుఁ ♦ ధాత్రీతనూజాధిపుఁ
గరుణాంభోనిధిరత్నకుండలలస♦ద్గండస్థలుఁ నవ్యభా
సురతామ్రాంబుజపల్లవాంఘ్రి యగుసు♦శ్లోకుఁ బ్రశంసించెదన్.

తా. ఇంద్రనీలమణికాంతులవలె నల్లనికేశములు గలిగినట్టియుఁ జిఱునవ్వు మొగముగలిగినట్టియుఁ, జామనచాయవాఁడైనట్టియుఁ, జెవులపర్యంతము విస్తరించినకన్నులు గలిగినట్టియు, దేవతాశ్రేష్ఠుఁడైనట్టియు, దయాసముద్రుఁడైన యెఱ్ఱపద్మములవంటి పాదద్వంద్వము గలసీతాదేవితోఁగూడిన ప్రకాశించుచున్న కుండలములు గల గండస్థలములు గలరాము నెల్లపుడు సేవించుచున్నాను.

శ్లో. శ్రీరామం జగదేకవీర మమలం సీతామనోరంజనమ్
కౌసల్యావరనందనం రఘుపతిం కాకుత్స్థవంశోద్భవమ్
లోకానా మభిరామ మంగళఘనవ్యాపారపారాయణమ్
వందేహం జనఘోరపాపనికరధ్వంసం విభుం రాఘవమ్. 4

శా. శ్రీరాముఁ జగదేకవీరు నమలుఁ ♦ సీతామనోరంజనుఁ
గారుణ్యాకరుఁ గోసలేశ్వరసుతా♦గర్భాబ్ధిచంద్రోదయుఁ
ఘోరాఘౌఘతమిస్రకంజసఖుఁ గా♦కుత్స్థాన్వయుఁ రాఘవుఁ
శూరుఁ లోకపవిత్రు రామవిభు సు♦శ్లోకుఁ మదిఁ గొల్చెదన్.

తా. జగత్తులయందు ప్రధానమైనదైనట్టి నిర్మలమైనట్టి సీతాదేవిమనస్సును రంజింపఁజేయునట్టి కౌసల్యాదేవికి శ్రేష్ఠపుత్రుఁడైనట్టి కకుత్స్థవంశమందుఁ బుట్టినట్టి లోకముల కిష్టమైన శుభమైన గొప్పశౌర్యములయం దాసక్తుఁడైనట్టి మనుష్యుల భయంకరపాపములను బోఁగొట్టు ప్రభువగు రామునికి నమస్కరించుచున్నాను.

శ్లో. శ్రీరామం జగదీశ్వరం జనకజాజానిం జనానందనమ్
జంతూనాం జనకం జనార్తిహరణం లోకేశ్వరం శాశ్వతమ్
ఆబాల్యాదిమునీశ్వరైః పరివృతం జాజ్వల్యమానం సదా
జంఘాలం జమదగ్నిసూనుహరణం జాతానుకంపం భజే. 5

శా. శ్రీరాముం జగదీశ్వరుం జనకపుత్రీనాథు మౌనీంద్రసం
ఘారాధావృతు సజ్జనార్తిహరు జంఘాలుం బరీభావకృ
ద్ధారీప్రాభవభార్గవుం సకలజంతుప్రాణరత్నుం సుప
ర్వారాధ్యుం రఘువర్యు శాశ్వతు జనాహ్లాదుం భజింతుం మదిన్.

తా. జగత్తుల కధిపతియైనట్టి సీతాదేవి భార్యగాఁ గలిగినట్టి జనుల నానందింపఁజేయునట్టి ప్రాణులను బుట్టించునట్టి మనుష్యులబాధను హరించునట్టి లోకముల కధిపతియైనట్టి స్థిరుఁడైనట్టి చిన్నతనము మొదలుకొని మునులచేఁజుట్టఁబడినట్టి మిక్కిలి ప్రకాశించుచున్నట్టిపిక్కబుష్టి గలిగినట్టి పరశురామగర్వమునుహరించినట్టి పుట్టినదయగల రామమూర్తిని సేవించుచున్నాను.

శ్లో. శ్రీరామో రఘునాయకో రఘువరో రాజీవనేత్రాంచితో
రాజేంద్రో రఘుపుంగవో రఘుకులోత్తంసో రఘూణాంపతిః
రామో రాక్షసనాశనోమితబలో రాకేందుపూర్ణాననో
రాజత్కింకిణికంకణాంకితకరో రామ స్సదా పాతునః. 6

శా. రాజీవాయతపత్రనేత్రు విలసద్రాకేందుబింబాననుం
రాజేంద్రుం రఘుపుంగవుం రఘుకులుం ద్రాత్రించరారిం మహా
తేజుం రాఘవు నప్రమేయబలసందీప్తుం రఘూత్తంసునిం
రాజత్కింకిణికంకణాంకితకరుం ద్రామప్రభుం గొల్చెదన్.

తా. రఘువంశరాజులకు నాయకుఁడైనట్టి రఘువంశశ్రేష్ఠుఁడైనట్టి పద్మములవంటినేత్రములచే నొప్పుచున్నట్టి రాజశ్రేష్ఠుఁడైనట్టి (రఘుపుంగవ ఇత్యాదివిశేషణములు నాల్గును ఆదరోక్తులు) రాక్షసనాశకుఁడైనట్టి అమితబలముగలిగినట్టి పూర్ణిమాచంద్రుని

వలె సంపూర్ణమైన ముఖముగలిగినట్టి ప్రకాశించుచున్న ... గలకంకణములచే నలంకరింపఁబడినహస్తములు గలిగినట్టిరా... డెల్లప్పుడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో. శ్రీరామచంద్ర కరుణాకరరాఘవేంద్ర
రాజేంద్రచంద్ర రఘువంశసముద్రచంద్ర
సుగ్రీవనేత్రయుగళోత్పలపూర్ణచంద్ర
సీతామనఃకుముదచంద్ర నమో నమస్తే. 7

చ. మనుకులవార్ధి ప్రాగుదిత◆మానితపూర్ణిమచంద్రు సర్వస
జ్జనసుతకీర్తిసాంద్రు మహి◆జానయనోత్పలపూర్ణచంద్రు శో
భనగుణు రామచంద్రునివి◆భాకరజాక్షికు బాలచంద్రు స
న్మునినుతు రాఘవేంద్రు భవ◆మోచను గారుణికుంౝ భజించెదన్.

తా. దయకు స్థానమైనట్టి రఘువంశరాజశ్రేష్ఠుఁడైనట్టి రాజశ్రేష్ఠులకుఁ జంద్రుఁడవైనట్టి రఘువంశమనెడు సముద్రమునకుఁ జంద్రుఁడవైనట్టి సుగ్రీవునినేత్రద్వంద్వమనెడుకలువలకుఁ బూర్ణచంద్రుఁడవైనట్టి సీతయొక్కమనస్సనెడుకలువకుఁ జంద్రుఁడవైన యో శ్రీరామచంద్రా నీకొఱకు నమస్కారము నమస్కారము.

శ్లో. శ్రీరామం కరుణాకరం గుణనిధిం సీతాపతిం శాశ్వతమ్
పారవారగభీర మబ్జనయనం ప్రావృడ్ఘనశ్యామలమ్
వీరశ్రేష్ఠ మనామయం విజయినం విశ్వప్రకాశాత్మకమ్
ఘోరారిప్రకరాధిజప్రహరణం కోదండరామం భజే. 8

శా. వీరశ్రేష్ఠు ననామయుంౝ జయకరుంౝ ◆ విశ్వప్రకాశాత్మకుంౝ
పారావారగభీరు గంజనయనుంౝ ◆ బ్రావృడ్ఘనశ్యామలుంౝ
ఘోరారిందము శాశ్వతుంౝ రఘువరుంౝ ◆ గోదండదీక్షాగురుంౝ
శ్రీరాముంౝ గరుణాకరుంౝ గుణనిధిం ◆ సీతేశుఁ బ్రార్థించెదన్.

తా. కాంతిచేత మనోహరుఁడైనట్టి దయకు స్థానమైనట్టి గుణములకు నిధియైనట్టి సతకుఁ బెనిమిటి యైనట్టి యెల్లప్పుడు నుండునట్టి సముద్రమువలె గాంభీర్యము గలిగినట్టి పద్మములవంటి కన్నులు గలవర్షాకాలమేఘమువలె నల్లనైనవీరులలో శ్రేష్ఠుఁడైన బాధలేనట్టి జయముగల ప్రపంచమున శోభింపఁ జేయు భయంకరశత్రువులనెడుమనో వ్యధను హరించు కోదండధారియైనరాముని సేవించుచున్నాను.

శ్లో. శ్రీరామచంద్రేతి సలక్ష్మణేతి, నీలోత్పలశ్యామలకోమలేతి
ఆక్రోశముక్తా స్తవధున్యైవ జిహ్వా, సీతాపతే రాఘవ రాఘవేతి. 9

ఉ. శ్రీరఘురామ రాఘవవి॥శిష్టపవిత్రచరిత్ర సత్యబృం
దారకనాథ నీలసమ॥ధామసుమిత్రసుతానుయుక్త ధా
త్రీరమణీసుతాధిప సు॥ధీజనవందితపాదపద్మశృం
గారనిధీ యటంచుఁ గల॥కాలమహోరసనా స్మరింపుమా.

తా. నానాలుక యిప్పుడే శ్రీరామచంద్రా! లక్ష్మణునితోఁ గూడినవాఁడా! నల్ల కలువలవలె నల్లనివాఁడా! మృదువైనవాఁడా! సీతకుఁ జెనిమిటియైనవాఁడా! రామా! రామా యని మొఱతోఁ గూడినది యగుఁగాక.

శ్లో. శ్రీరామచంద్రే రమతాం మనో మే, రమాంగవామే విపదాంవిరామే
జితారిరామే ప్రణతారిరామే, గుణాభిరామే భువనైకరామే. 10

చ. వరసుగుణాభిరాముఁడు భ॥వ స్తవనాహ్వయుఁ డాపదాటవీ
స్ఫురదనలుండు వైరిజన॥పుణ్యసతీప్రణతుండు శత్రుబం
ధురవిభవాపహుండు ఘన॥దోర్బలుఁ డబ్జకరాభిరాముఁ డౌ
హరిరఘురాముఁ డైవతము॥నం దనిశంబు రమింపు చిత్తమా.

తా. లక్ష్మీదేవి యెడమభాగమందుఁ గలిగినట్టియు, ఆపదలను బోఁగొట్టునట్టియు జయింపఁబడినశత్రువులు గలిగిన నమస్కరించుచున్న శత్రువులు గలిగిన గుణములచే మనోహరుఁడైన లోకములకు మనోహరుఁడైన రాముని యందు నామనస్సు ఆనందించుఁ గాక.

శ్లో. శ్రీరామచంద్ర రఘుపుంగవ రాజవర్య
రాజేంద్ర రాజ సురనాయక రాఘవేశ
రాజాధిరాజ రఘునన్దన రామభద్ర
దాసోస్మ్యహంచ భవత శ్శరణాగతోస్మి. 11

మ. ధరణీనాథ శిరస్స్ఫురన్మకుటర॥త్నద్యోతనీరాజితా
కరపాదాంబురుహద్వయుల్ సకలలో॥కస్వామిరామప్రభుల్
సరసుల్ రాఘవు దేవదేవు విబుధ॥స్తవ్యప్రచారుల్ బరా
త్పరు రాజేంద్రు రఘూద్వహుల్ దలఁచి త॥ద్దాసుండనై యుండెదన్.

తా. శ్రీరామచంద్రా! రఘువంశశ్రేష్ఠా! రాజశ్రేష్ఠా! రాజరాజా! దేవతల నేలువాఁడా! రాఘవేశా! రాజులకుఁ బైరాజునైనవాఁడా! రఘువంశ రాజుల నానందింపఁ జేయువాఁడా! రామభద్రా! నేను నీకు శరణుఁజొచ్చినదాసుఁడనైతిని.

శ్లో. శ్రీరామం సరసీరుహాక్షమమలం దూర్వాంకురశ్యామలమ్
విద్యుత్కోటినిభప్రభాంబరధరం వీరాసనాధిష్ఠితమ్

వామాంకోపరిసంస్థితాం జనకజా మాలింగ్యతాం బాహునా
తత్త్వంచాపరపాణినా మునిగణా నాజ్ఞాపయంతం భజే. 12

శా. వామాంకస్థసతిఁ బ్రవేష్టమున భావం బొప్ప సంశ్లేషుఁ డై
తా మౌనీంద్రుల కొక్కహ స్తమున తత్త్వం బేర్పడఁ దెల్పుశ్రీ
రాముఁ సారసపత్త్ర నేత్రు ఘను వీరాఖ్యాసనాధిష్ఠితుఁ
శ్యామాంగుఁ దపనీయచేలుని రఘుస్వామిఁ బ్రశంసించెదన్.

తా. పద్మములవంటి నేత్రములు గలిగిన దూర్వాగ్రములవలె నల్లనైనట్టి విస్తారపు మెఱుపులతో సమానమైనకాంతిగలవస్త్రమును ధరించినట్టి వీరాసనమును బొందినట్టి ఎడమతొడపైనున్న సీత నొకచేతఁ గౌఁగిలించి వేఱుచేత బ్రహ్మతత్త్వము మును లకు బోధించుచున్న రాముని సేవించుచున్నాను.

శ్లో. శ్రీరామ స్సకలేశ్వరో మమపితా మాతాచ సీతా మమ
భ్రాతా బ్రహ్మసఖా ప్రభంజనసుతః పత్నీవిరక్తిః ప్రియా
విశ్వామిత్రవిభీషణాదివశగా మిత్రాణి బోధస్సుతో
భక్తిశ్రీహరిసంగతా రతిసుఖం వైకుంఠ మస్మత్పదమ్. 13

శా. రామస్వామియె తండ్రి తల్లి యలగోత్రాజాతసుగ్రీవ వి
శ్వామిత్రాఖ్యవిభీషణాదులు హితుల్ సద్బోధపుత్త్రుండు స
ద్భామారత్నము శాంతిమిత్త్రుఁడు జగత్ప్రాణాత్మజుం డచ్యుత
ప్రేమాసక్తిసుఖంబు మత్సదనమై బెంపొందువైకుంఠమున్.

తా. సర్వేశ్వరుఁడైనరాముఁడు నాతండ్రి, సీత నాతల్లి, బ్రహ్మకు స్నేహితుఁడైన యాంజనేయుఁడు సోదరుఁడు, విరక్తి నాభార్య, విశ్వామిత్త్రుఁడు విభీషణుఁడు మొదలగునింద్రియనిగ్రహముగలవారు నామిత్త్రులు, జ్ఞానము నాకొడుకు, హరిపాద పద్మమందు భక్తియే సంయోగసుఖము, వైకుంఠము నాకు నివాసస్థానము.

శ్లో. శ్రీరామామలపుణ్డరీకనయన శ్రీరామసీతాపతే
గోవిందాచ్యుతనందనందనముకుందానందదామోదర
విష్ణో రాఘవ వాసుదేవ నృహరే దేవౌఘచూడామణే
సంసారార్ణవకర్ణధారకహరే కృష్ణాయతుభ్యం నమః. 14

శా. ధీరాగ్రేసరనందనహరీ దేవౌఘచూడామణీ
ఘోరాఘౌఘహరాముకుందనృహరీ గోవిందశ్రీకృష్ణసం
సారాంభోనిధికర్ణధారకమలాక్షా శౌరి దామోదరా
శ్రీరామాచ్యుతజానకీరమణ ని స్సేవింతు నిష్టాప్తికిన్.

తా. నిర్మలమైన పద్మమువంటి నేత్రములు గలవాఁడా! కాంతిచేత మనోహరుఁడైనవాఁడా! సీతకుఁ బెనిమిటియైనవాఁడా! గోవిందా! అచ్యుతా! నందునకుఁ గొమారుఁడైన కృష్ణరూపమొందినవాఁడా! ముకుందా! ఆనందస్వరూపా! దామోదరా! వ్యాప్తరూపుఁడా! రాఘవా! వాసుదేవా! నృసింహరూపా! దేవతాస్వరూపుఁడా! సంసారసముద్రమును ఓడవంటివాఁడా! పాపసంహారకుఁడా! ఓ శ్రీరామా! కృష్ణావతారుఁడవైన నీకొఱకు నమస్కారము.

శ్లో. రామం లక్ష్మణపూర్వజం రఘువరం సీతాపతిం సుందరం
కాకుత్స్థం కరుణాకరం గుణనిధిం విప్రప్రియం ధార్మికమ్
రాజత్కుండలమండితాననరుచిం రాత్రించరధ్వంసినం
శంపాకోటిసమానకాంతివిలసన్మాయామృగఘ్నం భజే. 15

మ. ధరణీజాధిపతిన్ లసద్గుణుఁ బరం♦ధామున్ బ్రసూనాస్త్రసుం
దరుఁ గాకుత్స్థుని ధార్మికున్ రఘువరున్ ♦ దైత్యారి విప్రప్రియున్
గురుచంచత్కమనీయశంబరహర♦ద్ఘోరాస్త్ర సత్కుండలా
భరణున్ రాముని లక్ష్మణాగ్రజుఁ గృపా♦భ్రాజిష్ణుఁ గీర్తించెదన్.

తా. లక్ష్మణుని యన్నయైనట్టి రఘువంశశ్రేష్ఠుఁడైనట్టి సీతాభర్తయైనట్టి సౌందర్యముగలిగినట్టి కకుత్స్థవంశమందుఁ బుట్టినట్టి దయాస్థానమైనగుణములకు స్థానమైన బ్రాహ్మణుల కిష్టుఁడైనధర్మస్వరూపుఁడైనట్టి ప్రకాశించుచున్నకుండలములచేత నలంకరింపఁబడిన ముఖకాంతిగలిగినట్టి రాక్షససంహారకుఁడైనట్టి కోటిమెఱుపులతో సమానకాంతిగల మాయలేడిని కొట్టినరాముని సేవించుచున్నాను.

శ్లో. రామం రత్నకిరీటకుండలధరం కేయూరహారాన్వితం
సీతాలంకృతవామభాగమతులం సింహాసనస్థం ప్రభుమ్
సుగ్రీవాదిసమస్తవానరవరైస్సంసేవ్యమానం సదా
విశ్వామిత్రపరాశరాదిమునిభిస్సంస్తూయమానం భజే. 16

చ. క్షితిసుతవామభాగమునఁ ♦ జేరి నసింప వసిష్ఠకౌశికా
ద్యతతులు ప్రస్తుతింప రవి♦జాదిబలీముఖు లెల్లఁ గొల్వఁగాఁ
బ్రతనకిరీటకుండలవి♦భాసితసుందరధన్యమూర్తి యై
వితతమృగేంద్రపీఠమున ♦ వేడుక నొప్పెడురాము నెన్నెదన్.

తా. రత్నఖచితకిరీటకుండలములను ధరించినట్టి భుజకీర్తులతో హారములతోఁ గూడినట్టి సీతచే నలంకరింపఁబడిన యెడమభాగము గలిగినట్టి సింహాసనమం దున్నట్టి ప్రభువైనట్టి సుగ్రీవుఁడు మొదలగు నెల్లవానరులచే స్తోత్రము చేయఁబడినట్టి సేవించుఁ

బడుచున్నట్టి విశ్వామిత్రుఁడు పరాశరుఁడు మొదలగుమునులచే స్తోత్రముచేయఁబడు చున్న రాముని సేవించుచున్నాను.

శ్లో. రామ స్సీతాసమేతో నివసతు హృదయే సానుజం రామమీళే
రామేణ క్షీణపాప స్త్రివిధమపి కృతం కర్మ రామాయ దద్యామ్
రామాదన్యం నజానే నహి కిమపి మహోరామనామ్నః స్సమానం
రామే పశ్యామి విశ్వం భువన మనుదినం పాహి మాం రామచంద్ర.

ఉ. రాముఁడు ప్రోచు సంతతము • రాము నుతింతును రాముచేత ము
త్కాయమితమ్ముఁ ఖలించు నిరంతరంబును రాముని కేను మ్రొక్కెదన్
రాముని కెక్కు డెవ్వఁ డిఁక • రాముని పాదము నెంతు రాముపైఁ
బ్రేమ జెలంగు మద్హృదయపీఠి నసింపుము రామ వేఁడెదన్. 17

తా. సీతతోఁగూడిన రాముఁడు నాహృదయమున నుండుఁగాక తమ్ములతోఁగూడినరాముని నుతించుచున్నాను. రామునిచే క్షీణించినపాపము గలవాఁడనైన మనోవాక్కాయములచేఁ జేసినకర్మ రామునికి సమర్పించెదను. రామునికంటె నితరులెఱుఁగను. రామనామముతో సమానమైన దేదియులేదు. సర్వలోకమును రామునియందుఁ జూచుచున్నాను. వీరుఁడవైన యోరాముఁడా నన్ను రక్షించుము,

శ్లో. రామం రాజశిఖామణిం రఘుపతిం దేవారిదర్పాపహం
లోకానాం హితకారిణం గుణనిధిం కారుణ్యపుణ్యోదయమ్
ముక్తావిద్రుమరత్నశోభితతనుం సౌందర్యహస్తాంబుజం
కౌసల్యాతనయం భజామి సతతం శ్రీజానకీనాయకమ్. 18

చ. మరకతముఖ్యరత్నసుమమూర్తివిశవిగ్రహుఁ గౌసలేయు దు
ర్భరదనుజప్రహారు రఘురాజశిఖామణి జానకీమనో
హరుఁద్రిజగద్ధితుఁ శమదమాద్యఖిలైకగుణాకరుఁ సురే
శ్వరనుతు రాజచంద్రు బుధవత్సలు ధార్మికు నాశ్రయించెదన్.

తా. రాజశ్రేష్ఠుఁడైనట్టి రఘువంశశ్రేష్ఠుఁడైనట్టి రాక్షసగర్వమును హరించునట్టి జగత్తులకు హితముఁజేయునట్టిగుణములకుఁ స్థానమైనదయయొక్కయుఁ బుణ్యములయొక్కయు నభివృద్ధిగలిగినట్టి ముత్యములచేఁ బగడములచే రత్నములచేఁ బ్రకాశింపఁజేయఁబడు శరీరముగలిగినట్టి సౌందర్యప్రధానములైన హస్తపద్మములు గలిగినట్టి కౌసల్యకుఁ గొమారుఁడైనట్టి సీతకుఁ బెనిమిటి యైనరాముని సేవించుచున్నాను.

శ్లో. రామం వీరాసనస్థం హృదయగతకరోదంచితజ్ఞానముద్రం
జానున్యాసక్తహస్తం క్షితివరతనయా భూషితం వామభాగే

షట్కోణే వ్యాహరంతం పవనసుతయుతం సూనసే మానయంతం
సుగ్రీవే సేవమానే దృఢశరధనుషా దక్షిణే లక్ష్మణేన. 19

మ. శరచాపాన్వితుఁ డైనలక్ష్మణుఁడు నా•క్ష్మాపుత్రి పార్శ్వస్థు లై
కర మొప్పన్ రవిజుండు గొల్వఁగను వ్యా•ఖ్యానంబు సామీరికిన్
వరషట్కోణనివాసి యై దెలుపుస•త్సజ్జున్ సువీరాసన
స్థిరు హృత్సంస్థితబోధము ద్రకరు సం•స్నిగ్ధోరుపర్వోజ్జ్వల
త్కరపద్మున్ రఘురామచంద్రు మనసా•కాంతు న్విలోకింపుమా.

తా. వీరాసనమందున్నట్టి ఊరమునకు సమీపమందున్న జ్ఞానముద్ర గలిగినట్టి మోకాలియందుంచిన హస్తముగలిగినట్టి ఎడమవైపున సీతచే నలంకరింపబడినట్టి షట్కోణపీఠమందుండి హనుమంతునికి జ్ఞానోపదేశముఁ జేయుచున్నట్టి సుగ్రీవుఁడు సేవించుచుండఁగా ధనుర్బాణములతోఁ గూడిన లక్ష్మణునిచే సేవింపఁబడుచున్న రాముని మనసునఁ జింతించెద.

శ్లో. రామం సౌమిత్రిమిత్రం రఘుపతి మమలం రామచంద్రం రమేశం
రమ్యం శ్రీరాఘవేశం శుభలలితముఖం శుద్ధసత్వం సువీరమ్
సీతా సౌందర్యపాత్రం సురమునివినుతం నీరదేందీవరాభం
వందే వందారుపాలం రజనిచరహరం రమ్యకోదండరామమ్. 20

శా. రాముస్ సత్యపరాక్రమున్ వరసుమి•త్రాపుత్రమిత్రున్ రఘు
స్వామిన్ భూమిసుతాధినాథుని బుధ• స్తవ్యున్ బరేశున్ బరం
ధామున్ రాఘవు రామచంద్రుని సుధా•ధామాననున్ వారిద
శ్యాముం దైత్యవిరాముఁ గార్ముకధరున్ • సద్భక్తిఁ గీర్తించెదన్.

తా. లక్ష్మణునికి స్నేహితుఁడైనట్టి రఘుపతియైనట్టి నిర్మలుఁడైన చంద్రునివంటి యు లక్ష్మీనాథుఁడైనట్టి సుందరుఁడైనట్టి రఘుశ్రేష్ఠుఁడైనట్టి మంగళమైన సుందరమైన మొగముగలిగినట్టి పరిశుద్ధస్వరూపుఁడైనట్టి వీరుఁడైనట్టి సీతయొక్క సౌందర్యమున కాధారమైనట్టి దేవతలచే మునులచె స్తోత్రముచేయఁబడుచున్నట్టి నల్లగలువవంటి మేఘమువంటి శోభగలిగినట్టి నమస్కరించువారిని బాలించునట్టి రాక్షససంహారుఁడైనట్టి మంచిధనుస్సుచే మనోహరుఁడైనరామునికి నమస్కరించుచున్నాను.

శ్లో. రామం చందనశీతలం క్షితిసుతామోహాకరం శ్రీకరం
వైదేహీనయనారవిందమిహిరం సంపూర్ణచంద్రాననమ్

రాజానం కరుణాసమేతనయనం సీతామనోనందనం
సీతాదర్పణచారుగండలలితం వందే సదా రాఘవమ్. 21

మ. వరశ్రీచందనశీతలుఁ శుభకరుఁ ♦ న్నైదేహమోహాకరుఁ
ధరణీజాననకంజకంజహితు సీ♦తామానసస్యందనుఁ
కరుణాసంయుతలోచనుఁ మిథిలరా♦ట్కన్యామణీదర్పణ
స్ఫురదత్యున్నతగండభాగు రఘువం♦శుఁ రాము సేవించెదన్.

తా. గంధమువలెఁ జల్లనైనట్టి సీతను మోహింపఁజేయునట్టి ఐశ్వర్యమును జేయునట్టి సీతయొక్క నేత్రపద్మములకు సూర్యుఁడైనట్టి పూర్ణచంద్రునివంటి మోముగలిగినట్టి ఎల్లవారికి రాజైనట్టి దయతోఁగూడినట్టి కన్నులుగలిగినట్టి సీతయొక్క మనస్సు రథముగాఁగల(అనఁగా నామెమనస్సులో నుండువాఁడనుట)సీతయొక్క అద్దములనంటి సుందరములైన చెక్కిళ్లయందుఁ బ్రకాశించు రామునికి నమస్కరించుచున్నాను.

శ్లో. రామం శ్యామాభిరామం రవిశశినయనం కోటిసూర్యప్రకాశమ్
దివ్యం దివ్యాస్త్రపాణిం శరముఖశరధిం చారుకోదండహస్తమ్
కాలం కాలాగ్నిరుద్రం రిపుకులదహనం విఘ్నవిచ్ఛేదదక్షమ్
భీమం భీమాట్టహాసం సకలభయహరం రామచంద్రం భజేహమ్.

మ. శరచాపోజ్జ్వలహస్తు శత్రుకులని♦స్తారుఁ సహస్రాంశుకో
టిరమాభ్రాజితు వారిశోషణుని కో♦టీరార్కచంద్రార్కభా
స్వరదక్షుద్వయు విఘ్నసంహరు ఘన♦శ్యామాంగు భీమాట్టహా
సరసోద్దీపితు సాధ్వసాపహు రఘు♦స్వామిఁ భజింతుఁ మదిన్. 22

తా. చామనచాయగలిగి మనోహరుఁడైనట్టి చంద్రసూర్యులు నేత్రములుగలిగినట్టి కోటిసూర్యులవంటికాంతి గలిగినట్టి గొప్పవాఁడైనట్టి ప్రశస్తాయుధములు హస్తమందుఁ గలిగినట్టి బాణములు మొదలగు నాయుధములకు సముద్రుఁడైనట్టి సొగసైనధనుస్సు చేతియందుఁ గలిగినట్టి కాలస్వరూపుఁడైనట్టి ప్రళయాగ్నివలె భయంకరుఁడైనట్టి శత్రుసంఘముల కగ్నియైనట్టి విఘ్నములను గొట్టివేయునట్టి భయంకరుఁడైనట్టి భయంకరమైన పెద్దనవ్వుగలిగినట్టి సమస్తభయములను హరించునట్టి రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. రామచంద్రచరితాకథామృతం, లక్ష్మణాగ్రజగుణానుకీర్తనమ్
రాఘవేశ తవ పాదసేవనం, సంభవంతు మమ జన్మజన్మని. 23

ఉ. రామభవత్కథామృతము ♦ రమ్యతఁ గ్రోలఁగ నామకీర్తనల్
ప్రేమ నొనర్ప నీదుగుణ♦లీలలు సంస్మరణంబు సేయు మే

భామతినీదుపావనప•దద్వయసేవ యొనర్చునట్లుగా
మామక జన్మజన్మముల • మానక సత్కృప నిమ్ము వేఁడెదన్.

తా. ఓరామచంద్రా ! నీచరిత్రకథయను అమృతము, ఓ లక్ష్మణాగ్రజా ! నీగుణకీర్తనమును, ఓరాఘువేశా ! నీపాదసేవయును నాకుఁ బ్రతిజన్మమందు సంభవించుఁగాక

శ్లో. రామో మత్కులదైవతం సకరుణం రామం భజే సాదరం
రామేణాఖిలఘోరపాపనిహతీ రామాయ తస్మై నమః
రామా న్నాస్తి జగత్త్రయైకసులభో రామస్య దాసోస్మ్యహం
రామే ప్రీతిరతీవ మే కులగురో శ్రీరామరక్షస్వమామ్. 24

ఉ. రాముఁ డభీష్టదైవతము • రాముని భావన జేయుచుందు శ్రీ
రామునిచేత మద్దురిత•రాసు లడంగును రామభ ర్తకే
ప్రేమ నమస్కరింతు రఘు•వీరునికంటె పరంబు లేదు శ్రీ
రామున కేను దాసుఁడను • రామునియందుల భక్తి నా కగున్.

తా. రాముఁడు నాకులదేవత దయతోఁగూడిన రాముని నాదరముతోఁగూడి సేవించుచున్నాను, రామునిచే నెల్లపాపములు నశించును, రామునికి నమస్కారము. రామునికంటె సులభుఁడు లేఁడు. నేను రామునిదాసుఁడను. నాకు రామునియందు మిక్కిలియిష్టము, నాకులగురువైన యోరామా నన్ను రక్షింపుము.

శ్లో. శ్రీరామచంద్ర తవకీర్తిసురద్రుమస్య
తారాగణ స్సుమనసః ఫల మిందుబింబమ్
మూలం ఫణాఫణిగతం గగనంచ మధ్యం
శాఖాదిశో భువనమండల మాలవాలమ్. 25

ఉ. రామునికీర్తి కల్పకము • రమ్యసుమంబులు తారకల్ సుధా
ధాముఁడు తత్ఫలంబు నిది•గం బగుశాఖలు దిగ్వితానముల్
భూమి యనాది భోగవతి • మూలము మధ్యము పుష్కరం బగుఁ
రాము నుతింప నేరికి శ•రంబు కరం బతిభక్తిఁ గొల్చెదన్.

తా. ఓరామా! నీకీర్తి యనుకల్పవృక్షమునకుఁ జుక్కలు పుష్పాలు, చంద్రబింబము పండు. నాగలోకము మొదలు ఆకాశము మ్రాను. దిక్కులు కొమ్మలు భూమి పాదు.

శ్లో. వైదేహీం ముదితోభిజాతపులకాం గాఢం సమాలింగయన్
వామేన స్తనచూచుకం పులకితం వామ్యం కరేణ స్పృశన్

తత్త్వం దక్షిణపాణినాకలితయా చిన్ముద్రయా బోధయన్
రామో మారుతిసేవితస్స్మరతు మాం సామ్రాజ్యసింహాసనే. 26

శా. సీత న్మోదముఁ బొంద వామకరసం•శ్లేషంబు గావింపుచున్
బ్రీతిన్ దత్కుచ నంటి దక్షిణపుపా•ణిన్ దత్త్వముం దెల్పుచున్
వాతోత్పన్నుని సేవ గైకొనుచు సా•నందంబునన్ లోకవి
ఖ్యాతిన్ బంచముఖాసనస్థుఁ డగురా•మాధీశుఁ బ్రార్థించెదన్.

తా. పులకాంకురము గలసీతను సంతోషముతో గౌఁగిలించుకొని పులకరించిన యామెయొక్క యెడమదియైన స్తనాగ్రము నెడమచేతితో నంటుచు జ్ఞానముద్రగల కుడిచేతఁ దన్ను సేవించు నాంజనేయునకు జ్ఞానబోధఁ జేయుచు సామ్రాజ్యసింహాసనమం దున్న రాముఁడు రక్షించుఁగాక.

శ్లో. వామాంకస్థితజానకీపరిలసత్కోదండదండం కరే
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం శరం దక్షిణే
బిభ్రాణం జలజాతపత్రనయనం భద్రాద్రిమూర్ధ్నిస్థితం
కేయూరాదివిభూషితం రఘుపతిం రామం భజే శ్యామలమ్. 27

మ. శరచాపాబ్జరథాంగముల్ కరచతు•ష్కప్రాప్తమై యుండ సు
స్థిరవామాంకమునందు సీతనియతిన్ • సేవింప భద్రాద్రిపై
నిరవైనట్టిసరోజనేత్రుఁ బరు యోగీంద్రేంద్రసంస్తోత్రు భా
సురకేయూరవిభూషణుం దలఁచెదన్ • శుద్ధాంతరంగంబునన్.

తా. ఎడమతొడయందున్న సీతచే శోభించుచున్న ధనువు నొకచేతను, పైచేతఁ జక్రమును, కుడిచేతులురెంటియందు శంఖమును బాణమును భరించుచున్నట్టియు, పద్మపురేకులవంటి నేత్రములు గలిగినట్టియు, భద్రాచలశిఖరమందున్నట్టి భుజకీర్తులు మొదలగువానిచే నలంకరింపఁబడినట్టియు, నల్లనైన రఘురాజశ్రేష్ఠుఁ డైనరాముని సేవించుచున్నాను.

శ్లో. వామే భూమిసుతా పురస్తు హనుమా న్పశ్చా త్సుమిత్రాసుత
శ్శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేష్వపి
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్. 28

మ. తనవామాంకమునందు సీత చెలువొం•దన్ వెన్క సౌమిత్రి పా
వనియున్ ముంగల శత్రుఘాతి భరతుల్ • పార్శ్వంబులన్ భానునం

దనసీలాంగదముఖ్యు లన్య మగుదిక్కోనంబులం దుండఁగా
ఘనసీలాంగుదదంతరస్థితు మదిఁ గాంచింతు రామప్రభున్.

తా. ఎడమవైపున సీత, యెదుట హనుమంతుఁడు, వెనుక లక్ష్మణుఁడు, ప్రక్కల భరతశత్రుఘ్నులు, వాయవ్యాదిమూలదిక్కులయందు సుగ్రీవుఁడు, విభీషణుఁడు, అంగదుఁడు, జాంబవంతుఁడు నుండఁగా మధ్యమందు నల్లగలువవలె సుందరమైనకాంతిగల రాముని సేవించుచున్నాను.

శ్లో. వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సంస్థితమ్
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరమ్
వ్యాఖ్యాతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. 29

ఉ. భాసురకల్పమూలమున భర్మగృహంబున బుష్పకాంతరో
పాసితనూత్నరత్నమయపంచముఖాసనమందు ముఖ్యవీ
రాసనుఁడై సతీసహితుఁడై పరతత్త్వము సోదరాన్వితుం
డై సరస న్మరుత్సుతసమర్చితుఁడైనవిభుఁ భజించెదన్.

తా. కల్పవృక్షముల క్రింద బంగారుమంటపమందుఁ బుష్పకమునడుమ మాణిక్యపీఠమందు సీతతోఁగూడ వీరాసనమందున్నట్టియు నెదుట నాంజనేయుఁడు చదువుచుండఁ బరతత్త్వమును మునులకుఁ జెప్పుచు భరతుఁడు మొదలగువారిచే నావరింపఁబడిన నల్లనైన రాముని సేవించుచున్నాను.

శ్లో. వైదేహీం పరిరభ్య జాతపులకాం లజ్జావతీం సుస్మితామ్
కాంచీనూపురహారకంకణలసత్కర్ణావతంసోజ్జ్వలామ్
కస్తూరీఘనసారచర్చితకుచాం చంద్రాననాం శ్యామలమ్
కందర్పాధికసుందరం రఘుపతిం శ్రీరామచంద్రం భజే. 30

చ. దరహసితాననన్ బులకితన్ ఘనసారమృగీమదాగరు
స్ఫురదనులేపనన్ గనకభూషణభూషితఁ బూర్ణచంద్రచం
ద్రికవదనన్ విదేహతనుజన్ మది రంజిలఁ జేర్చునట్టికం
ధరసమవర్ణునిం గడకటప్రతిమానుని రాము నెన్నెదన్.

తా. పులకాంకురములుగలిగి సిగ్గుగలదియై నవ్వుమొగముగలిగి ఒడ్డాణము, అందెలు, హారములు, కడియములు, కర్ణపువ్వులు అనువానిచేఁ బ్రకాశించుచు కస్తూరిచేఁ గర్పూరముచేఁ బూయబడిన స్తనములుగలిగినట్టి చంద్రునివంటి మొగముగల సీతను

గాఁగిలించుకొని నల్లనివాఁడై మన్మథునికంటె మిక్కిలి సౌందర్యముగలిగినట్టి రఘు వంశశ్రేష్ఠుఁడైనరాముని సేవించుచున్నాను.

శ్లో. వైదేహీరమణం విభీషణవిభుం విష్ణుస్వరూపం హరిం
విశ్వోత్పత్తిప్రపత్తిపోషణకరం విద్యాధరైరర్చితం
వైరిధ్వంసకరం విరించిజనకం విశ్వాత్మకం వ్యాపకం
వ్యాసాంగీరసనారదాదివినుతం వందామహే రాఘవమ్. 31

చ. జనకసుతాధినాథు రిపు♦జైత్రు సురార్చితు సర్వలోకసం
జననవినాశకారణుఁ బ్ర♦శస్తచరిత్రు విభీషణావనుఁ
సనకసనందనాద్యఖిల♦సన్మునిసన్నుతు విష్ణురూపునిఁ
వనరుహసూతితండ్రి రఘు♦నర్యు హరిఁ శరణంబు వేఁడెదన్.

తా. సీతకుఁ బెనిమిటియు, విభీషణు నేలినవాఁడును, విష్ణురూపుఁడును, పాప సంహారకుఁడును, ప్రపంచమును బుట్టించుటకు నేలుటకు వృద్ధిఁజేయుటకు హేతువైన వాఁడును, విద్యాధరులచే నమస్కరించఁబడువాఁడును, శత్రుసంహారముఁజేయునట్టియు, బ్రహ్మకుఁ దండ్రియైనట్టి ప్రపంచస్వరూపుఁడును, అంతట వ్యాపించియున్నట్టి వ్యాసుఁడు, అంగిరసుఁడు, నారదుఁడు మొదలగు మునులచే స్తోత్రముచేయఁబడుచున్నట్టి రాముని నమస్కరించుచున్నాము.

శ్లో. [1]వైదేహస్యపురే వివాహసమయే కల్యాణవేద్యంతరే
సామోదే విమలేందురత్నఖచితే పీఠే వసంతౌ శుభే
శృణ్వంతౌ నిగమాన్తతత్త్వవిదుషా మాశీర్గిరస్సాదరం
పాయాస్తాం సువధూవరౌ రఘుపతి శ్రీజానకీచానిశమ్. 32

చ. పరిణయవేళ మైథిల నృ♦పాలగృహాంతరరత్నవేదికః
సురుచిరవేదవిద్బుధసు♦సూక్తులు వించు సమంచితంబుగాఁ
బరగ వధూవరత్వమున ♦ భాసిలి భూవరసేవ్యులైనయా
ధరణిసుతారఘూద్వహు లు♦దారమతిఁ మముఁ బ్రోతు రెప్పుడున్.

తా. మిథిలాపట్టణమందుఁ బెండ్లివేళ మంగళవేదికయందు మంచిదియై నిర్మలములైన చంద్రకాంతమణిఖచితమై శుభమైనపీఠమందుఁ గూర్చున్నట్టి వేదార్థముల నెఱింగిన విద్వాంసుల యాశీర్వచనములను వినుచున్నట్టి ప్రకాశించుచున్నట్టి పెండ్లికూఁతురు పెండ్లికొడుకునైన రఘువంశమును శోభింపఁజేయునట్టి సీతారాములు రక్షింతురుగాక.

1 'మైథిల్యానగరే' అని పాఠాన్తరము.

శ్లో. అసితకమలభాసాభాసయంతం త్రిలోకమ్
దశరథకులదీపం దైవతాంభోజభానుమ్
దినకరకులబాలం దివ్యకోదండపాణిమ్
కనకఖచితరత్నాలంకృతం రామమీళే. 3

మ. ఘననీలాంబుదకాంతిదేహు భువనైకభాస్విజితుఁ దేవతా
వనజాతాంబుజమిత్రు భానుకులభాస్వత్కీర్తిసాంద్రుఁ శరా
సనబాణోజ్జ్వలహస్తరత్న విలసత్స్వర్ణసద్భూషణుఁ
మునిసంస్తోత్రచరిత్రు దాశరథిరాముఁ గొల్తు నెల్లప్పుడున్.

తా. నల్లకలువవంటికాంతిచేత మూఁడులోకములను ప్రకాశింపఁజేయువాఁడును, దశరథునివంశమును ప్రకాశింపఁజేయువాఁడును, దేవతలను పద్మములకు సూర్యుఁడైనవాఁడును, సూర్యవంశబాలుఁడును, మంచిధనుస్సు హస్తమందుఁగలవాఁడును, బంగారమందుఁ గూర్చఁబడిన రత్నాలంకారములుగలవాఁడు నగురాముని స్తోత్రముచేయుచున్నాను.

శ్లో. సుస్నిగ్ధం నీలకేశం స్ఫుటమధురముఖం సుందరభ్రూలలాటం
దీర్ఘాక్షం చారునాసాపుట మమలమణిశ్రేణికాదంతపఙ్క్తిం
బింబోష్ఠం కంబుకంఠం కఠినతరమహోరస్క మాజానుబాహుం
ముష్టిగ్రాహ్యావలగ్నం పృథుజఘనము దారోరుజంఘాంఘ్రి మీళే.

ఉ. చారువిశాలనేత్రు విలసన్మధురాననునీలకేశు శృం
గారలలాటు దీర్ఘకరుఁ గంబుగళుఁ రమణీయనాసికుఁ
క్రూరభుజాంతరుఁ సరసకుందరదుఁ దనుమధ్యసుందరుఁ
సారససైకతాంఘ్రివిలసజ్జఘనుఁ రఘురాముఁ గొల్చెదన్. 34

తా. నల్లనైనట్టి నల్లనివెండ్రుకలు గలిగినట్టి చక్కని మొగము గలిగినట్టి చక్కని కనుబొమలు నుదురుగలిగినట్టి గొప్పనేత్రములుగలిగినట్టి చక్కనిముక్కుగలిగిన మంచి రత్నములవంటి దంతపఙ్క్తిగలిగినట్టి దొండపండువంటి పెదవిగలిగినట్టి శంఖమువంటికంఠముగలిగినట్టి మిక్కిలి కఠినమైన గొప్పరొమ్ముగలిగినట్టి మోకాళ్లవఱకుఁ జేతులుగలిగినట్టి పిడికిలిచేఁబట్టఁదగిన నడుముగలిగినట్టి గొప్పపిఱుఁదుగలిగినట్టి గొప్పపిక్కలు పాదములుగల రాముని స్తుతించుచున్నాను.

శ్లో. వందామహే మహేశాన, చండకోదండఖండనమ్
జానకీహృదయానంద, చందనం రఘునందనమ్. 35

చ. జలనిధి వేష్టితాఖిలర♦సాభృదహీంద్రవిభూషణాదికో
జ్వలహరచాపఖండనవి♦శాల భుజాబలశాలికిం దయా
జలధికి భూమిజాహృదయ♦సారసహేళికి శీలికి న్మహా
బలతనయార్చితాంఘ్రినవ♦పద్మునకుం శరణం బొనర్చెదన్.

తా. ఈశ్వరుని తీక్ష్ణమైన ధనుస్సును విరిచినట్టియును సీతయొక్క మనస్సును సంతోషింపఁజేయుటకుఁ జందనప్రాప్తమైన శ్రీరామమూర్తిని నమస్కరించుచున్నాను.

శ్లో. జానాతి రామ తవనామ రుచిం మహేశో
జానాతి గౌతమసతీచరణప్రభావమ్
జానాతి దోర్బలపరాక్రమ మీశచాపో
జానా త్యమోఘపటుబాణగతిం పయోధిః. 36

ఉ. తారకనామమంత్రరుచి♦దక్షునుతారమణుం డెఱుంగు నీ
పావనపాదపంకజప్ర♦భావ మహల్య యెఱుంగు మిక్కిలిన్
దేవరదోర్బలంబు శివ♦దేవునిచాప మెఱుంగు నీదుమే
ధావిభవంబు గల్గుశర♦ధాటి సముద్రుఁ డెఱుంగు రాఘవా.

తా. ఓ రామా! నీనామముయొక్క రుచి నీశ్వరుఁడెఱుఁగును. నీపాదసామర్థ్యమును అహల్యయెఱుఁగును. నీభుజపరాక్రమము శివధనుస్సెఱుఁగును. నీబాణప్రయోగమును సముద్రుఁ డెఱుఁగును.

శ్లో. ఉద్యస్యందనమధ్యగం రణరణచ్చాపాన్వితం భీషణం
కాలాగ్నిప్రతిమానబాణకలితం ఘోరాస్త్రతూణీద్వయమ్
సుగ్రీవాంగదరావణానుజమరుత్పుత్రాదిసంసేవితమ్
రామం రాక్షసవీరకోటిహరణం రక్తాంబుజాక్షం భజే. 37

శా. సారస్యందనమధ్యగున్ రణరణ♦చ్చాపాన్వితున్ రాఘవున్
ఘోరాగ్నిప్రతిమానబాణకలితున్ ♦ క్రూరాస్త్రతూణీద్వయున్
సూరాత్మోద్భవరావణానుజమరు♦త్పూనాద్యాదిసంసేవితున్
వీరున్ రక్తసరోజనేత్రుహతవి♦ద్వేషున్ బ్రశంసించెదన్.

తా. శ్రేష్ఠమైనరథమధ్యమును బొందినట్టి ధ్వనిచేయుచున్న ధనుస్సుతోఁ గూడినట్టి భయంకరుఁడైనట్టి ప్రళయాగ్నితో సమానమగు బాణముతోఁగూడినట్టి భయంకరబాణములుగల యంబులపొది జోడుగలిగినట్టి సుగ్రీవుఁడు, అంగదుఁడు,

విభీషణుఁడు, ఆంజనేయుఁడు మొదలగువారిచే సేవింపఁబడుచున్నట్టి బహురాక్ష సంహారముఁ జేయునట్టి యెఱ్ఱదామరలవంటి నేత్రములుగల రాముని సేవింప చున్నాను.

శ్లో. బ్రహ్మాద్యామరసిద్ధజన్మభువనం యన్నాభిపంకేరుహమ్
శ్రీనిర్వాణనికేతనం యదుదరం లోకైకశయ్యాగృహమ్
యద్వక్షఃకమలావిలాసభవనం యన్నామమంత్రం సతామ్
వాసాగారముఖండమంగళనిధిః పాయాత్సనో రాఘవః. 38

ఉ. ఎవ్వనినాభిపద్మము రమాహిత విధిముఖ్యులజన్మకారణం
బెవ్వనివక్ష మిందిరకు నింపగునట్టివిలాసమందిరం
బెవ్వఁడు ముక్తికిన్ సదన మెవ్వఁ డశేషజగద్విధాయకుం
డెవ్వనినామ మెంతురు మునీశ్వరు లారఘురాముఁ గొల్చెదన్.

తా. ఎవనినాభిపద్మము బ్రహ్మాదిదేవతలకు జన్మదేశమో, లక్ష్మీదేవికి సుఖగృహమైన యెవ్వనిగర్భము లోకమునకుఁ బడకయిల్లో, (అనఁగా లోకములు స్వామిగర్భములో నుండు ననుట) ఎవనిరొమ్ము లక్ష్మికి నాటయిల్లో, ఎవ్వనినామము సత్పురుషులకు నివాసగృహమో, అట్టి సర్వశుభాకరుఁడైన రాముఁడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో. శృంగారం క్షితినందనీవిహరణే వీరం ధనుర్భంజనే
కారుణ్యం బలిభోజనేద్భుతరసం సింధౌగిరిస్థాపనే
హాస్యం శూర్పణఖాముఖే భయవహే బీభత్సమన్యాముఖే
రౌద్రం రావణమర్దనే మునిజనే శాంతం వపుః పాతు నః. 39

మ. ధరణీపుత్రిమునీంద్రశంకరధనుర్దైత్యారిలంకాపురీ
శ్వరవైరోచనరావణానుజులకున్ సాధారణప్రాఢిచే
వరశృంగారము శాంతవీరభయబీభత్సాద్భుతోగ్రంబులున్
గరుణాహాస్యరసంబు లుప్పతిలురాగ్గాత్రంబు భావించెదన్.

తా. సీతతో విహరించునపుడు శృంగారరసమును, శివధనుర్భంగమందు వీరరసమును, కాకాసురునియందుదయయును, సముద్రమునఁ బర్వతములుంచునపుడు ఆశ్చర్యరసమును, శూర్పణఖమోమున హాస్యరసమును ఇతరస్త్రీలమోమున బీభత్సమును (అనఁగా నసహ్యత), రావణసంహారమందు రౌద్రరసమును, మునీశ్వరులయందు శాంతరసమును అయిన స్వరూపము మమ్ము రక్షించుఁగాక.

శ్లో. మాతా రామో మత్పితా రామచంద్రో
భ్రాతా రామో మత్సఖా రాఘవేశః
సర్వస్వం మే రామచంద్రో దయాళుః
నాన్యం దైవం నైవజానే నజానే. 40

ఉ. రాముఁడు తండ్రి మజ్జనని ♦ రాముఁడె భ్రాతయు రామచంద్రుఁడే
రాముఁడె మిత్రుఁడు న్గురుఁడు ♦ రాముఁడె సర్వధనంబు రాముఁడే
రాముఁడె సత్కృపాకరుఁడు ♦ రామునితోసరి యన్యదైవముల్
వేమఱు లేదు లేదనుచు ♦ పేర్మి భజించెద నిష్టసిద్ధికిన్.

తా. తల్లి తండ్రి సోదరుఁడు స్నేహితుఁడు అన్నియు నాకు రాముఁడే. వేఱుదైవమును నే నెఱుఁగ నే నెఱుఁగను.

శ్లో. మూలేకల్పద్రుమస్యాఖిలమణివిలసద్రత్నసింహాసనస్థం
కోదండేనాశుగేనోల్లసితకరయుగేనార్చితం లక్ష్మణేన
వామాంకన్యస్తసీతం భరతభృతమహామౌక్తికచ్ఛత్రకాంతిమ్
శత్రుఘ్నే చామరాభ్యాం సువిలసితకరే రామచంద్రం భజేహమ్.

చ. సురతరుమూలమందు మణి ♦ శోభితపీఠిని సీతతో వసిం
పరహి సుమిత్రపుత్రకుఁడు ♦ మార్గణచాపము లంది యివ్వఁగా
భరతుఁడు పుండరీకనిభ ♦ శుభ్రసితిః బాల్పఁగ శత్రుఘ్నుఁ డాచా
మరలును వీవఁ జెన్నలరు ♦ నుత్తమగర్వితభు రాము నెన్నెదన్. 41

తా. కల్పవృక్షము మొదట సర్వరత్నములతోఁ గూడినపీఠమందున్నట్టియు, ధనుర్బాణములచే సొగసైనహస్తములుగల లక్ష్మణునిచేఁ బూజింపఁబడుచున్నట్టియు, ఎడమ తొడయందు సీతనుంచుకొనినట్టి భరతునిచే ధరింపఁబడిన ముత్యాలగొడుగు గలిగినట్టియు, వింజామరలధరించిన శత్రుఘ్నుఁడుగల రాముని సేవించుచున్నాను.

శ్లో. వామే కోదండదండం నిజకరకమలే దక్షిణే బాణ మేకమ్
పశ్చాద్భాగేచ నిత్యం దధత మభిమతం చారుతూణీరభారమ్
వామే ఽవామే చ లంబిభ్యాం సహామిళితతను జానకీలక్ష్మణాభ్యామ్
రామం శ్యామం భజేహం ప్రణతజనమనః ఖేదవిచ్ఛేదదక్షమ్. 42

చ. ఇరుగడలందు లక్ష్మణమహీసుతలుం జెలువొందఁ దూణముల్
శరము శరాసనంబు వరుస న్గరమాంగకరంబులందు వి

స్ఫురితం దనర్చు భక్తజనపుంజవిపద్ధరుం డైనరామభూ
వరుండు జగద్గురుండు భగవంతుం డనంతుండు నన్నుం బ్రోవుతన్.

తా. ఎడమచేత ధనుస్సు కుడిచేత బాణము వెనుక నంబులపొది యిరుప్రక్కల సీతాలక్ష్మణులు గలిగి నమస్కరించువారిదుఃఖమును బోఁగొట్టునట్టి చామనచాయగల రాముని సేవించుచున్నాను

శ్లో. అంభోధరశ్యామలమంబుజాక్షం
ధనుర్ధరం వీరజటాకలాపం
పార్శ్వద్వయే లక్ష్మణమైథిలీభ్యాం
నిషేవ్యమాణం ప్రణమామి రామమ్. 43

మ. శరదశ్యామలగాత్రుఁ బార్శ్వయుగళస్థానావనీజానుజుం
గురుతామ్రాంశుజటాకలాపువిలసత్కోదండహస్తుం బరా
త్పరుఁ బంకేరుహపత్రనేత్రుఁ గరుణాపాత్రుం బుధస్తోత్రు ఖే
చరసత్పుత్రు సురారిజైత్రు రఘువంశస్వామిఁ గీర్తించెదన్.

తా. మేఘమునలె నల్లనైనట్టి పద్మమువంటి నేత్రములుగలిగినట్టి ధనుస్సును ధరించినట్టి వీరుఁడును జటాసమూహముగలవాఁడును అయినట్టి రెండుప్రక్కల సీతాలక్ష్మణులచే సేవింపఁబడుచున్న రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. కోదండదీక్షాగురు మప్రమేయం, సలక్ష్మణం దాశరథిం దయాళుమ్
ఆజానుబాహుం జగదేకవీర, మనాథనాథం రఘునాథమీడే. 44

మ. గురుకారుణ్యపయోనిధానువిలసత్కోదండదీక్షాగురుం
వరకల్యాణగుణాకరుం శుభకరుం వైదేహీసంయుక్తు దా
శరథిం లక్ష్మణసేవ్యు నార్తజనరక్షాదక్షదీక్షాకరుం
బరు నాజానుకరుం జగన్మనోహారిం భక్తిం బ్రశంసించెదన్.

తా. ధనుస్సు (ధరించుట యను) దీక్షయందు దెల్లరకు గురువైనట్టి ఇంతటివాఁడని ప్రమాణించశక్యముగానట్టి లక్ష్మణునితోఁ గూడినట్టి దశరథపుత్రుఁడైనట్టి దయగలిగినట్టి మోకాళ్లనంటు బుజములుగలిగినట్టి జగములయందుఁ బ్రధానవీరుఁడైనట్టి దిక్కులేనివారి నేలునట్టి శ్రీరాముని స్తుతిఁ జేయుచున్నాను.

శ్లో. కర్పూరాంగవిలేపనం రఘువరం రాజీవనేత్రం ప్రభుమ్
కస్తూరీనికరాకృతిం ఖరధృతిప్రధ్వంసినం శ్రీహరిమ్

కందర్పాయుతకోటిసుందరతనుం కామారిసేవ్యం గురుమ్
కాంతాకామద మప్రమేయ మమలం సీతాసమేతం భజే. 45

మ. ఘనకర్పూరవిలేపనుఁ రఘువరుఁ గామారిసేవ్యుఁ ఘనా
ఘనగాత్రుఁ సరసీజనేత్రు ఖరరక్షోధ్వంసిరాముఁ సనా
తనుఁ గందర్పశతోత్తమాకృతిని గాంతాకాముఁ శ్రీహరిఁ
జనకక్ష్మారమణాత్మజానన సరోజాతార్కు భావించెదన్.

తా. కర్పూరము దేహమునఁ బూసికొనినట్టి రఘువంశశ్రేష్ఠుఁడైనట్టి పద్మము వంటి నేత్రములు గలిగినట్టి కస్తూరిస్రోగువంటిరూపము గలిగినట్టి ఖరాసురుని ధైర్యము నుబోఁగొట్టినట్టి విష్ణుస్వరూపుఁడైనట్టి కోటిమన్మథులవంటి సౌందర్యము గలిగినట్టి యీశ్వరునిచేత సేవింపఁదగినట్టి స్త్రీలకుఁ గామములు బుట్టించునట్టియుఁ బ్రమాణింప శక్యముగానట్టియు నిర్మలుఁడైనట్టి సీతతోఁగూడినరాముని సేవించెదను.

శ్లో. నీలాబ్దబృందసదృశం పరిపూర్ణదేహమ్
దిక్పాలకాదిసురసేవితపాదపద్మమ్,
పీతాంబరం కనకకుండలశోభితాంగమ్
సీతాపతిం రఘుపతిం సతతం భజామి. 46

మ. మృగనాభీనిభసుందరాంగుభవసన్మిత్రుఁ బవిత్రుఁ లస
న్నిగమాంతార్థవిచారవర్యు నుతవాణీనాథుఁ బీతాంబరుఁ
దిగధీశానముఖామరావనుని ధాత్రీపుత్రికాధీశ్వరుఁ
భగవంతు న్మణికుండలాభరణు సంభావింతు నశ్రాంతమున్.

తా. నల్లనిమేఘమువంటి సర్వలక్షణపూర్ణమైన దేహముగలవాఁడును, పీతాంబరము ధరించినవాఁడును, బంగారుమకరకుండలములచేతఁ బ్రకాశించువాఁడును, సీతాదేవికిభర్తయైనవాఁడును నగు శ్రీరాముని నెల్లప్పుడును గొల్చుచున్నాను.

శ్లో. భర్గబ్రహ్మసురేంద్రముఖ్యదివిజప్రాంచత్కిరీటాగ్రసం
సర్గానేకమణిప్రభాకరసహస్రాభం పదాంభోరుహే
దుర్గాసంతతసంస్తుతాంఘ్రికమలం దుర్వారకోదండినం
గంగావిస్ఫుటమౌళిమానసహరం కల్యాణరామం భజే. 47

శా. భర్గాంభోజభవేంద్రముఖ్యదివిజప్రాంచత్కిరీటాగ్రసం
సర్గానేకమణిప్రభాకరసమంచత్పాదపంకేరుహుఁ
దుర్గాసంతతసన్నుతాంఘ్రియుగళుఁ దోషాపహుఁ నౌనిరా
ట్స్వర్గప్రస్తుతు శంభుమానసహరుఁ వైకుంఠుఁ బ్రార్థించెదన్,

తా. శివబ్రహ్మేంద్రాది దేవతలకిరీటములయందలి మాణిక్యకాంతులసమూహము చేత నొప్పుచున్న పాదములు గలిగినట్టి పార్వతిచే నెల్లప్పుడు స్తోత్రము చేయఁబడిన పాదపద్మములు గలిగినట్టి నివారింపశక్యముగాని ధనుస్సు గలిగినట్టి యీశ్వరునిమనో హరుఁడైన రాముని సేవించుచున్నాను.

శ్లో. అగ్రే ప్రాంజలి మాంజనేయ మనిశం వీరంచ తారాసుతం
పార్శ్వే పఙ్క్తిముఖానుజం పరిసరే సుగ్రీవ ముగ్రాననే,
పశ్చాల్లక్ష్మణ మంతికే జనకజాం మధ్యే స్థితం రాఘవమ్
చింతామాలికయా లిఖంతి సుధియ శ్చిత్తేషు పీతాంబరన్. 48

చ. పవనజుఁ డంగదుం డెదుటఁ బ్రాంజలులై వినుతింపఁ జెంగటన్
రవిసుత రావణానుజులు రంజిల వెన్క సుమిత్రసూనుఁ డా
యవనితనూజ చేరువను హర్ష మొసంగఁగ సింహపీఠిరు
క్మవనజకర్ణికన్ వెలయు మాధవుఁ జిత్తములోఁ దలంచెదన్.

తా. ఎదుటదోసిలిగల యాంజనేయుని, పార్శ్వమందు వీరుఁడైన యంగదుని, సమీపమందు విభీషణుని, ఎదుట పీఠమందు సుగ్రీవుని, వెనుక లక్ష్మణుని, సమీపమున సీతను, మధ్యను పచ్చనిబట్టగలరాముని నున్నవానిఁగా విద్వాంసులు (అనఁగా జ్ఞానులు) ధ్యానమనుకలముచేతఁ జిత్తములయందు వ్రాయుచున్నారు. (అనఁగా అట్లు ధ్యానముఁజేయుచున్నా రనుట.)

శ్లో. క్షీరాంభోనిధి మధ్యవర్తిని సితే ద్వీపే సువర్ణాచలే
రత్నోల్లాసితకల్పభూరుహతలే జాంబూనదే మండపే,
తేజోభ్రాజితవేదికే సురుచిరే మాణిక్యసింహాసనే
హేమాంభోరుహకర్ణికోపరితలే వీరాసనస్థం భజే. 49

మ. తెలిదీవిన్ గనకాద్రిదుగ్ధనిధినుద్దీప్తామరానోకహ
స్థలజాంబూనదమంటపంబున విభాసద్వేదికారంజితో
జ్జ్వలసింహాసనజాతరూపమయకంజాతస్ఫురత్కర్ణికా
స్థలివీరాసనయుక్తుఁడైన రఘువంశస్వామిఁ గీర్తించెదన్.

తా. పాలసముద్రమునడుమనున్న శ్వేతద్వీపమందు బంగారుకొండయందు రత్నములచేత శోభించు కల్పవృక్షములక్రింద బంగారుమంటపమందు తేజముచేత నొప్పుచున్న యరుగుగల మనోహరమైన మణిసింహాసనమందు బంగారుపద్మపుమిద్దెపై వీరాసనమందున్న రాముని సేవించుచున్నాను.

శ్లో.దోర్దండేనచమండలీకృతమహాకోదండచండాశుగై
ర్నిర్ఘాతైరవికోటితుల్యనిశితై ర్బ్రహ్మాదిముఖ్యైస్తుతైః,
సుగ్రీవాదిసమస్తవానరవరా నాజ్ఞాపయంతం గిరా
దైత్యాన్ తాడయ తాడయే త్యనుపదం శ్రీరామచంద్రం భజే. 50

మ. కరదండంబున మండలీకృతమహా♦కాండాననోన్ముక్తభా
స్వరకోటిప్రకటప్రభానిశితని♦ర్ఘాతంబులై పద్మజా
మరసంస్తోత్రములైనబాణములచే ♦ మర్దింపుచున్ వేగవా
నరసంఘంబులతోడ దైత్యవరులన్ ♦ మర్దింపు మర్దింపు మం
చు రయం బొప్పఁగఁ దెల్పు రాఘవసుధీ♦శుం డిచ్చు నిష్టార్థముల్.

తా. పిడుగులతోఁ దుల్యములైనట్టియుఁ గోటిసూర్యులతోఁ దుల్యముగాఁ దీక్ష్ణములై బ్రహ్మాదులచే నుతింపఁబడుచున్నట్టి భుజములచేత లాగఁబడి గుండ్రమైన ధనుస్సుయొక్క బాణములచేత నొప్పుచు రాక్షసులను గొట్టుకొట్టుమని సుగ్రీవాదివానరుల నాజ్ఞాపించుచున్న రాముని సేవించుచున్నాను.

శ్లో.భూకంపం జనయ న్నభో విదళయ న్నంభోనిధిం క్షోభయన్
దైతేయాంశ్చ విమర్దయన్ గిరివరాన్ భిందన్ దిశః పూరయన్,
వైదేహీ మతిమోదయన్ సకలగీర్వాణాన్ శిరఃకంపయన్
కల్యాణో రఘురామబాణవిలసత్కోదండచండధ్వనిః. 51

ఉ. రామునిచాపమౌర్విశుభ♦రావమునన్ దలలూఁపు దేవతా
స్తోమము దైత్యు లార్తి గని ♦ సోలుదు రబ్ధులు మ్రోయు మైథిలీ
భామిని సంతసించువడి ♦ బ్రద్ధ లగున్ వసుధాధరంబులున్
భూమి చలించు నంబరము ♦ బూరటిలున్ దిశలెల్ల ఘూర్ణిలున్.

తా. శుభప్రదమగు రామునిబాణముచేత నొప్పుచున్న ధనస్సుయొక్క చప్పుడు భూకంపమును బుట్టించుచు నాకాశము బ్రద్దలుసేయుచు సముద్రముం గలిపివేయుచు రాక్షసులమర్దించుచుఁ బర్వతములను బ్రద్దలుగొట్టుచు దిక్కులను నిండించుచు సీతను సంతసింపఁజేయుచు దేవతలం దలలూఁచునట్లు జేయుచు వ్యాపించెను.

శ్లో.విమలకమలనేత్రం విస్ఫురన్నీలగాత్రం
తపనకులపవిత్రం దానవధ్వాంతమిత్రమ్,
భువనశుభచరిత్రం భూమిపుత్రీకళత్రం
దశరథవరపుత్రం నౌమిరామాఖ్యమిత్రమ్. 52

చ. సరసిజపత్రనేత్రు సురశాత్రవజైత్రుఁ బత్రిపత్రునిఁ
ధరణిసుతాకళత్రు జనతానుతిపాత్రుని రాజపుత్రు భా
సురసుచరిత్రు నీలమణిశోభితగాత్రు మహేశమిత్రు భా
స్కరకులసత్పవిత్రు గుణసాంద్రు రఘూద్వహు నాశ్రయించెదన్.

తా. స్వచ్ఛమైన పద్మములవంటి నేత్రములు గలిగినట్టి ప్రకాశించుచున్న నల్లని శరీరముగలిగినట్టి సూర్యవంశమునందుఁ బవిత్రుఁడైనట్టి రాక్షసులను చీకటికి సూర్యుఁడైనట్టి లోకములకు శుభకరమైనచరిత్రగలిగినట్టి సీతాదేవిభార్యగలయట్టిదశరథునికొమారుఁడైన స్నేహితుఁడైన రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. జననీజానకీసాక్షా జ్జనకో రఘునందనః
లక్ష్మణో మిత్ర మస్మాకం కోపిచారః కుతోభయమ్,
జనకో రామచంద్రో మే జననీజనకాత్మజా
హనుమత్ప్రముఖా స్సర్వే హరయో మమబాంధవాః. ౫౩

చ. జనకుఁడు రామచంద్రుఁ డగు జానకి తల్లి సుమిత్ర సూతి మా
కనయము మిత్రుఁ డంగదమహాబలపుత్రవిభీషణార్కనం
దనముఖు లాత్మబాంధవజనంబులు గాన విచారముఁ భయం
బును కలుషంబు దీనతయుఁ బొందునె మామకమానసంబునన్.

తా. మాకు సీత తల్లి రాముఁడు తండ్రి లక్ష్మణుఁడు స్నేహితుఁడు హనుమంతుఁడు మొదలగువానరులందఱు బంధువులు అయియుండఁగా నేమివిచారము. ఎందువలన భయము.

శ్లో. జగతివిశదమంత్రం జానకీప్రాణమంత్రం
విబుధవినుతమంత్రం విశ్వవిఖ్యాతమంత్రమ్,
దశరథసుతమంత్రం దైత్యసంహారమంత్రం
రఘుపతినిజమంత్రం రామరామేతిమంత్రమ్. 54

చ. సకలజగత్పవిత్రము నిశాచరజైత్రము ధారుణీసుతా
ధికప్రమదప్రదం బఖిలదిక్పరిపాలనపాలనంబు సే
వకజనకల్పకంబు భయవారణవారణకేసరోపమం
బకలుష మద్వితీయ మఖిలార్తివిరామము రామమంత్రమున్.

తా. రామరామా అనుమంత్రము ప్రపంచమున నిర్మలమైనమంత్రము. సీతకుఁ బ్రాణమైనది. దేవతలచే స్తోత్రముచేయఁబడినది. ప్రపంచమునఁ బ్రఖ్యాతమైనది. దశరథపుత్త్రునిమంత్రము. శ్రీరామునిస్వకీయమంత్రము. రాక్షససంహారమైనమంత్రము.

శ్లో. సీతాయాదక్షిణే పార్శ్వే లక్ష్మణస్యచ పార్శ్వతః,
తన్మధ్యే రాఘవం వందే ధనుర్బాణధరం హరిమ్.
చంద్రోపమం మలయచందనచర్చితాంగం
మందారపుష్పపరిపూజితపాదపద్మమ్,
బ్రహ్మేంద్రవంద్య మనిశం మునిబృంద సేవ్యం
వందేరవిందనయనం రఘురామచంద్రమ్. 55

చ. సరసవిదేహరాజతనుసంభవలక్ష్మణముఖ్యు దేవతా
తరుసుమపూజితాంఘ్రినవతామరసన్నిభుఁడై సరస్వతీ
శ్వరసురసర్వమౌనిజనవందితుఁ జందనచర్చితుండై లస
ద్గురుశరచాపధారుని రఘూద్వహు రాముని నెంతు నెంతయున్.

తా. సీతాలక్ష్మణుల మధ్యమునందు ధనుర్బాణములను ధరించియున్న విష్ణురూపుఁడగు రాముని నమస్కరించుచున్నాను. చంద్రునితోఁ దుల్యుఁడైనట్టి మలయపర్వత మందలిగంధముచేఁ బూయఁబడిన దేహముగలిగినట్టియు మందారపుష్పములచేఁ బూజింపఁబడు పాదపద్మములుగలినట్టి బ్రహ్మచేత నింద్రునిచేత నమస్కరించఁదగినట్టియు, నెల్లప్పుడు మౌనిసమూహమునను సేవింపఁదగినట్టి పద్మములవంటి నేత్రములుగల రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. ఇక్ష్వాకునందనం సుగ్రీవపూజితం
త్రైలోక్యరక్షకం సత్యసంధం సదా,
రాఘవం రఘుపతిం రాజీవలోచనం
రామచంద్రం భజే రాఘవేశం భజే. 56

మ. మనువంశాంబుధిపూర్ణచంద్రు రఘురామస్వామిఁ దైలోక్యపా
వను సుగ్రీవసమర్చితాంఘ్రికమలున్ లక్ష్మీధరున్ సత్యసం
ధుని గంజాయతనేత్రు వీరరఘునాథున్ రాఘవున్ రామచం
ద్రుని భక్తాంగణకల్పకంబు మది సంతోషంబునం గొల్చెదన్.

తా. ఇక్ష్వాకువంశమును సంతోషింపఁజేయునట్టి సుగ్రీవునిచేఁ బూజింపఁబడుచున్నట్టి మూఁడులోకములను రక్షించునట్టి సత్యమైన ప్రతిజ్ఞ గలిగినట్టి రఘువంశపురాజుల కధిపతియైనట్టి పద్మములవంటి నేత్రములుగల రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. బ్రహ్మామృతానంద ఫలప్రదాయినం
వేదాంతవిజ్ఞానసుగంధపుష్పితమ్,

సీతాశుభాంగాంచితబాహుశోభినం
శ్రీరామకల్పద్రుమ మాశ్రయామః. 57

మ. అలసీతాంగలసత్కరోరువిటపం • బై భవ్యవేదాంతని
ర్మలసుజ్ఞానసుగంధపుష్పయుతమై • బ్రహ్మోత్కృతానందస
త్ఫలదంబై వరశక్తివిద్యలకునై • భావింపఁ బ్రాధాన్యమై
యలరున్ శ్రీరఘురామకల్పకము నే • నశ్రాంతమున్ గొల్చెదన్.

తా. అమృతమువంటి బ్రహ్మానందమనెడు పండునిచ్చునట్టి వేదాంతజ్ఞానమనెడు మంచిపరిమళముగల పువ్వులుగలిగినట్టి సీతాదేవియొక్క శుభమైన దేహమందొప్పుచున్న చేయి యనెడుకొమ్మ గలిగినట్టి శ్రీరామమూర్తి యనుకల్పవృక్షము నాశ్రయించుచున్నాను.

శ్లో. కనకనికషభాసా సీతయాలింగితాంగో
నవకువలయదామశ్యామవర్ణాభిరామః,
అభినవయుతవిద్యున్మండితో మేఘఖండ
శ్శమయతుమమతాపం సర్వదా రామచంద్రః. 58

చ. ఉరుతరతప్తభర్మనిక•షోజ్వలమైనధరాతనూభవన్
సరసతఁ గూడి నీలమణి•జాలవిరాజితుఁడై తటిల్లతా
స్ఫురితసితాభ్రమో యనఁగ • బొల్పు వహించిన రాఘవుండు మ
ద్దురితసముద్భవం బయిన • దుస్తరతాపముఁ బాపి ప్రోవుతన్.

తా. బంగారపు వరుపుగీటువంటి కాంతిగల సీతచేఁ గౌఁగిలింపఁబడిన దేహము గలిగినట్టి నల్లకలువదండవలె చామనచాయచే మనోహరుఁడైనట్టి క్రొ...మెఱుపుతోఁ గూడిన మేఘముముక్కయైనరామచంద్రుఁడు నాసంసారబాధ నెల్లపుడు శాంతింపఁ జేయుఁగాక.

శ్లో. అలం శాస్త్రాభ్యాసై రల మసకృ ద్దామ్నాయపఠనై
రలం తీర్థస్నానై రల మఖిలయాగవ్రతజపైః,
అలం యోగాభ్యాసై రలమపి మహాపాతకభియా
యదస్మాకం రామస్మరణమహిమా సా విజయతే. 59

ఉ. చాలును శాస్త్రపాఠములు • చాలును వేదము లభ్యసించుటల్
చాలు జపంబులుం దపము • చాలు వ్రతంబులు తీర్థయాత్రలున్
జాలు సదోపవాసములు • సత్క్రతువుల్ ఘనయోగనిష్ఠలున్
జాలఁగ భీతి మాన్ప రఘు•సత్తముసంస్మరణంబు గల్గుటన్.

తా. ఏహేతువువలన మాకు రామస్మరణ మాహాత్మ్యముగలదో ఆహేతువువలనశాస్త్రములు నేర్చుటయెందులకు వేదములేల గంగాదితీర్థస్నానములేల యజ్ఞములు వ్రతములు నేల యోగములేల గొప్పపాపములవలన జడుపేల.

శ్లో. సీతామనోమానసరాజహంస, సంసారసంతాపహరక్షమావన్,
శ్రీరామదైత్యాంతకశాంతరూప, శ్రీతారకబ్రహ్మనమోనమస్తే. 60

మ. కమనీయావనిజాతమానసమనఃకాసారహంసున్ హిత
క్షము దైత్యాంతకు శాంతరూపుని బృహత్సంసారసంతాపఘో
రతమోహాంభోనిధితారణున్ రఘువరున్ రాజీవపత్రేక్షణున్
విమలున్ దారకబ్రహ్మమున్ దలఁచి సేవింతున్ గృపాకాంక్షినై.

తా. సీతాదేవిచిత్తమనెడు మానససరస్సునకు రాజహంసయైన యోరామా! సంసారబాధను మాన్పునోరామా! శాంతుఁడవైన యోరామా! రాక్షససంహారము సేయునోరామా! తారకబ్రహ్మమైన యోరామా నీకు నమస్కారము.

శ్లో. కదావా సాకేతే విమలసరయూతీరపులినే
సమాసీనశ్శ్రీమద్రఘుపతిపదాబ్జే హృది భజన్,
అయే రామస్వామిన్ జనకతనయావల్లభవిభో
ప్రసీదేతి క్రోశన్నిమిషమివ నేష్యామి దివసాన్. 61

మ. గుణసాకేతపురీసమజ్ఞసరయూకూలంబునన్ సైకతో
పరిభాగంబునఁ గూరుచుండి రఘురాట్పాదాంబుజాతంబులన్
స్థిరవృత్తిన్ భజియించుచున్ వరద యోసీతేశ ప్రత్యక్షమై
కరుణింపం దగునన్న ఘస్రములు నిక్కంబున్ నిమేషం బగున్.

తా. అయోధ్యయందు నిర్మలమయిన సరయూనదీతీరమందలి యిసుకతిన్నెయందుఁ గూర్చుండి శ్రీరామునిపాదపద్మములు మనసున సేవించుచు ఓస్వామీ! శ్రీరామా! సీతకుఁ బ్రియుఁడవైన యోప్రభూ! రక్షించుమని మొఱలిడుచు బహుదినములు నిముసమువలె నెప్పుడు వెళ్లఁబుచ్చఁగలను.

శ్లో. కదావా సాకేతే తరుణతులసీకాననతలే
నివిష్టస్త్వం పశ్యన్ విహితవిశాలోర్ధ్వతిలకమ్,
అయే సీతానాథస్మరజనపతే దానవజయి
న్ప్రసీదేతి క్రోశన్నిమిషమివ నేష్యామి దివసాన్. 62

శా. సాకేతంబున నొక్కచోఁ దులసీసంతానమధ్యస్థుఁడై
శ్రీకల్యాణముఖంబునన్ దిలకమున్ జెల్వొందు నారాము హే

కాకుత్స్థేశ! విదేహజాధిపతి! యో కౌసల్యాపుత్రా! హరీ
నీకుఁ బ్రొక్కుచు దినంబులు న్నిమిషమా నీ సేవచేసేదెఁ జా.

తా. అయోధ్యాపురమున లేతతులసివనమందుండి యవిచ్ఛిన్నమై విశాలమైన నిలువుబొట్టు గలిగినట్టి యారాముని జూచుచు నో సీతాపతీ తలఁచుకొను మనుష్యుల నేలువాఁడా రాక్షసులజయించువాఁడా రక్షించుమని బహుదినములను నిముసమును వలెనెప్పుడు వెళ్లింపఁగలను.

శ్లో. కదా వా సాకేతే మణిఖచితసింహాసనతలే
సమాసీనం రామం జనకతనయాలింగితతనుం,
అయే సీతారామ త్రుటితహరధన్వన్ రఘుపతే
ప్రసీదేతి క్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్. 63

మ. తనసాకేతసభాంతరస్థలిలస ద్రత్నోజ్జ్వలత్పీఠభూ
తనయాలింగితుఁడై యొకప్పుడును మోదం బొప్ప నున్నట్టిరా
ముని నోహో శివచాపఖండనధరా పుత్రీపతీ ముంగలన్
గనుపట్టన్ దగు న న్నఘస్రములు నిక్కంబున్ నిమేషం బగున్.

తా. అయోధ్యయందు రత్నములచే గుచ్చఁబడినపీఠమందుఁ గూర్చున్న శ్రీరాముని సీతచే నాలింగనఁ జేసికొనఁబడిన దేహముగలవానిని ఓసీతారామా! శివధనుస్సును విరిచినవాఁడా! రఘుపతీ! రక్షించుమని బహుదినములు నిముసమువలె నెప్పుడు వెళ్లించఁగలను.

శ్లో. మార్గేమార్గే శాఖినాం రత్నవేది
వేద్యాంవేద్యాం కిన్నరీబృందగీతమ్,
గీతేగీతే మంజులాలాపగోష్ఠీ
గోష్ఠ్యాంగోష్ఠ్యాం త్వత్కథా రామచంద్ర. 64

చ. పొలు పగుమార్గమార్గముల భూజములందలిరత్నవేదికా
స్థలముల కిన్నరీతతులు తానలయాన్వితగానవైఖరిన్
సలలితమైనగోష్ఠియెడ సన్నుతిఁ జేతురు రామచంద్ర నీ
విలసితసత్కథామృతము వేడ్కను గ్రోలెదు చిత్తవృత్తులై.

తా. ఓశ్రీరామమూర్తీ! ప్రతిమార్గమందుఁ జెట్లయొక్క రత్నపుఁదరుగు, ప్రతియరుగునందుఁ గిన్నరస్త్రీలపాట, ప్రతిపాటయందు మృదువైన వాక్యప్రసంగము, ప్రతిసంగమందు నీకథ గలదు.

శ్లో. వృక్షే వృక్షే వీక్షితాః పక్షిసంఘాః
సంఘే సంఘే మంజులామోద వాక్యమ్
వాక్యే వాక్యే మంజులాలాపగోష్ఠీ
గోష్ఠ్యాం గోష్ఠ్యాం త్వత్కథా రామచంద్ర. 65

ఉ. భూరుహభూరుహంబులను ♦ బొల్పుగ నున్న ఖగవ్రజంబు లిం
పారఁగ మంజులోత్కరము ♦ లైనసుభాషలయందు వేడ్క బెం
పారినరమ్యగోష్ఠియెడ ♦ నంచిత మైనభవత్కథానుధా
సారమె కర్ణపర్వముగ ♦ సన్నుతిఁ జేయును రాఘవేశ్వరా.

తా. ఓ శ్రీరామమూర్తీ! ప్రతిచెట్టునందును బక్షిసమూహములు గానవచ్చుచున్నవి. ప్రతిసమూహమందు మృదువైన సంతోషవాక్యము గలదు. ప్రతివాక్యమందు మృదువైన ప్రసంగముగలదు. ప్రతిప్రసంగమందు నీకథ గలదు.

శ్లో. శ్వేతపుష్పక మారుహ్య, సీతయాసహ రాఘవ!
సుగ్రీవాదిభవద్భక్తై, ర్మనోమధ్యే రమస్వ మే. 66

మ. సితవిభ్రాజితపుష్పకంబున ధరా♦సీమంతినీపుత్రికా
శ్రితవామాంకుఁడ వై రఘూద్వహరమా♦చిత్తేశ దైత్యేశ మా
రుతపుత్రాదిసమస్తభక్తజను లా♦రూఢిఁ బ్రవేష్టింప న
ద్భుతరమ్యాకృతి వై మదీయ మగుచే♦తోవీధి గ్రీడింపవే.

తా. ఓరామా! సీతతోఁగూడ తెల్లనిపుష్పకము నెక్కి సుగ్రీవాదిభక్తులతో నామనస్సున విహరింపుము.

శ్లో. దోర్భిః ఖడ్గం త్రిశూలం డమరు మసి ధను శ్చారుబాణం కుఠారం
శంఖంచక్రంచఖేటంహలముసలగదాభిండిపాలంచపాశం
విద్యుద్వహ్నింశ్చముష్టిం త్వభయవరకరం బిభ్రతం శుభ్రవర్ణం
వందే రామం త్రినేత్రం సకలరిపుకులం మర్దయంతం ప్రతాపైః. 67

మ. శరచాపాసికుఠారముద్గరగదా♦చక్రాంబుభూభిండివా
లరుచిస్ఫారకృశానుముష్టిహలశూ♦లప్రాసఖేటాదులున్
గరసంఘంబుల దాల్చి నిర్భయకరా♦ఖ్యంబుల్ ప్రకాశింప బాం
డురవర్ణంబు త్రినేత్రముం గలిగి తో♦డ్తో శత్రులం ద్రుంచు శ్రీ
కరుఁడౌ రాముని కెల్లకాలము నమ♦స్కారంబు లర్పించెదన్.

తా. ఈపద్యమందు రాముని రుద్రరూపమును వర్ణించినాఁడు. భుజములచేతఁ గత్తి, త్రిశూలము, డమరుకము, చిన్నకత్తి, విల్లు, బాణము, గొడ్డలి, శంఖము,

చక్రము, డాలు, బాఁగలి, రోకలి, గద, భిండివాలము, పాశము, మెఱపునుబోలిన యగ్ని, పిడికిలి, అభయమును హస్తములందుఁ గలిగినట్టియు దెల్లని రంగుగలిగి మూఁడుకన్నులు గలిగినట్టియుఁ బ్రతాపములచే సర్వశత్రువులను నలిపివేయునట్టి రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. దురితతిమిరచంద్రో దుష్టకంజాతచంద్రః
సురకువలయచంద్ర స్సూర్యవంశాబ్ధిచంద్రః
స్వజననివహచంద్ర శ్శత్రురాజీవచంద్రః
ప్రణతకుముదచంద్రః పాతు మాం రామచంద్రః. 68

చ. కలుషతమిస్రచంద్రుఁ డరి•కంజసుధాంశుఁడు దేవకైరవో
జ్జ్వలశశిసారసాప్తకుల•వార్ధిమృగాంకుఁడు సంశ్రితోత్కరో
త్పలవిధుఁ డల్పకంజసిత•భానుఁడు నైజజనైకసేవ్యుఁడున్
విలసితవీరుఁ డైనరఘు•వీరుఁడు సత్కృప నన్నుఁ బ్రోవుతన్.

తా. పాపములనెడు చీఁకటికిఁ జంద్రుఁడైనట్టియు దుర్మార్గులనెడు పద్మములకుఁ జంద్రుఁడైనట్టి దేవతలనెడు కలువలకుఁ జంద్రుఁడైనట్టి సూర్యవంశమను సముద్రమునకుఁ జంద్రుఁడైనట్టి తనజనసమూహమునకుఁ జంద్రుఁడైనట్టి శత్రువులనెడు పద్మములకుఁ జంద్రుఁడైనట్టి నమస్కరించువారనెడు కలువలకుఁ జంద్రుఁడైనట్టి రామచంద్రమూర్తి నన్ను రక్షించుఁగాక (ఇందుఁ జంద్రుఁడు చీఁకటిని బద్మములను బాధించును కలువలను సముద్రుని వృద్ధిఁజేయునని తెలియునది).

శ్లో. కల్యాణదం కౌశికయజ్ఞపాలం, కళానిధిం కాంచనశైలధీరం
కంజాతనేత్రం కరుణాసముద్రం, కాకుత్స్థరామం కలయామిచిత్తే.

ఉ. చారుకళానిధిన్ విమల•సారసపత్రవిశాలనేత్రు బ్రం
దారకశత్రుజైత్రు శుభ•దాయకుఁ గౌశికయజ్ఞరక్షకున్
గారుణికాగ్రగణ్యుఁ బరుఁ • గాంచనభూధరధీరు శూరునిన్
శ్రీరఘురామునిన్ హృదయ•సీమఁ గనుంగొనుచుందుఁ బొందుగన్.

తా. శుభములనిచ్చునట్టి విశ్వామిత్రయజ్ఞము నేలినట్టి శాస్త్రములకు స్థానమైనట్టి మేరువుతో దుల్యమైన ధైర్యముగలిగినట్టి పద్మములవంటి కన్నులుగలిగినట్టి దయకు సముద్రుఁడైనట్టి కాకుత్స్థవంశస్థుఁడైన రాముం జిత్తమున నెంచుచుండెద.

శ్లో. వాల్మీకిస్మృతిమందరేణమథిత స్సీతారమాసంభవ
స్సుగ్రీవాంగదజాంబవాదివతగ స్సౌమిత్రిచంద్రోదయః,

వాతోత్పన్నమణిర్విభీషణసుధః పౌలస్త్యహాలాహల
శ్శ్రీరామాయణదుగ్ధవార్ధి రమలో భూయాత్ సుఖశ్రేయసే. 70

శా. ఆవాల్మీకిమనోగిరిప్రమథితం బై సీతయే లక్ష్మి సు
గ్రీవాదుల్ సురభూరుహాదులు దశగ్రీవుండు హాలాహలం
బౌ వాతాత్మభవుండు రత్నము సుమిత్రాపత్యముం జంద్రుఁ డా
దేవారాతిసహోద్భవుండు సుధ యై దీపించురామాయణం
బేవిఖ్యాతి సుధాబ్ధియై యొసఁగుస త్ప్రేమాభిలాషార్థముల్.

తా. వాల్మీకిమునియొక్క బుద్ధియను మందరపర్వతముచేఁ దరచఁబడినట్టి సీత యనులక్ష్మి గలిగినట్టి సుగ్రీవుఁడు, అంగదుఁడు, జాంబవంతుఁడు మొదలగువారనెడు కల్పవృక్షాదులు గలిగినట్టి లక్ష్మణుఁడను చంద్రోదయము గలిగినట్టి ఆంజనేయుఁ డనెడు చింతామణిగలిగినట్టి విభీషణుఁడను నమృతముగలిగినట్టి రావణుఁడను కాలకూటము గలిగినట్టి రామాయణమను పాలసముద్రము సుఖములకొఱకు శుభములకొఱకు నగుఁగాక.

శ్లో. రఘునందనఏవ దైవతం నో, రఘువంశోద్భవఏవ దైవతం నః
భరతాగ్రజఏవ దైవతం నో, భగవాన్ రాఘవఏవ దైవతం నః. 71

చ. నరవర శేఖరుండు రఘునందనుఁ డే పరదైవతంబు శ్రీ
వరుఁడు పరేశుఁ డై నరఘువంశుఁడె మాపరదైవతంబు శ్రీ
హరి భగవంతుఁ డై నభరతాగ్రజుఁడే పరదైవతంబు మా
కరయఁగ రామభూవరుఁ డహర్నిశలుం బరదైవతం బగున్.

తా. రఘువంశపురాజులను సంతోషింపఁజేయురాముఁడే మాకుదైవము, రఘువంశమందుఁ బుట్టినరాముఁడే మాకుదైవము, భరతునియన్న గారైనరాముఁడే మాకు దైవము, భగవంతుఁడైన రాముఁడే మాకు దైవము.

శ్లో. ఉత్ఫుల్లామలకోమలోత్పలదళశ్యామాయ రామామన
శ్చంద్రాయ ప్రశమాయ నిర్మలగుణారామాయ రామాత్మనే
ధ్యానారూఢమునీంద్రమానససరోహంసాయ సంసారవి
ధ్వంసాయాద్భుతతేజసే రఘుకులోత్తంసాయ పుంసే నమః. 72

తతనీలోత్పలకోమలాంగునకు కాంతాసన్మనోహారకం
ఠితమౌనీంద్రమనస్సరోవరలసచ్ఛ్వేతస్ఫురన్మూర్తికిన్
ధృతికిన్ సద్గుణశాలికిన్ దురితసందోహాటవీవహ్ని క
మ్రతతేజస్కున కాజిమానునకు సంతోషంబునన్ మ్రొక్కెదన్.

తా. వికసించిన నిర్మలమైన కోమలములగు నల్లగలువ రేకులవలె నల్లనైనట్టి సీతాదేవి మనస్సునకుఁ జంద్రుఁడైనట్టియు శాంతిగలిగినట్టి నిర్మలములైన గుణములచేఁ బువ్వులతోఁటవలె నానందముఁజేయునట్టి మనోహరస్వరూపుఁడైనట్టి ధ్యానమునొందిన మునులమనస్సులను మానససరస్సునకు హంస యయినట్టి సంసారబాధను బోఁగొట్టునట్టియు నాశ్చర్యమైన తేజస్సుగలరఘువంశశ్రేష్ఠుఁడైన పురుషునకొఱకు నమస్కారము.

శ్లో. రాజీవాయతలోచనం రఘువరం నీలోత్పలశ్యామలం
మందారాంచితమండపే సులలితే సౌవర్ణకే పుష్పకే
ఆస్థానే నవరత్నరాజిఖచితే సింహాసనే సంస్థితం
సీతాలక్ష్మణలోకపాలసహితం వందే మునీంద్రాస్పదమ్. 73

శా. మందారస్థలహేమరత్నమయస♦ద్మద్యోతసత్పుష్పకం
బందుఁ నైజసభాశుభాసనమునం ♦ దాసీనుఁడై మౌనిస
ద్బృందాశాధిపలక్ష్మణాస్పదుఁడునై ♦ పృథ్వీసుతాయుక్తుఁడై
కుందేందీవరవర్ణుఁ డౌరఘువరుఁ ♦ గంజాక్షు సేవించెదన్.

తా. పద్మమువలె విశాలములైన నేత్రములు గలిగినట్టి రఘువంశశ్రేష్ఠుఁడును, నల్లగలువవలె నల్లనైనట్టి మందారవృక్షములచేత నొప్పుచున్న మండపమందు సుందరమైనబంగారుపుష్పకమందు సభామంటపమందు రత్నస్థాపితమయిన సింహాసనమందున్నట్టిసీతాదేవితో లక్ష్మణునితో లోకముల నేలు నింద్రాదులతోఁగూడిన మునిశ్రేష్ఠులకు స్థానమైన రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. వల్లీప్రవాళనవపల్లవపాదపద్మం
కంజేక్షణం జలదనీలసరోరుహాభమ్
సీమంతినీనయనమోహనమూలమంత్రం
రామం నమామి మునిమానసరాజహంసమ్. 74

చ. కిసలయవిద్రుమారుణముఁ ♦ గేరుపదాంబుజయుగ్మ మౌనిమా
నససరసీమరాళము ఘ♦నప్రతిమానవినీలు మానినీ
విసరవిలోచనాంబురుహ♦విశ్రుతమోహనమంత్రముఁ మహా
త్ము సరసిజాక్షు భక్తజన♦తోషకరుఁ రఘురాముఁ గొల్చెదన్.

తా. తీఁగలవలె మృదువై పగడమువలెఁ జిగుళ్లవలె నెఱ్ఱనైన పాదపద్మములుగలిగినట్టియుఁ బద్మములవంటి నేత్రములు గలిగినట్టి మేఘమువలె నల్లగలువవలెఁ బ్రకా

శించుచున్నట్టి శ్రీని నేత్రములకు మోహపెట్టు ప్రధానమంత్రమైనట్టి మునుల మనస్సనెడి మానససరస్సునకు రాజహంసయైన రాముని నమస్కరించుచున్నాను

శ్లో. అలం వివాదేన నహాయమనుష్యో యం
రామాఖ్యయా రాక్షసమర్దనాయ
భుజంగశయ్యాం పరిహృత్య సాక్షా
న్నారాయణో భూతల మాజగామ.  75

చ. కలహ మిఁకేలమానవుఁడు ♦ గాఁడు సుమీ రఘురామచంద్రుఁ డీ
యిలజనియించె రాక్షసుల ♦ నే పడగింప భుజంగతల్పము॥
దొలఁగి జగన్నియంత యగు ♦ తోయజనాభుఁడు దృష్టిప్రాతుఁ డై
సలలిత మా మహాబిహిమ ♦ సర్వజగంబులు సన్నుతింపఁగన్.

తా. వివాదము చాలు ఇతఁడు మనుష్యుఁడు గాఁడు. సాక్షాత్తు శ్రీమన్నారాయణమూర్తి శేషశయ్యను విడచి రాక్షససంహారముకొఱకు శ్రీరామరూపముచే భూమిని పొందెను.

శ్లో. లోకత్రాణానుకారీ దశవదనశిరఃపఙ్క్తి విచ్ఛేదకారీ
లంకాలంకారహారీ భృగుతనయమనస్సర్వగర్వాపహారీ,
సీతాసీమంతకారీ మణిమయమకుటోద్దివ్యకోదండధారీ
శ్రీరామః పాపహారీ శమయతు దురితం భూమిభారాపహారీ.  76

మ. భువనత్రాణ దశాస్యకంఠనిలుఠ ♦ద్ఘోరప్రభావాస్యదా
నవ రాట్పట్టణవైభవాపహరు ♦సన్మాణిక్యకోటీరు భా
ర్గవగర్వాపహరుఁ ధనుర్ధరు ధరా ♦కన్యానుసారిఁ హారిఁ
భువిభారాపహు రాముఁ గొల్తు దురితాం ♦బుల్ పాపి రక్షింపఁగన్.

తా. లోకసంరక్షణముఁ జేయునట్టి రావణునిశిరస్సుల వరుసను తెగఁగొట్టినట్టి లంకాపట్టణపుశోభను హరించినట్టి పరశురాముని మనోగర్వమంతయు హరించినట్టి సీతాదేవి పాపటను దిద్దునట్టియు (ఆమెకలంకారముఁజేయుట యొక్క విలాసము) మాణిక్యకిరీటము గలిగినట్టి ప్రశస్తధనుస్సును బూనినట్టి పాపముసుహరించునట్టి భూమిబరువును బోఁగొట్టునట్టి రాముఁడు పాపములను శాంతింపఁజేయుఁగాక

శ్లో. బ్రహ్మాదియోగిమునిపూజితసిద్ధమంత్రం
దారిద్ర్యదుఃఖభవరోగవినాశమంత్రమ్
సంసారసాగరసముత్తరణైకమంత్రం
వందే మహాభయహరం రఘురామమంత్రమ్.  77

ఉ. సారసగర్భయోగిమునిసంస్మరణీయము దుఃఖరోగసం
హారకముఁ దరిద్రకలుపాపహముఁ భయవారకంబు సం
సారపయోధితారకము సర్వసుపర్వమనోవిహారముఁ
శ్రీరఘురామమంత్రముగురించి నమస్కృతు లాచరించెదన్.

తా. బ్రహ్మ మొదలగు యోగులచే మునులచేఁ బూజింపఁబడుమంత్రమును, లేమిచేతనైన కష్టమును, సంసారరోగమును నశింపఁజేయు మంత్రమును, సంసారసముద్రము దాఁటు ముఖ్యమంత్రమును, గొప్పభయమును బోఁగొట్టు రామమంత్రమును నమస్కరించెద.

శ్లో. శత్రుచ్ఛేదైకమంత్రం సరసముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తారమంత్రం సముచితసమయే సంగనిర్యాణమంత్రమ్
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రం
జిహ్వే శ్రీరామమంత్రం జపజపసఫలం జన్మసాఫల్యమంత్రమ్. 78

మ. ఉరుసంసారసముత్తరంబు నిగమాంతోత్తార్చితంబుఁ సను
స్తరిపుధ్వంసము జన్మపావనముగా సత్సంగవేళానము
చ్చరితంబుఁ వ్యసనాహిదంష్ట్రజనరక్షాదక్షమై శర్వదం
బరుదా శ్రీరఘురామమంత్రమును జిహ్వా! భక్తిఁ గీర్తింపుమా.

తా. శత్రువులఁగొట్టు ముఖ్యమంత్రమును, సరసమైన ఉపనిషద్వాక్యముల యందుఁ బూజింపఁబడు మంత్రమును, సంసారము దాఁటించుమంత్రమును, సంసార సంగమును బోఁగొట్టుమంత్రమును, అన్నియైశ్వర్యములలో ముఖ్యమైనమంత్రమును, ద్యూతాదివ్యసనములను పాముచేఁగఱవఁబడినవారిని రక్షించుమంత్రమును జన్మసాఫల్యమునుజేయు మంత్రమును, శ్రీరామమంత్రమును ఓ నాలుకా! తగు సమయమందు జపించు జపింపుము.

శ్లో. ఆకర్ణమారూఢధనుర్గుణాఢ్యం
బ్రహ్మాస్త్రముండీకృతరాక్షసేంద్రమ్
రథాధిరూఢం రణరంగధీరం
రామం భజే రక్తసరోరుహాక్షమ్. 79

శా. పాకారాతిరథాంగ మెక్కి రణభూభాగంబు గంపింపఁగా
నాకర్ణాంతధనుర్వ్రము త్తదృఢబ్రహ్మాస్త్రంబునఁ రావణుఁ
లోకశ్రేణి నుతింపఁ ద్రుంచినబుధశ్లోకుఁ సరోజాంబకుఁ
గాకుత్స్థాన్వయదుగ్ధవారినిధిరాకాచంద్రుఁ గీర్తించెదన్.

తా. చెవిపర్యంతము లాగఁబడిన వింటినారితోఁ గూడినట్టియు, బ్రహ్మాస్త్రము
చే సంహరింపఁబడిన రావణుఁడు గలిగినట్టియు, రథము నెక్కినట్టి, యుద్ధమున ధైర్యవం
తుఁడైనట్టి ఎఱ్ఱదామరవంటి నేత్రములుఁగల రాముని సేవించుచున్నాను.

శ్లో. ఏతౌ తౌ దశకంఠకంఠకదళీకాంతారకాంతిచ్ఛిదౌ
వైదేహీకుచకుంభకుంకుమలసత్పంకారుణాలంకృతౌ
విశ్వత్రాణవిధానసాధుసవనప్రారంభయూపౌ భుజౌ
దేయాస్తాం మమ విక్రమౌ రఘుపతేః శ్రేయాంసి భూయాంసి నః. 80

చ. కలుషనిశాచరేంద్ర దశకంధరకంధరకాననచ్ఛిదో
జ్జ్వలితములు లుర్విజాకుచచర్చితకుంకుమపంకిలారుణాం
బులు భువనావనప్రకట భూరిమహాధ్వరయూపముల్ దినే
శకులభవదీయబాహువులు కోరినకోర్కులు నిచ్చునిచ్చలున్.

తా. రావణుని కంఠములనెడి యరఁటితోఁటయొక్క శోభను తెగవేసినట్టి సీత
యొక్క స్తనములయందలి కుంకుమపుబురదచేత నెఱ్ఱగా నలంకరింపఁబడినట్టి ప్రపం
చసంరక్షణమునకుఁ గారణమైన యోగ్యకార్యములనెడు యజ్ఞమున నారంభించు యూ
పస్తంభములైనట్టి గొప్పపరాక్రమముఁగల నీచేతులు ఓ శ్రీరామా! మాకు గొప్పశుభ
ముల నిచ్చుఁగాక.

శ్లో. వామాంకోపరిసంస్థితావనిసుతా మాముక్తభూషోజ్జ్వలాం
పశ్యంతం పరిపూర్ణచంద్రవదనం భ్రాజత్కిరీటోజ్జ్వలమ్
ఆసీనం నవరత్నరాజిఖచితే సింహాసనే రాఘవం
సుగ్రీవాంగదలక్ష్మణానిలసుతై రాసేవ్యమానం భజే. 81

మ. తనవామాంకమునం దలంకరణసీతాలోకనాసక్తుఁడై
ఘనరత్నోజ్జ్వలసత్కిరీటుఁడగు రాకాచంద్రబింబాస్యుఁ గాం
చనసింహాసనసంస్థితుం రవిజపక్షన్యాత్మసత్పుత్రపా
వనిసౌమిత్రిముసేవితుం దగురఘుస్వామిన్ భజింతున్ మదిన్.

తా. ఉంచఁబడిన అలంకారములచేఁ బ్రకాశించుచున్న యొడమతొడపైనున్న
సీతను జూచుచున్నట్టి పూర్ణచంద్రునివంటి మొగముగలిగినట్టి ప్రకాశించుచున్న కిరీ
ము శోభించుచున్నట్టి నవరత్నములచేఁ గూర్పఁబడిన సింహాసనముపై గూర్చున్నట్టి
సుగ్రీవాదులచే సేవింపఁబడుచున్న రాముని సేవించుచున్నాను.

జానక్యాః కమలామలాంజలిపుటే యాః పద్మరాగాయితాః
న్యస్తా రాఘవమస్తకేతు విలసత్కుందప్రసూనాయితాః

సక్రిస్తా శ్యామలకాయకాంతికలితా యాఇంద్రనీలాయితాః
ముక్తాస్తా శ్శుభదా భవంతు భవతాం శ్రీరామవైవాహికాః. 82

చ. పరిణయవేళ సీత కర•పద్మయుగస్థితమౌక్తికాళి క
య్యరుణమణిప్రభ న్వెలసె • యాజిననూజుశిరంబునందు నుం
దరుచులు గ్రెల్లె రాము తను•ధామముచేత ఘనీలరత్నవి
స్ఫురితము లయ్యెఁ దన్మణులు • సుస్థిరసంపద లిచ్చు నిచ్చలున్.

తా. ఏముత్యములు సీతయొక్క పద్మమువలె నిర్మలమైన దోసిలియందుఁ బద్మరాగమణులవలెనున్నవో (ఆ మెదోసిలియందుఁ బద్మరాగమణులవలె యెఱ్ఱగానున్న వియనుట) రాముని శిరమున నుంచఁబడుచు మల్లెపువ్వులవలెనున్నవో (దోసిలికిఁ దలకు మధ్యనుండు దంతరాళ సహజమైన వెల్లనగు గలవియనుట) జారుచు రాముని నల్లనిదేహకాంతితోఁ గూడినవై యింద్రనీలములవలెనున్నవో (నల్లనిదేహకాంతిచే నల్లగానున్నవియనుట) అట్టిరామవివాహమందలి తలఁబ్రాలముత్యములు మీకు శుభమునిచ్చునవి యగుఁగాక.

శ్లో. నిత్యం శ్రీరామమంత్రం నిరుపమ మధికం నీతిసుజ్ఞానమంత్రం
సత్యం శ్రీరామమంత్రం సదమలహృదయే సర్వదారోగ్యమంత్రమ్
స్తుత్యం శ్రీరామమంత్రం సులలితసుమన స్సౌఖ్యసౌభాగ్యమంత్రం
పఠ్యం శ్రీరామమంత్రం పవనజవరదం పాతు మాం రామమంత్రమ్.

ఉ. నిత్యము నిస్సమానమును • నీతివివేకము నిర్మలంబు నా
దిత్యశుభప్రదాయకము • దీనజనార్తిహరంబు యోగిసం
స్తుత్యము సజ్జనప్రకర•శోభకరంబు కరంబు నంజనా
పత్యవరప్రదంబు రఘు•వర్యునిమంత్రము నన్నుఁ బ్రోవుతన్. 83

తా. సామ్యములేనట్టి గొప్పదైయెనట్టి నీతియు జ్ఞానమును గలిగియునట్టి సత్యమైనట్టి ఎల్లపుడు నారోగ్యమునిచ్చునట్టి స్తోత్రము చేయఁదగినట్టి మంచిమనస్సుగలవారికి సౌఖ్యము నైశ్వర్యము నిచ్చునట్టి అంజనేయునికి వరములనిచ్చునట్టి శ్రీరామమంత్రము నిత్యము నన్ను రక్షించుఁగాక.

శ్లో. వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం
దైత్యోన్మూలకరౌషధం భవభయప్రధ్వంసనైకౌషధమ్
భక్తానందకరౌషధం త్రిభువనే సంజీవనైకౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధం పిబ మనః శ్రీరామనామౌషధమ్. 84

చ. భవభయభేషజంబు రిపు•భంజన మాశ్రితతోషణంబు దా
నవవరసర్వగర్వహర•ణంబు మునీశ్వరసేవితంబు సొ

హావిదళనంబు లోకనివ•హ ప్రకటోజ్వలజీవనంబు నౌ
రవికులరామనామకమ•హౌషధమున్ గృప నన్నుఁ బ్రోవుతన్.

తా. మోహమును శాంతింపఁజేయునట్టియును మనోవ్యాపారము నడిపించునట్టిరాక్షసులను బెల్లగించునట్టి సంసారభయమును బోఁగొట్టి భక్తుల కానందముఁజేయునట్టి మూఁడులోకములను జీవింపఁజేయునట్టి శుభప్రాప్తిఁజేయునట్టి రామనామ మను నౌషధము నోమనసా నీవు త్రాగుమా.

శ్లో. ధ్యాయే ప్రాత స్సురేశం రవికులతిలకం రంజితానంతలోకం
బాలం బాలారుణాక్షం భవముఖవినుతం భావగమ్యం భవఘ్నం
దీవ్యంతం స్వర్ణక్లప్తై ర్మణిగణనికరై ర్భూషణై రుజ్జ్వలాంగం
కౌసల్యాదేహజాతం మమహృదయగతం రామమీషత్ స్మితాస్యం.

మ. స్మితవక్త్రుఁ గలుషాపహున్ సురముని•శ్రేష్ఠ స్తుతున్ శంకరా
ర్చితపాదున్ బరుఁ గౌనలేయు సుజన•ప్రీతిప్రదున్ భూషణాం
చితు బాలారుణనేత్రు భాస్కరకులున్ • శ్రీరాఘవున్ లోకరం
జితునిన్ హృత్సరసీరుహాంతరగతున్ • సేవింతుఁ బ్రాతంబునన్. 85

తా. దేవతల కధిపతియైనట్టి సూర్యవంశశ్రేష్ఠుఁడైనట్టి ఆనందింపఁజేయఁబడిన యెల్లలోకము గలిగినట్టి పిల్లవాఁడైనట్టి లేతసూర్యునివలె నెఱ్ఱనైన నేత్రములుగలిగినట్టి శివాదులచే స్తోత్రముచేయఁబడినట్టి హృదయమందు ధ్యానింపఁదగినట్టి సంసారబాధను బోఁగొట్టునట్టి శ్రేష్ఠుఁడైనట్టి బంగారుతోఁజేసినట్టి మణులచే వ్యాప్తములైన యలంకారములచేఁ బ్రకాశించుచున్నట్టియు కౌసల్యకుఁగొమారుఁడైనట్టి నాహృదయమందున్నట్టి చిఱునవ్వుతోఁగూడిన ముఖముగల రాముని బ్రాతఃకాలమందు ధ్యానముఁ జేయుచున్నాను.

శ్లో. మధ్యాహ్నే రామచంద్రం మణిగణలలితం మందహాసావలోకం
మార్తాండానేకభాసం మరకతనికరాకార మానందమూర్తిమ్
సీతావామాంకసంస్థం సరసిజనయనం పీతవాసోవసానం
వందేహం వాసుదేవం వరశరధనుషం మ్మానసే మే విభాంతం. 86

దరహాసేక్షణుఁ దప్తకాంచనలస•ద్రత్నోజ్జ్వలాకల్పునిన్
శరకోదండకరాంబుజున్ మరకత•చ్ఛాయాభిరామున్ విభా
స్వరకోటిద్యుతి జానకీసహితు రా•జశ్రేష్ఠు జాంబూనదాం
బరు శ్రీరామునిమధ్యమాహ్నమున సం•భావించి నేమ్రొక్కెదన్.

తా. మాణిక్యసమూహముచే సుందరుఁడైనట్టి చిఱునవ్వుతోఁగూడిన చూపులు గలిగినట్టి బహుసూర్యులకాంతి గలిగినట్టి మరకతమణుల పోలికవంటియాకారముగలిగినట్టి యానందస్వరూపుఁడైనట్టి యెడమతొడపైనున్న సీతగలిగినట్టి పద్మములవంటి నేత్రములు గలిగినట్టి పచ్చనివస్త్రమును ధరించినట్టి యన్నిలోకములకు నివాసస్థానమైనట్టి శ్రేష్ఠములైన ధనుర్బాణములు గలిగినట్టి సామనమునఁ బ్రకాశించుచున్న రాముని మధ్యాహ్నమున నమస్కరించుచున్నాను.

శ్లో. ధ్యాయే రామం సుధాంశుం నతసకలభవారణ్యతాపప్రహారం
శ్యామం శాంతం సురేంద్రం సురమునివినతం కోటిసూర్యప్రకాశమ్
సీతాసౌమిత్రిసేవ్యం సురనరసుగమం దివ్యసింహాసనస్థం
సాయాహ్నే రామచంద్రం స్మితరుచిరముఖం సర్వదా మే ప్రసన్నమ్.

మ. శ్రితపాపాటవివహ్నిఁ లక్ష్మణధరిత్రీపుత్రికాయుక్తు నం
చితచంద్రాసమశాంతు దేవమునిసంసేవ్యుఁ వినీలాకృతిఁ
స్మితవక్త్రుఁ రవికోటిసన్నిభమణీసింహాసనస్థానసం
స్థితు శ్రీరాముదినాంతమందు మది నేఁ జింతింతు నిష్టాప్తికిన్. 87

తా. చంద్రునివలె నున్నట్టి నమస్కరించువారికి సంసారారణ్యబాధనంతయు హరించునట్టి నల్లనైనట్టి శాంతుఁడైనట్టి దేవతల కధిపతియైనట్టి దేవతలచే మునులచే నమస్కరింపఁబడుచున్నట్టి కోటిసూర్యుల కాంతివంటి కాంతిగలిగినట్టి సీతాలక్ష్మణులచే సేవింపఁబడుచున్నట్టి దేవతలకు మనుష్యులకుసులభుఁడైనట్టి, శ్రేష్ఠసింహాసనమందున్నట్టి నవ్వుచే సుందరమైన మోముగల రామమూర్తి నెల్లపుడు సాయంకాలమందు ధ్యానించుచున్నాను.

శ్లో. కేయూరాంగదకంకణైర్మణిగణైర్వైరోచమానం సదా
రాకాపర్వణిచంద్రకోటిసదృశం ఛత్త్రేణ వై రాజితమ్
హేమస్తంభసహస్రషోడశయుతే మధ్యే మహామండపే
దేవేశం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. 88

మ. పదియాఱ్వేలపసిండికంబములచే భాసిల్లు గేహంబు నం
దుదయాంచత్పరిపూర్ణచంద్రసదృశుఁ యోగీంద్రసంసేవ్యు నం
గదకోటీరవిభూషణుఁ భరతముఖ్యభ్రాతృసంసేవితుఁ
సదయాత్ముఁ రఘురాము నీరదఘనశ్యాముఁ దలంతుఁ మదిన్.

తా. నిత్యముఁ గంకణకేయూరమణిసమూహములచేఁ బ్రకాశించుచున్నట్టి కోటిపూర్ణచంద్రులతో సమానుఁడైనట్టి గొడుగుచేఁ బ్రకాశించునట్టి పదియాఱువేల బంగారు

స్తంభములతోఁగూడిన మంటపమధ్యమందున్నట్టి దేవతల కధిపతియైనట్టి భరతాదులచే నావరింపఁబడిన నల్లనివాఁడైన రాముని సేవించుచున్నాను.

శ్లో. విహాయ కోదండ మిమం ముహూర్తం
గృహాణ పాణౌ మణిచారువేణుమ్
మాయూరబర్హంచ నిజోత్తమాంగే
సీతాపతే రాఘవరామచంద్ర. 89

మ. శరచాపంబులు మాని బర్హమణివం•శంబుల్ శిరం బందుస
త్కరయుగ్మంబునఁ బూనగాఁ దగుముహూ•ర్తంబుల్ రఘూత్తంసభా
స్కరవంశాంబుధిపూర్ణచంద్ర నగర•క్షోదక్షకంజాక్ష భూ
ధరమౌళిస్థకిరీటరత్నవిలస•త్పాదాబ్జరామప్రభూ.

తా. సీతాధిపతివగు నోరామచంద్రా! క్షణము ఈధనుస్సును విడచి చేతియందు మణులచే సుందరమగు పిల్లనగ్రోవిని నీశిరమున నెమలిపింఛమును ధరింపుము.

శ్లో. శుద్ధాంతే మాతృమధ్యే దశరథపురతః సంచరంతం పరంతం
కాంచీదామానువిద్ధప్రతిమణివిలసత్కింకిణీనిక్వణాంగమ్
ఫాలే ముక్తా లలామం పదయుగనినద న్నూపురం చారుహాసం
బాలం రామం భజేహం ప్రణత జనమనః ఖేదవిచ్ఛేదదక్షమ్. 90

ఉ. అంతిపురంబునం దశర•థాధిపుముంగలమాతృమధ్యమం
దెంతయు నాటలాడుతఱి • హేమమణీయుతనూపురంబు లా
క్రాంతనితంబఘంటికలు • రంజిల ముత్యపునావిరేకయుఁ
వింతఁగఁ జెన్నుమీరు రఘు•వీరకుమారు నుదారు నెన్నెదన్.

తా. అంతఃపురమునం దల్లులమధ్యమందు దశరథుని యెదుట సంచరించుచున్నట్టి యుత్కృష్టుఁడైనట్టి మొలత్రాటియందుఁ గూర్చఁబడిన మణులచేతనొప్పు మువ్వల చప్పుడులోఁగూడిన శరీరముగలిగినట్టియు నుదుట ముత్యాలచేరుచుక్కగలిగినట్టి పాదములయందు ధ్వనిచేయుచున్న అందెలుగలిగినట్టి సుందరమైన నవ్వుగలిగినట్టి నమస్కరించుజనుల మనస్సునఁ గలబాధను బోఁగొట్టుటయందు సమర్థుఁడైనట్టి బాలుఁడైన రాముని సేవించుచున్నాను.

•సంపూర్ణచంద్రవదనం సరసీరుహాక్షం
మాణిక్యకుండలధరం మకుటాభిరామమ్
చాంపేయగౌరవసనం శరచాపహస్తం
శ్రీరామచంద్ర మనిశం మనసా స్మరామి.

ఇంద్రనీలమణిసన్నిభ దేహం, వందనీయ మసకృన్మునిబృందైః
లంబమానతులసీవనమాలం, చింతయామి సతతం రఘువీరమ్. 91

చ. సురుచిరపూర్ణచంద్రముఖు•శోభితరత్నకిరీటకుండలా
భరణు సువర్ణచేలుని శుభవ్రతు సారసపత్రనేత్రు భా
సురశరచాపహస్తు నతసూరిసమూహు వినీలగాత్రు సు
స్థిరవనమాలికుఁ రఘుప•తి న్నియతి న్మనసా స్మరింపుమా.

తా. పూర్ణచంద్రునివంటిముఖముగలిగినట్టి పద్మములవంటి నేత్రములు గలిగినట్టి మణికుండలములను ధరించునట్టి కిరీటముచేత సుందరుఁడైనట్టి సంపెంగపూవువలెఁ బచ్చనైన వస్త్రముగలిగినట్టి ధనుర్బాణములు హస్తములయందుఁగలిగినట్టిరాము నెల్లపుడు స్మరించుచున్నాను. ఇంద్రనీలమణులతో సమానమైన దేహముగలిగినట్టి మునిసమూహములచేత నమస్కరింపఁదగినట్టి వ్రేలాడుచున్న తులసీమాలికగలరఘువీరుఁడైన రాముని ధ్యానించుచున్నాను.

శ్లో. రామచంద్ర దయాసాంద్ర, రఘువీరనృపోత్తమ
లోచనాభ్యాం కృపాపూర, పూర్ణాభ్యాం మాం విలోకయ. 92

ఉ. శ్రీరఘురామచంద్ర సుచ•రిత్ర కృపాకరరాజశేఖరా
సూరిజనస్తుతాంఘ్రియుగ•సుందరగాత్రధరాసుతాధిపా
చారువిలోచనంబులను • సత్కరుణాపరిపూర్ణదృష్టిచే
నారయుమయ్య నన్ను సిర•తాశ్రయుఁ డంచుఁ దలంచి మక్కువన్.

తా. దయచేతఁ బరిపూర్ణుఁడవైనవాఁడా రఘువీరుఁడా రాజశ్రేష్ఠుఁడా దయచేతనిండిన నేత్రములచేత నన్నుఁ జూడుము.

శ్లో. రామేతి వర్ణద్వయ మాదరేణ, సదా స్మరన్ ముక్తి ముపైతి జంతుః
కలౌ యుగే కల్మషమానసానా, మన్యత్ర ధర్మే ఖలు నాధికారః.
భక్తప్రియం భక్తసమాధిగమ్యం, చింతాహరం చింతితకామధేనుం
సూర్యేందుకోటిద్యుతిభాస్వరాంగం, రామం భజే రాఘవరామచంద్రం.

చ. సలలితరామనామజప•సంస్మరణంబుల ముక్తి చేకురుఁ
కలియుగమందు నన్య మగు•కర్మములం దతికాంక్ష లేటికిఁ
నలినసఖాబ్జకోటిరుచి•నమ్రజనప్రియు నార్తికల్పకం
బిల సుజనవ్యథాపహరు • నిష్టఫలప్రదు రాము నెన్నెదన్. 93

తా. రామ అనునట్టి రెండక్షరములను ఆదరముచేత నెల్లపుడుఁ దలఁచుప్రాణి మోక్షముఁ బొందును. కలియుగమునందు పాపాత్ములకు నితరధర్మమం దధికారము లేదు.

భక్తులకిష్టుఁడైనట్టియు భక్తులనియమముచేఁ బొందఁదగినట్టియుఁ విచారమును హరించునట్టి తలఁచుకొన్న కోరిక నిచ్చుటకుఁ గామధేనువైనట్టి కోటిచంద్రసూర్యులకాంతిచేఁ బ్రకాశించునట్టి రఘువంశమందుఁబుట్టిన రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. సకలభువనరత్నం సర్వశాస్త్రార్థరత్నం
సమరవిజయరత్నం సచ్చిదానందరత్నమ్
దశముఖహరరత్నం దానవారాతిరత్నం
రఘుకులనృపరత్నం పాతు మాం రామరత్నమ్. 94

చ. ఇనకులరాజరత్న మసు ♦ రేశ్వరమర్దనరత్నము న్రణా
వనిజయరత్నము న్నిగమ ♦ వర్ణితరత్న మమేయరత్నముం
దనుజవినాశరత్నము వి ♦ ధాతృసమర్చితరత్నముం జగ
జ్జననుతరామరత్న మని ♦ శంబు కృపామతి నన్నుఁ బ్రోవుతన్.

తా. సమస్తలోకశ్రేష్ఠుఁడైనట్టి సమస్తశాస్త్రములలో శ్రేష్ఠుఁడైనట్టి యుద్ధజయముచేత శ్రేష్ఠుఁడైనట్టి సత్యజ్ఞానానందములచే శ్రేష్ఠుఁడైనట్టి రావణునిసంహరించుటచేత శ్రేష్ఠుఁడైనట్టి రాక్షసవిరోధిశ్రేష్ఠుఁడైనట్టి రఘువంశరాజులలో శ్రేష్ఠుఁడైనట్టి రామమూర్తియను రత్నము నన్ను రక్షించుఁగాక.

శ్లో. మాతుఃపార్శ్వేచరంతం మణిమయశయనే మంజుభూషాంచితాంగం
మందంమందం పిబంతం ముకుళితనయనం స్తన్యమన్యస్తనాగ్రమ్
అంగుళ్యాగ్రైః స్పృశంతం సుఖపరవశయా సస్మితాలింగితాంగం
గాఢంగాఢం జనన్యా కలయతు హృదయంమామకంరామబాలమ్.

చ. సరసతరత్నతల్పమున ♦ సన్మణిభూషణ భూషితాంగుఁడై
దరహసితంబునన్ జనని ♦ స్తన్యము గ్రోలుచు నొక్క కేల నా
దరణకుచాగ్ర మంటి ప్రమ ♦ దంబున కన్నులు మూసి కౌఁగిటన్
పరవశ సౌఖ్య మొందుపసి ♦ బాలుని రాముని గాంచ నెమ్మదిన్. 95

తా. తల్లిప్రక్కననుండి రత్నఖచితశయ్యయందుఁ బరుండి సొగసైన నగలచేత నలంకరించఁబడిన దేహముగలిగినట్టి కన్నులు మూసుకొని మెల్ల మెల్లగాఁ బాలుద్రావుచు రెండవస్తనాగ్రము వ్రేళ్లచేఁ బట్టికొనుచు సుఖవశుఁడై చిఱునవ్వుతో గట్టిగా దల్లిని గౌఁగలించుకొనియున్న రాముని నాహృదయము ధ్యానించుఁగాక.

శ్లో. రామాభిరామం నయనాభిరామం, వాచాభిరామం వదనాభిరామం
సర్వాభిరామం చ సదాభిరామం, వందే సదా దాశరథించ రామమ్.

ఉ. రాము సదాభిరాము దిన♦రాజకులాంబుధిసోము జానకీ
రాము సురారిభీము వర♦రాజలలాము వినీలనీరద
శ్యాము పవిత్రనాము విల♦సన్మణిదాము సమర్చితామర
స్తోము గుణాభిరాము నుత♦సోముఁ దలంచి నమస్కరించెదన్. 96

తా. సుందరులలో సుందరుఁడైనట్టి నేత్రములకు మనోహరుఁడైనట్టి వాక్యము చే నింపుగానుండునట్టి సుఖముచేత సుందరుఁడైనట్టి అందరికి నింపైనట్టి యెల్లపుడు నింపైనట్టి దశరథపుత్రుఁడైనరాముని నమస్కరించుచున్నాను.

శ్లో. జయజయ రఘురామ శ్రీముఖాంభోజభానో
జయజయ రఘువీర శ్రీమదంభోజనేత్ర
జయజయ రఘునాథ శ్రీకరాభ్యర్చితాంఘ్రే
జయజయ రఘువర్య శ్రీశ కారుణ్యసింధో. 97

చ. జయజయ రామచంద్ర విల♦సత్కమలాననకంజభాస్కరా
జయజయ రాఘవేంద్ర ముని♦చంద్రసమర్చితపాదపంకజా
జయజయ జానకీరమణ ♦ సారసపత్రవిశాలలోచనా
జయ రఘువీర దాసనుత♦సత్కరుణావరుణాలయాచ్యుతా.

తా. లక్ష్మియొక్క (సీతయొక్క) ముఖపద్మమునకు సూర్యుఁడవైనరామా సర్వోత్కృష్టుఁడవై యుండుము. శోభగలపద్మములవంటినేత్రములుగల యోరఘువీరా సర్వోత్కృష్టుఁడ వగుము. లక్ష్మియొక్క హస్తములచేఁ బూజింపఁబడు పాదములుగల యో శ్రీరామా సర్వోత్కృష్టుఁడవగుము. లక్ష్మికి నధిపతివైన దయాసముద్రుఁడవైన యో రామా సర్వోత్కృష్టుఁడ వగుము.

శ్లో. జయజయ వరశంఖ శ్రీగదాచక్రధారిన్
జయజయ నిజదాసప్రార్థితార్థప్రదాయిన్
త్రిభువనమయసర్వప్రాణిభావజ్ఞ విష్ణో
శరణ ముపగతోహం త్వాం శరణ్యం వరేణ్యమ్. 98

చ. జయజయ శంఖచక్రవర♦శార్ఙ్గగదావిలసత్కరాంబుజా
జయ నిజసేవకేప్సితప్ర♦శస్తదురాసదకార్యదాయకా
జయ భువనత్రయప్రచుర♦జంతుమనోజ్ఞరమేశ రాఘవా
జయ రఘురామచంద్రగుణ♦సాంద్ర నినుఁ శరణంబు వేఁడెదన్.

తా. శ్రేష్ఠమైన శంఖమును శోభాయుక్తమైన గదను చక్రమును ధరించిన యోరామా సర్వోత్కృష్టుఁడ వగుము. నీసంబంధమైనదాసులకుఁ బొందఁదగిన

దుర్లభమైన కోరికగల రామా సర్వోత్కృష్టుఁడవగుము. త్రిలోకస్వరూపుఁడవైన రామా సమస్తప్రాణుల యభిప్రాయ మెఱిఁగిన విష్ణురూపుఁడవైన రామా శ్రేష్ఠుఁడవును రక్షించుటయందు యోగ్యుఁడవునైన నిన్ను శరణుఁ బొందితిని.

శ్లో. వేదవేద్యే పరే పుంసి, జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్, సాక్షాద్రామాయణాత్మనా. 99

ఉ. ఆగమవేద్యుఁ డైనహరి • యాజితనూభవుఁడై జనించుచో
నాగమసంచయం బుచిత • మయ్యెను రామకథాస్వరూపమై
బాగుగ వామలూరుభవ•భవ్యకవిత్వమునన్ బ్రసన్నమై
భాగవతాగ్రగణ్యులకుఁ • బథ్యము నై శ్రవణార్హమై తగన్.

తా. వేదములచేఁ దెలియఁదగిన పరమపురుషుఁడు దశరథపుత్త్రుఁడై పుట్టఁగానే వేదము సాక్షాత్తురామాయణస్వరూపముచేత వాల్మీకివలనఁ బుట్టెను.

శ్లో. శ్రీరామేత్యేకదా వక్తుం, మనో యస్య ప్రవర్తతే
వైకుంఠవాసిన స్తస్య, కుల మేకోత్తరం శతమ్. 100

ఉ. శ్రీరఘువీరుపేరు తన•చిత్తమునం దొకవేళ భక్తి నిం
పార భజింప నెంచినమ•హాత్ముని యేకశతాన్వయంబు లా
కారుణికాగ్రగణ్యుఁ గృపఁ • గాంచి వసింతు రనంతసంతతా
ధారసముల్లసద్విభవ•తానవికుంఠపురీవరంబునన్.

తా. ఎవనియొక్క మనస్సు శ్రీరామా అని యొక్కమాటు పలుకుటకు నుద్దేశించునో వైకుంఠవాసి యైన ఆపురుషునియొక్క నూటఒక్క కులములు ముక్తిఁ బొందును.

శ్లో. రాశబ్దోచ్చారమాత్రేణ, ముఖా న్నిర్యాంతి పాతకాః
పునః ప్రవేశభీత్యాచ, మకారస్తు కవాటవత్. 101

చ. గరిసురవర్ణ మెన్నఁగ ము•ఖంబుననుండి తొలంగుపాపముల్
దిరిగి ప్రవేశభీతిని న•తిత్వరితంబు మవర్ణ మెన్నఁగా
పరగఁ గవాట మౌ నెఱిఁగి • ప్రాజ్ఞజనుల్ కలివేళ రాముసం
స్మరణముఁ జేసి పొందుదురు • శాశ్వతమై తగుముక్తిమార్గమున్.

తా. రా అనుశబ్దము నుచ్చరించినమాత్రముచేతఁ బాపములు నోటినుండి వెడలి పోవుచున్నవి. ఆపాపములు మరలఁ బ్రవేశించు ననుభయముచే మకారము తలుపువలె నడ్డును.

శ్లో. శ్రీరామాయణ మాదికావ్య మృషిణా వాల్మీకినా నిర్మితం
వేదాంతార్థవిశారదై రనుదినం స్తుత్యం సురై రర్చితమ్
శ్రోతౄణా మఘనాశనం సురతరో స్తుల్యం తు ముక్తిప్రదం
యే శృణ్వంతి పఠంతి రామచరితం తే యాంతి విష్ణోః పదమ్. 102

శా. శ్రీరామాయణ మాదికావ్య మగజా సేవ్యంబు వాల్మీకిచే
నాయాథంబుగ నిర్మితంబు నిగమాంతార్థప్రబోధంబు మం
దారప్రాయము ముక్తిదంబు విబుధ స్తవ్యంబు దీనిన్ వినన్
ఘోరాఘౌఘహరం బగున్ చదువ వైకుంఠంబు ప్రాప్తం బగున్.

తా. ఋషియగు వాల్మీకిచే జేయఁబడినట్టి వేదాంతార్థముల నేర్పరు లైనవారి చేతఁ బ్రతిదినము స్తోత్రము చేయఁదగినట్టి దేవతలచే స్తోత్రము చేయఁబడుచున్నట్టి విను వారిపాపములను నశింపఁజేయునట్టి కల్పవృక్షమునకు సమాన మైనట్టి మోక్షము నిచ్చునట్టి రామచరిత్ర మైన రామాయణ మను నాదికావ్యమును ఎవరు వినుచున్నారో వారు విష్ణుస్థానమును బొందుచున్నారు.

మ. శివతుల్యుం డగునాదిశంకరులు మున్ శ్రీరామకర్ణామృతం
బవనిన్ సంస్కృత మేర్పరించె నది మోక్షాపేక్షఁ జేకూరునం
శివరాబ్ధీందుసుసిద్ధసిద్ధకవి నేశ్రద్ధన్ దెనింగించి రా
ఘవ! పూదండగ నిచ్చినాఁడఁ గొనుమా కల్పంబుగా సత్కృపన్.

మాలిని. విమలకమలమూర్తీ విస్ఫురన్నీలమూర్తీ
శమదముగుణవర్తీ సాధుసంతాపహర్తీ
సుమశరసమగాత్రా సూరిసంస్తోత్రపాత్రా
సమదదనుజజైత్రా క్ష్మాతనూజాకళత్రా.

మ. ఇది శ్రీరామపదారవిందమకరందేచ్ఛాత్తసన్మత్తష
ట్పదవిజ్ఞానపదాబ్జరేణుపటలప్రాప్తోత్తమాంగోల్లస
న్ముదితాంతఃకరణుండు సిద్ధకవినామన్యుం డైనరామావనీ
శదయాలోకనచేతఁ జెప్పెఁ బ్రథమాశ్వాసం బభీష్టాప్తికిన్.

# ద్వితీయాశ్వాసము.

శ్లో. శ్రీరామం జనకక్షితీశ్వరసుతావక్త్రాంబుజాహారిణమ్
శ్రీమద్భానుకులాబ్ధికౌస్తుభమణిం శ్రీరత్నవక్షస్స్థలమ్
శ్రీకంఠాద్యమరౌఘరత్నమకుటాలంకారపాదాంబుజమ్
శ్రీవత్సోజ్జ్వల మింద్రనీలసదృశం శ్రీరామచంద్రం భజే. 1

శా. శ్రీమద్భానుకులాబ్ధికౌస్తుభమణిన్ ♦ శ్రీవత్సబాహాంతరున్
సోమాదిక్రతుభుజ్మణీమకుటస ♦ చ్ఛోభాంఘ్రిపద్మున్ ధరా
భామాజాస్యసరోజమిత్రు విలస ♦ త్ప్రాకారిరత్నాంగు శ్రీ
రామున్ దారకనాము నాఘువిని నా ♦ రాధింతు నశ్రాంతమున్.

తా. సీతాముఖపద్మమునకు మనోహరుఁడైనట్టి శోభగలసూర్యవంశమనెడు సముద్రమునకుఁ గౌస్తుభమణియైనట్టి లక్ష్మీకరములైన రత్నహారములు వక్షస్థలమందుఁ గలిగినట్టి ఈశ్వరుఁడు మొదలగు దేవతాసమూహముల రత్నకిరీటముల కలంకారమైన పాదపద్మములు గలిగినట్టి శ్రీవత్సచిహ్నముచేఁ బ్రకాశించుచున్నట్టి ఇంద్రనీలముసమాన కాంతిగలిగినట్టి శ్రీరామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. శ్రీరంగేశపదాబ్జలగ్నహృదయం శ్రీశంఖచక్రాన్వితమ్
శ్రీమన్నిర్జరపాదపస్ఫుటపదం శ్రీసింహపీఠస్థితమ్
శ్రీవైకుంఠసహస్రమస్తకలసద్భోగాసనేశాయినమ్
శ్రీభూమీసుతయాయుతం శ్రితనిధిం శ్రీరామమూర్తిం భజే. 2

శా. శ్రీరంగేశపదాబ్జలబ్ధహృదయున్ ♦ శ్రీదేవవృక్షస్థితున్
సారోదారసుశంఖచక్రధరుపం ♦ చాస్యాసనాసీను శృం
గారాకారు వికుంఠధాము నహిరా ♦ ట్పర్యంకశాయిన్ హరిన్
శ్రీరామున్ ధరణీసుతాయుతు శ్రితా ♦ ర్తిఘ్నుం భజింతు న్మదిన్.

తా. శ్రీరంగనాయకుని పాదపద్మములయందుఁ దగిలినమనస్సు గలిగినట్టి శంఖచక్రములతోఁ గూడినట్టి కల్పవృక్షమువంటి పాదములు గలిగినట్టి సింహాసనమందున్నట్టి వైకుంఠమందలి వేయిపడగలుగలశేషుని దేహపీఠమందు శయనించునట్టి సీతతోఁ గూడినట్టి ఆశ్రితులకు ధననిధియైన శ్రీరామమూర్తిని సేవించుచున్నాను.

శ్లో. ఆనందనంద మరుణాధర మంబుజాక్షం
మాపీతవస్త్ర మతసీకుసుమోజ్జ్వలాంగమ్
అక్షాంతవర్ణ మకలంక మమేయ మాద్య
మత్యాకృతిం రఘుపతిం శరణాగతో౽స్మి. 3

మ. అకలంకాత్ము నమేయు నాద్యు హరి ని। త్యానందు సర్వామరా
ధిపుఁ గంజాక్షు సువర్ణచేలధరు నా। ద్యక్షాంతవర్ణాత్ము దా
రకరూపు న్నవపల్లవాధరు నతు। శ్యాముఁ ఘనశ్యాము సే
వకమందారు నుదారు ధీరజనతా। వంద్యుఁ మదిం గొల్చెదన్.

తా. ఆనందరూపుఁడైనట్టి యెఱ్ఱని పెదవి గలిగినట్టి పద్మములవంటి నేత్రములు గలిగినట్టి పచ్చనివస్త్రము గలిగినట్టి అగిసెపువ్వులవలెఁ బ్రకాశించుచున్న దేహము గలిగినట్టి అకారము మొదలు క్షకారము వరకుఁగల యక్షరస్వరూపుఁడైనట్టి నిష్కళంకుఁడైనట్టి యింతటివాఁడని ప్రమాణింపశక్యముగానట్టి మొదటివాఁడైనట్టి గొప్పసౌందర్యము గలిగినట్టి శ్రీరాముని శరణుఁ బొందితిని.

శ్లో. సాకేతే నవరత్నపఙ్క్తిఖచితే చిత్రధ్వజాలంకృతే
వాసే స్వర్ణమయే దళాష్టలలితే పద్మే విమానోత్తమే
ఆసీనం భరతాదిసోదరజనైః శాఖామృగైః కిన్నరైః
దిక్పాలై ర్మునిపుంగవై ర్నృపగణైః సంసేవ్యమానం భజే. 4

మ. ఘనసాకేతమునన్ మణిధ్వజలస। త్సౌధంబునన్ బుష్పకం
బున హేమాష్టదళాబ్జమధ్యమునునన్। భూపుత్రియున్ సోదరుల్
జనులున్ దిగ్వరులున్ గపుల్ నృపులు నా। ప్తుల్ కిన్నరుల్ సంతసం
బునఁ గొల్వం జెలువొందు రాముఁ దలఁతున్। భూపుత్రికాధీశ్వరున్.

తా. అయోధ్యయందు నవరత్నస్థాపితమై చిత్రములైన ధ్వజములచేత నలంకరింపఁబడిన యింటియందు బంగారువికారమైన యష్టదళపద్మమందు విమానమందు గూర్చున్నట్టి సీతతోను భరతాదులైన తమ్ములతో వానరులతోఁ గిన్నరులతో దిక్పతులతో మునిశ్రేష్ఠులతో రాజసమూహములతో సేవింపఁబడుచున్న రాముని సేవించుచున్నాను.

శ్లో. కందర్పాయుతకోటికోటితులితం కాలాంబుదశ్యామలం
కంబుగ్రీవ ముదారకౌస్తుభధరం కర్ణావతంసోత్పలమ్
కస్తూరీతిలకోజ్జ్వలం స్మితముఖం చిన్ముద్రయాలంకృతం
సీతాలక్ష్మణవాయుపుత్రసహితం సింహాసనస్థం భజే. 5

మ. సుమబాణాయుతసుందరున్ లలితక। స్తూరీలలాటోజ్జ్వలున్
గమలాక్షున్ ధరణీసుతాయుతు జగ। త్కాంతున్ హరిన్ గౌస్తుభా

ఖ్యమణీయుక్తశుభాస్యుఁ గంబుగళునిఁ ♦ గర్ణావతంసప్రభా
సముకుందుర్ మణిపీఠగుర్ గొలిచెదర్ ♦ చిన్ముద్రికాలంకృతున్.

తా. లక్షకోటి మన్మథులతో సమానుఁడైనట్టి వర్షకాలమేఘమువలె నల్లనైనట్టి శంఖమువంటికంఠము గలిగినట్టి గొప్పకౌస్తుభమణిని ధరించినట్టి కుండలములైన కలువలు గలిగినట్టి కస్తూరిబొట్టుచేతఁ బ్రకాశించుచున్నట్టి నవ్వుచేతఁ బ్రకాశించునట్టి జ్ఞానముద్రచేత నలంకరింపఁబడినట్టి సీతతో లక్ష్మణునితో ఆంజనేయునితోఁగూడినట్టి సింహాసనమందున్న రాముని సేవించుచున్నాను.

శ్లో. వరాభయం దివ్యరథాంగశంఖం, సకౌస్తుభం వేష్టితపీతవస్త్రమ్
కిరీటహారాంగదకుండలాంగం, శ్రీవత్సచిహ్నం శిరసా నమామి 6

మ. అరిభీకృద్ధరిశంఖనందకిగదా ♦ ద్యస్త్రుర్ మహాకౌస్తుభా
భరణుర్ రత్నకిరీటకుండలధరుర్ ♦ బీతాంబరాడంబరుర్
వరదుర్ శ్రీరఘురామభూరమణు శ్రీ ♦ వత్సాంకు సీతామనో
హరుఁ గారుణ్యపయఃపయోధి మదిలో ♦ నశ్రాంతముం గొల్చెదన్.

తా. వరములను అభయమునిచ్చునట్టి ప్రశస్తమైన శంఖము చక్రము గలిగినట్టి కౌస్తుభమణితోఁగూడినట్టి పచ్చనిబట్టఁగట్టుకున్నట్టి కిరీటము హారములు భుజకీర్తులు కుండలములు శరీరమందుఁ గలిగినట్టి శ్రీవత్సమను మచ్చచిహ్నము గలిగిన రాముని శిరస్సుచే నమస్కరించుచున్నాను.

శ్లో. దిగంబరం కింకిణిమేఖలోజ్జ్వలం, లలాటపర్యంతవిలంబితాలకమ్
కలద్వచస్కంకమనీయనూపుర, ద్వయంశిశుం రామమహంనమామి.

చ. ఘనమణినూపురద్వయు ది♦గంబరుఁ గింకిణిమేఖలోజ్జ్వలుర్
ఘనునికలాభిభాషణుని ♦ గమ్రలలాటవిలంబితాలకుర్
జనులకు తల్లిదండ్రులకు ♦ సంతస మొప్పఁ జెలంగుబాలరా
ముని వినుతించి సంతతము ♦ మ్రొక్కుచు నుందుహృదంతరంబునన్. 7

తా. దిగంబరుఁడు మువ్వలుగల మొలనూలునుగలవాఁడు నుదుటియందు వ్రాలుచున్న ముంగురులు గలిగినట్టి మధురవాక్కులు గలిగినట్టి సొగసైనయందెలజత గలిగినట్టి పిల్లవాఁడైనరాముని నేను నమస్కరించుచున్నాను.

శ్లో. మందారమూలే మణిపీఠసంస్థం
సుధాప్లుతం దివ్యవిరాట్స్వరూపమ్
సబిందునాదాంతకళాంతతుర్య
మూర్తిం భజేహం రఘువంశరత్నమ్. 8

మ. అకలంకామరభూజసంస్థమణిపీ • ఠాసీనుని న్నాదబిం
దుకళాతీతు విరాట్స్వరూపు భగవం • తుఁ సర్వలోకాధినా
యకు సీతేశు సుధాభిషిక్తు మనువం • శాంభోధిచింతామణిన్
సకలాత్ముం రఘురామరత్న మగునా • స్వామిన్ మదిన్ గొల్చెదన్.

తా. మందారవృక్షముల మొదటియందు మణిపీఠమందున్నట్టి అమృతముచేత వ్యాప్తమైనట్టి (అమృతమువలె నానందకరుఁడనుట.) అదివిరాట్స్వరూపుఁడైనట్టి బిందునాదకళల నతిక్రమించిన నాల్గవరూపము గలిగినట్టి రఘువంశశ్రేష్ఠుఁడైనరాముని సేవించుచున్నాను.

శ్లో. అనర్ఘ్యమాణిక్యవిరాజమాన, శ్రీపాదుకాలంకృతశోభనాభ్యామ్
అశేషబృన్దారకవందితాభ్యాం, నమోనమోరామపదాంబుజాభ్యామ్.
ధ్వజాంబుజచ్ఛత్రరథాఙ్గశంఖ, దంభోళిపాశాంకుశమత్స్యచిహ్నం
బ్రహ్మేంద్రదేవాదికిరీటకోటి, సంఘృష్టపాదాంబుజయుగ్మమీళే. 9

చ. అనుపమనూత్నరత్ననిచ • యప్రచయోజ్జ్వలనవ్యపాదుకా
వనములు వారిజప్రభవ • వాసవచంద్రదినేంద్రముఖ్యపా
వనమకుటాగ్రశోభితసు • వర్ణమణీసమలంకృతంబులున్
వనజరథధ్వజాంబుశర • పాశహలాంకుశపుండరీకలాం
ఛనములు రామచంద్రపద • సారసముల్ మదినిల్పి కొల్చెదన్.

తా. విలువలేనిమణులచేతఁ బ్రకాశించుచున్న శోభగల పావుకోళ్లచేత నలంకరింపఁబడినట్టి శుభకరములైనట్టి సమస్తదేవతలచేత నమస్కరింపఁబడినట్టి రాముని పాదపద్మములకొఱకు నమస్కారము. రేఖలైన జెండాలు, పద్మములు, ఛత్రములు, చక్రములు, శంఖములు, వజ్రములు, పాశములు, అంకుశములు, మత్స్యములు, చిహ్నములు గలిగినట్టి బ్రహ్మ, ఇంద్రుఁడు, దేవతలు మొదలగువారి కిరీటముల అంచులచేత ఒరయుచున్న పాదపద్మద్వంద్వముగల రాముని స్తుతించుచున్నాను.

శ్లో. లలాటదేశోజ్జ్వలబాలభూషణం
సతాండవం వ్యాఘ్రనఖాంకకంధరమ్
దిగంబరం శోభితబర్బరాలకం
శ్రీబాలరామం శిరసా నమామి. 10

ఉ. ఫాలమునన్ లలామమును • భాసిలఁ దాండవ మాచరింపుచున్
లీల దిగంబరత్వమును • లేనగవున్ గళలంబమానశా

ర్దూలనఖంబుముంగురుల♦రోచులు బర్వ నఖర్వవై ఖరిఁ
బాలకుఁడై నటించు ముని♦పాలనశీలుని రాముఁ గొల్చెదన్.

తా. నుదుటియందుఁ బ్రకాశించుచున్న చెర్చుక్కబొట్టు గలిగినట్టి నాట్యముతోఁగూడినట్టియు, పులిగోరుపతకము కంఠమందుఁ గలిగినట్టి దిగంబరుఁడైనట్టి ప్రకాశించువంకరకురులుగలిగినట్టి చిన్నవాఁడైన రాముని శిరస్సుచే నమస్కరించుచున్నాను.

శ్లో. శతాష్టదివ్యస్థలమూర్తివందితం, శతక్రతుబ్రహ్మమరుద్గణార్చితమ్
శశాంకవైశ్వానరభానుమండల, స్థితం భజేహం రఘువంశవర్ధనమ్.

చ. అమలశతాష్టదివ్యనిల♦యస్థితు వారిజసంభవాంబుభృ
ద్గమనముఖామరార్చితు సు♦ధాకరవహ్నిపతంగమండల
స్థు మితు రఘూద్వహు న్ఘనక♦చేలుఁ గృపాలుని నీలుదైత్యసం
తమసదినేశు రామజన♦నాథు భజించెద నిష్టసిద్ధికిన్. 11

తా. అనేకదివ్యస్థలములయందలి విగ్రహరూపములుగా నమస్కరింపఁబడుచున్నట్టి యింద్రుఁడు బ్రహ్మ మొదలగు దేవసమూహములచేత నమస్కరింపఁబడునట్టి చంద్రసూర్యాగ్నులయం దున్నట్టి రఘువంశమును వృద్ధిఁజేయురాముని సేవించుచున్నాను.

శ్లో. కర్ణాంతవిశ్రాంతధనుర్గుణాంక, కలంబలక్షీకృతరాక్షసేశ్వరమ్
వృద్ధశ్రవస్యందనమధ్యసంస్థం, రూక్షేక్షణం రామ మహం నమామి.

శా. పాకారాతిశతాంగ మెక్కి రణభూ♦భాగంబు గంపింపఁగా
నాకర్ణాంతధనుర్వి ముక్తదృఢబ్ర♦హ్మాస్త్రంబునన్ రావణున్
లోకంబు ల్వినుతింపఁ ద్రుంచినబుధ♦శ్లోకు న్సరోషాంబకున్
గాకుత్స్థాన్వయదుగ్ధవారినిధిరా♦కాచంద్రుఁ గీర్తించెదన్. 12

తా. కర్ణసమీపమందు వ్యాపించిన ధనుస్సుయొక్క నారికి నలంకారమగు బాణమునకు గుఱిచేయఁబడిన రావణుఁడు గలిగినట్టి, యింద్రుని రథమధ్యమందున్నట్టి తీక్ష్ణములైన చూపులుగల రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. సుత్రామ నీలోత్పల నీలమేఘ
శ్రీనిర్జితాంగం సుతయాధరణ్యాః
యుక్తం సురేంద్రావనమానసంతం
రామం భజే రాక్షసవంశనాశమ్. 13

మ. హరినీలోత్పలమేఘసంపదపహా♦రాంగున్ ధరాభామినీ
వరపుత్రీసహితున్ సమస్తముఖభృ♦గ్వర్యావనాంతర్మనిన్

ధరణీనాథసురారివంశవని ని♦ర్దగ్ధాగ్నిహోత్రుఁ బరా
త్పరు దీనార్తిహరుఁ రఘూద్వహు మది ♦ న్భావించి సేవించెదన్.

తా. ఇంద్రనీలములయొక్కయు నల్లగలువలయొక్కయు నీలమేఘముయొక్కయు శోభనుజయించిన శరీరముగలిగినట్టి సీతతోఁగూడినట్టి యింద్రుని రక్షించుట యందు మనస్సు గలిగినట్టి రాక్షసకులమును నశింపఁజేయునట్టి రాముని సేవించుచున్నాను.

శ్లో. రాకాచంద్రనిభాననం రతిపతిద్వేషిప్రియం రాక్షసా
ధీశగ్రీవవిభేదనస్ఫుటపటుప్రఖ్యాతబాణోజ్జ్వలమ్
రత్నాలంకృతపాదుకాంచితపదాంభోజం రమావల్లభం
రాగద్వేషవిహీనచిత్తసులభం రామం భజే తారకమ్. 14

శా. రాగద్వేషవిహీనచిత్తసులభుఁ ♦ రాకేందుబింబాననుఁ
భోగీంద్రాభరణప్రియుఁ దనుజరా♦ణ్మూర్ధచ్ఛిదా ప్రోజ్జ్వలుఁ
వాగీంద్రార్చితపాదుకాంచితు లస♦త్పాదాంబుజాతద్వయుఁ
శ్రీగోవిందు రమాధినాథు వరదుఁ ♦ శ్రీరాము సేవించెదన్.

తా. పూర్ణచంద్రునివంటి మొగముగలిగినట్టి యీశ్వరునికిష్టుఁడైనట్టి రావణకంఠములను బ్రద్దలుచేయుటయందు స్పష్టములై సమర్థములై ప్రసిద్ధములయిన బాణములచేఁ బ్రకాశించుచున్నట్టి రత్నములచే నలంకరింపఁబడిన పాదుకలచే నొప్పుచున్న పాదపద్మములు గలిగినట్టి లక్ష్మికిఁ బ్రియుఁడైనట్టి రాగద్వేషములు లేని మనస్సుగలవారికి లభ్యుఁడైనట్టి సంసారములనఁ దరింపఁజేయు రాముని సేవించుచున్నాను.

శ్లో. ఆలోలస్ఫుటరత్నకుండలధరం ఆవిస్మితాలంకృతం
ఆధారాదికచక్రమండలగతం ఆనందకందాంకురమ్
ఆవిర్భూతకృపాంతరంగజలధిం ఆద్యంతవర్ణాశ్రయం
ఆపన్నార్తినిదాఘమేఘసమయం రామం భజే తారకమ్. 15

మ. అకలంకోజ్జ్వలరత్నకుండలు సమ♦స్తానందకందు న్మహా
ధికు షట్చక్రనివాసు రామవిభు నా♦ద్యంతవర్ణాత్ము తా
రకు సంభూతకృపాంతరంగజలధిన్ ♦ భ్రాజత్స్మితాస్యేందు సే
వకపుఁ దీననిదాఘమేఘు నుతగీ♦ర్వాణుఁ భజింతు న్మదిన్.

తా. కదలుచున్న మంచిరత్నకుండలములను ధరించినట్టి చిఱునవ్వుచే నలంకరింపఁబడినట్టి ఆధారాదిచక్రమధ్యమును బొందినట్టి ఆనందమను గుంపకు మొలకయైనట్టి పుట్టినదయగల యంతఃకరణసముద్రము గలిగినట్టి ఆకారము మొదలు క్షకారము

వఱకుగల యక్షరములా శ్రయముగలిగినట్టి అపదను పొందినవారిబాధ యను గ్రీష్మమునకు వర్షాకాలమైనట్టి తరింపఁజేయు రాముని సేవించుచున్నాను.

శ్లో. సాకేతాంతరతారమంటపమహామాణిక్యసింహాసనే
తన్మధ్యేష్టదళాంబుజే స్ఫుటతరే చిత్కర్ణికే సంస్థితమ్
సౌమిత్రాంబుజమిత్రసూనుభరతశ్రీవాయుపుత్రైర్వృతం
ముద్రాలంకృతపాణిసారసభుజం రామం భజే తారకమ్. 16

శా. సాకేతాంతరరత్నమంటపవిరాజత్సింహపీఠంబునన్
దేకాష్టచ్ఛదపద్మకర్ణికను బా నింపొంది శాఖామృగా
నీకంబుల్ నిజసోదరుల్ గొలువ పాణిన్ బోధముద్రాంకుఁడౌ
కాకుత్స్థున్ రఘురాముఁ దారకు మదిన్ గాంక్షించి సేవించెదన్.

తా. అయోధ్యాపట్టణముయొక్క మధ్యమందలి పొడుగైన మంటపమందలి గొప్పమణిపీఠమందు దానిమధ్యమందు మిక్కిలి స్ఫుటమైన జ్ఞానమేకర్ణికగల అష్టదళపద్మమందున్నట్టి లక్ష్మణునిచే సుగ్రీవునిచే నాంజనేయునిచేఁ జుట్టుకోఁబడినట్టి జ్ఞానముద్రచే నలంకరించఁబడిన పాణిపద్మము గలిగినట్టి పుట్టువులేనట్టి తరింపఁజేయు రాముని సేవించుచున్నాను.

శ్లో. విరాజమానోజ్జ్వలపీతవాససం, విశాలవక్షస్థలకౌస్తుభశ్రియమ్
భజే కిరీటాంగదరత్నకుండలం, నమస్తులస్యావనమాలయాంకితమ్.

ఉ. చారుసువర్ణచేలుని విశాలభుజాంతరకౌస్తుభోజ్జ్వలున్
శ్రీరమణీయకుండలకిరీటశుభాంగదతారహారనుం
జీరవిభూషణాంగుఁ దులసీదళదాము గుణాభిరాము సీ
తారమణీహృదుత్పలసుధాముని రాముని సన్నుతించెదన్. 17

తా. ప్రకాశించుచున్న ప్రజ్వలించుచున్న పచ్చనిబట్టగలిగినట్టి విశాలమైన యురమునఁ గౌస్తుభమణియొక్క శోభగలిగినట్టి కిరీటము భుజకీర్తులు మాణిక్యకుండలములు గలిగినట్టి తులసియొక్క యంతట నిర్మలమైన మాలికచేత నలంకరింపఁబడిన రాముని సేవించుచున్నాను.

శ్లో. మూలాదిషట్సరసిజాంతసహస్రపద్మ
పత్రాంతరాళనిలయం భవబంధనాశమ్
నాదాంతచంద్రగళితామృతసిక్తరూపం
నాదాంతనాదసుహిమాస్పదరామమీడే. 18

మ. అరయన్ షట్కములోపరిస్థితసహ♦స్రారాంతరాళస్థితున్
వరనాదాంతశశాంకనిర్గళిత దే♦వాహారధారాప్రవి
స్తరసంసిక్తశరీరుఁ బాపహరు స♦చ్చారిత్రు నాదాంతనా
దు రమేశున్ బరమేశు రాము భజియిం♦తున్ స్వాంతమందెంతయున్.

తా. మూలాధారము మొదలైన యారుపద్మములపైనుండు సహస్రారపద్మము యొక్క రేకుల మధ్యమందు స్థానముగలిగినట్టి సంసారపాశమును నశింపఁ జేయునట్టి నాప్రణవనాదమధ్యమందుఁ జంద్రునివలజారుచున్న యమృతముచేఁ దడవఁబడినట్టి నాదనాదములోని నాదముయొక్క మహిమకు స్థానమైన రాముని స్తోత్రము చేయుచున్నాను.

శ్లో. వందేవరప్రదమహావరదానగర్వ
లంకాధినాథకులపర్వతనాశవజ్రమ్
తం రావణానుజమరుత్సుతభానుసూను
దిక్పాలసోదరగణైః పరిసేవ్యమానమ్. 19

చ. కమలభవప్రదత్తవర♦గర్వితపూర్వసుపర్వనాయకో
త్తముని వధించి ముఖ్యు లగు♦తారవిభీషణనీలజాంబవ
త్కుముదమరుత్సుతార్కజులు ♦ గొల్వ దిగీశులు సోదరుల్ ప్రతో
షమున భజింప నిం పలరు♦సద్గుణధాముని రాము నెన్నెదన్,

తా. వరములనిచ్చిన బ్రహ్మయొక్క వరములచేతనైన గర్వముగల రావణునివంశమను పర్వతము నశింపఁజేయుటకు వజ్రమైనట్టి విభీషణుఁడు, ఆంజనేయుఁడు, సుగ్రీవుఁడు, దిక్పతులు, తమ్ములు అనువారి సమూహములచే సేవింపఁబడుచున్న రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. అజ్ఞానగాఢతిమిరాపహభానుమూర్తి
మారక్తచారునయనాంబుజ మాదిబీజమ్
అంభోధిమధ్యవటపత్రశయాన మాది
మధ్యాంతశూన్య మఖిలాస్పదరామచంద్రమ్. 20

మ. అరుణాబ్జాక్షు సముద్రమధ్యవటప♦త్రాభ్యంతరస్థాయకున్
స్ఫురదజ్ఞానతమిస్రభాస్కరు జగ♦త్పూర్ణాత్ము నాద్యంతశూ
న్యు రమాధీశ్వరు నాదిబీజు నసమా♦ను న్మానితోదారు నుం
దరమందస్మితు రామచంద్రుని మదిన్ ♦ ధ్యానింతు నశ్రాంతమున్.

తా. అజ్ఞానమను గొప్పచీకటిని బోఁగొట్టు సూర్యస్వరూపుఁడైనట్టి అంతట నెఱ్ఱనైన నేత్రపద్మములు గలిగినట్టి ప్రపంచము మొదటికారణమైనట్టి సముద్రమధ్యమున మఱ్ఱియాకునందుఁ బరున్నట్టి ఆదిమధ్యాంతశూన్యుఁడైనట్టి సమస్తమునకు స్థానమైనరామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. సుధాసముద్రాంతవిరాజమాన, ద్వీపే సితే చందనపారిజాతే
మహాసనే పన్నగతల్పమధ్యే, నిషణ్ణమీశే రఘువంశరత్నమ్. 21

శా. క్షీరాబ్ధ్యంతసితాంతరీపవిలసచ్ఛ్రీచందనాగాంతిక
స్ఫారానర్ఘ్యసునూత్నరత్ననిచయప్రద్యోతపీఠంబునం
బాయూఢం బగుకాద్రవేయవరపర్యంకాంతరాసీనుఁ డౌ
శ్రీరాముఁ రఘువంశరత్నము మదిన్ జింతింతు నశ్రాంతమున్.

తా. అమృతసముద్రమధ్యమందుఁ బ్రకాశించుచున్న శ్వేతద్వీపమందుఁ గల చందనపారిజాతము లనెడు కల్పవృక్షములలో గొప్పపీఠమందు శేషశయ్యామధ్యమందుఁ గూర్చున్న రఘువంశశ్రేష్ఠుఁడైన రాముని నుతించుచున్నాను.

శ్లో. స్మితాననం పద్మదళాయతేక్షణం
వినీలమాణిక్యజితాంగశోభితమ్
జటాకిరీటం శరచాపలాంఛనం
నమామ్యహం భానుకులాబ్ధికౌస్తుభమ్. 22

ఉ. సుందరమందహాసు పరిశుద్ధసరోరుహపత్రనేత్రుఁ బ్రా
రందరనీలగాత్రుని విరాజితభవ్యజటాకిరీటు సా
నందు సకార్ముకాస్త్రు జననాయకు భానుకులాబ్ధికౌస్తుభున్
జందనచర్చితాంగు రఘుసత్తమునిన్ మదిలో భజించెదన్.

తా. చిఱునవ్వు మొగమందుఁ గలిగినట్టి పద్మపు రేకులవలె విశాలములైన నేత్రములు గలిగినట్టి నీలమణులను జయించిన శరీరముచేఁ బ్రకాశించునట్టి జటాకిరీటములు గలిగినట్టి ధనుర్బాణములు చిహ్నముగలిగినట్టి సూర్యవంశమను సముద్రమునకుఁ గౌస్తుభమణియైన రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. ప్రసూనబాణాంకిత మిక్షుచాపం
చక్రాబ్జపాశాంకుశవంశనాళమ్
కరైర్దధానం ఘననీలవర్ణం
శ్రీకృష్ణరూపం ప్రణమామి రామమ్. 23

చ. కరముల నెన్మిదింట సుమకాండము వేణువు నిక్షుచాపముం
దరముఁ గశాంకుశంబులు సుదర్శనపాశములుం ధరించి భా
స్కరనిభవర్ణుఁ డై మహిమపత్కరుణాకరకృష్ణమూర్తి యై
పరగినరామచంద్రునకుఁ బావనకీర్తికి భక్తి మ్రొక్కెదన్.

తా. పుష్పబాణముచే నలంకరించఁబడినట్టి చెఱకువింటిని, చక్రముం, శంఖమును, పాశమును, అంకుశమును, పిల్లనగ్రోవిని ఎనిమిది చేతులచే ధరించునట్టి సూర్యునివంటి రంగుగలిగినట్టి శ్రీకృష్ణరూపుఁడైన రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. బహూరుపాదోదరవక్త్రలోచనం, దీప్తప్రచండానలదుర్నిరీక్షమ్
అశేషబృందారకనాగగోచరం, భజామి తే రాఘవవిశ్వరూపమ్. 24

మ. కరపాదోదరలోచనోరుముఖసంక్రాంతోద్భవాగ్నిచ్ఛటా
స్ఫురితం బై కడు దుర్నిరీక్ష్య మయి దిక్పుంజంబు లన్నింటి ని
ర్జరవాజ్ఞానసదుర్లభం బయిన రాజస్యేభ్యు రామావనీ
శ్వరు విశ్వాకృతి కే నొనర్చెద నమస్కారంబు లశ్రాంతమున్.

తా. ఓ రామా! అనేకములైన తొడలు, పాదములు, కడుపులు, మొగములు, కన్నులు గలిగినట్టి తీక్ష్ణాగ్నివలెఁ జూడ శక్యముగానట్టి సమస్తదేవతలతోను, సర్పములతోను గోచరమైనట్టి నీవిశ్వరూపమును సేవించుచున్నాను.

శ్లో. సహస్రనేత్రాననపాదబాహుం, మనంతవీర్యం రవికోటితుల్యమ్
స్రక్చందనాలంకృతదివ్యదేహం, భజామ్యహం తే హరివిశ్వరూపమ్.

మ. కరనేత్రాననశీర్షపాదములు విఖ్యాతిఁ సహస్రాంకమై
సరసీజాప్తసహస్రకోటినిభమై స్రక్చందనాలంకృత
స్ఫురితం బయ్యు ననంతవీర్యమయి సంపూర్ణప్రభావాఢ్యమై
పరగుం రాఘవు విశ్వరూపము మదిం భావించి సేవించెదన్. 25

తా. వేలకొలఁదికన్నులు మొగములు కాళ్ళుచేతులు గలిగినట్టి అంతములేని పరాక్రమము గలిగినట్టి కోటిసూర్యులతో సమానమైనట్టి పూలదండలచేత గంధముచేత నలంకరింపఁబడిన శ్రేష్ఠమైనదేహము గలిగినట్టి నీవిశ్వరూపమును సేవించుచున్నాను.

శ్లో. కలంబకోదండగదాబ్జసంయుతం, దంష్ట్రాకరాళాంకధనంజయాననమ్
పీతాంశుకస్వర్ణకిరీటకుండలం, భజామి తే రాఘవ విశ్వరూపమ్. 26

మ. ధరకోదండగదాకదంబయుతముం దంష్ట్రాకరాళాగ్నివి
స్ఫురదాస్యంబు సువర్ణచేలధృతముం భూరిప్రభారత్నక

ర్భ్వరసంజీవకిరీటకుండలమహా॥భూషోజ్జ్వలంబుల్ శుభ
స్ఫురమౌ రాఘవ విశ్వమూర్తికి నమ॥స్కారంబు లర్పించెదన్.

తా. బాణముతో ధనుస్సుతో గదతో శంఖముతోఁ గూడినట్టి కోరలే భయంకరమైన చిహ్నముగల యగ్నితోఁగూడిన మొగముగలిగినట్టి పచ్చనిబట్టయు బంగారుకిరీటము కుండలములు గలిగినట్టి నీవిశ్వరూపము నోరామా సేవించుచున్నాను.

శ్లో. కోదండ మిక్షుజనితం స్మరపంచబాణం
శంఖం రథాంగయవ మంకుశపాశవేణుమ్
హస్తై ర్దధాన మమలద్యుతి ముద్వహంతమ్
ప్రద్యుమ్న కృష్ణ మనిశం భజ రామచంద్రమ్. 27

చ. చెఱుకువి లైదుబాణములు ॥ చే ధరియించి రథాంగవేణుపా
శరుచిరశార్ఙ్గముఖ్యఘన॥సాధనయుక్తమహాష్టబాహునుం
దరహరినీలగాత్రుఁ బరు ॥ దర్పకుఁ గృష్ణు సువర్ణచేలు దా
శరథి బలాధిపుల్ శరధి॥సన్నుతు నచ్యుతు రాముఁ గొల్చెదన్.

తా. చెఱుకువిల్లు మన్మథసంబంధమైన అయిదుబాణములు శంఖము చక్రము అంకుశము పాశము వేణుదండమును ఎనిమిదిచేతులఁ బూనినట్టి నూతనమణులకాంతి గలిగినట్టి ప్రద్యుమ్నావతారుఁడై నల్లనిరూపుగల రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. సీతాలోకనతత్పరం మణినిభం వ్యాఖ్యానముద్రాంచితం
వామేజానువిలంబహస్త మనిశం వీరాసనే సంస్థితమ్
మూలేకల్పతరో రనాదిమునిభిః బ్రహ్మాదిభి స్సేవితం
ముక్తాహారకిరీటకుండలధరం మూర్ధాభిషిక్తం భజే. 28

మ. విమలుల్ గల్పకమూలసంస్థితు మహా॥వీరాసనుల్ జానకీ
రమణీదర్శనతత్పరుల్ మణినిభుల్ ॥ రత్నోజ్జ్వలద్భూషణుల్
ప్రమదుల్ జానువిలంబహస్తు వరదుల్ ॥ వ్యాఖ్యానముద్రాంచితుల్
సుమనఃపూర్వభవాదినిర్జరముని॥స్తోత్రుల్ విభుల్ గొల్చెదన్.

తా. సీతను జూచుటయందు దాసక్తుఁడైనట్టి నీలమణులతో సమానుఁడైనట్టి బోధముద్రతోఁగూడినట్టి యెడమమోకాలియందు వ్రేలుచున్నహస్తము గలిగినట్టి వీరాసనమందున్నట్టి కల్పవృక్షము మొదటియందుండి ప్రాచీనమునులచే బ్రహ్మాదులచే సేవించఁబడుచున్నట్టి ముత్యాలహారములు కిరీటము కుండలములను ధరించినట్టి పట్టాభిషేకమును బొందినట్టిరాము నెల్లప్రభు శిరస్సుచేత సేవించుచున్నాను.

శ్లో. యద్రూప మానందకరం మునీనాం
యద్బాణఆఖండలశత్రునాశనమ్
యద్దైవతం సర్వజనాంతరస్థం
తత్సర్వరూపం రఘునాథమీళే. 29

ఉ. ఎవ్వనిమూర్తి యోగితతి కెప్పుడు సంతస మొందజేయుఁ దా
నెవ్వనికాండకాండము మహేంద్రవిరోధివినాశకారణం
బెవ్వఁడు విశ్వవిశ్వగతుఁ డెవ్వఁడు భక్తజనావనప్రియుం
డవ్విభుఁ డైనరామున కహర్నిశ మున్నతు లాచరించెదన్.

తా. ఎవనిరూపము మునులకు సంతోషముఁ జేయునో ఎవనిబాణము రాక్షసులను నశింపఁజేయునో యేదేవుఁడు సమస్తజనులయంతరంగము దుండునో అట్టిసర్వస్వరూపుఁడైన రఘునాయకుని స్తోత్రము చేయుచున్నాను.

శ్లో. నాదం నాదవినీలచిత్తపవనం నాదాంతతత్త్వప్రియం
నామాకారవివర్జితం నవఘనశ్యామాంగనాదప్రియమ్
నాదాంభోజమరందమత్తవిలసద్భృంగం మదాంతస్థితం
నాదాంతధ్రువమండలాబ్జరుచిరం రామం భజే తారకమ్. 30

శా. నాదుఁ నాదవినీలచిత్తపవనుఁ నాదాంతతత్త్వప్రియుఁ
నాదాంతధ్రువమండలాబ్జరుచిరుఁ నామక్రియావర్జితుఁ
నాదాంభోజమరందమత్తమధుపుఁ నాదప్రియుఁ సన్నవాం
భోదశ్యాము నవాంతసంస్థితుని రాముఁ దారకుఁ గొల్చెదన్.

తా. ఓంకారవాచ్యుఁడును, వేదాంతములయందు ప్రతిపాదింపఁబడినవాఁడును నామరూపములు లేనివాఁడును, క్రొత్తమేఘమువలె నల్లనైనవాఁడును, వేదములయం దుఁ బ్రీతిగలవాఁడును, అంతరాత్మయైనవాఁడును, ఆశ్రయించువారిని రక్షించువాఁడును నైన శ్రీరాముని సేవించెదను.

శ్లో. నానాభూతహృదబ్జసద్మనిలయం నామోజ్జ్వలాభూషణం
నామస్తోత్రపవిత్రితత్రిభువనం నారాయణాష్టాక్షరమ్
నాదాంతేందుగళత్సుధాప్లుతతనుం నానాత్మచిన్మాత్రకం
నానాకోటియుగాంతభానుసదృశం రామం భజే తారకమ్. 31

శా. నాదాంతేందుగళత్సుధాప్లుతతనుఁ నానాత్మచిన్మాత్రకుఁ
వేదోదారు సమస్తభూతహృదయావిష్టుఁ విభుఁ గల్పకా

లాదిత్యాయుతకోటితుల్యపరమా♦త్మాష్టాక్షరీమంత్రగుణ్
శ్రీదుణ్ విశ్వపవిత్రరాము వరదుణ్ ♦ శ్రీరాము సేవించెదన్.

తా. సమస్తభూతముల హృదయపద్మగృహమందు నివాసము గలిగినట్టి రామ నామ మనెడు ప్రకాశమానమగునలంకారము గలిగినట్టి నామమును స్మరించుటచేఁ బవిత్రము చేయఁబడిన శ్లోకములు గలిగినట్టి నారాయణాష్టాక్షరమంత్రస్వరూపుఁడైనట్టి నాదమధ్యమందున్న చంద్రునివలెఁ జూచుచున్న సుషుమ్నచేఁ దమఁబడిన శరీరము గలిగినట్టి అంతర్యామియందు జ్ఞానరూపుఁడైనట్టి ప్రళయకాలకోటిసూర్యులతో సమానుఁడైన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. ఖశ్యామం ఖగవాహనం ఖరరిపుం ఖాద్యాదిభూతాత్మకం
ఖాతీతం ఖగమంత్రతత్పరపదం ఖద్యోతకోట్యుజ్జ్వలమ్
ఖావాచ్యం ఖగకేతనం ఖగమనం ఖర్వాటశృంగాలయం
ఖారాధ్యంచ ఖరంధ్రపీఠనిలయం రామం భజే తారకమ్. 32

మ. ఖరవైరిణ్ ఖగవాహనుణ్ రవినిభుణ్ ♦ ఖర్వాటశృంగాలయుణ్
పరమార్థాంచితమంత్రతత్పరు వియ♦ద్భ్రాజిష్ణు ఖారాధ్యు సు
స్థిరవేదాంతమయుణ్ విచిత్రగమనుణ్ ♦ శ్రీపంచభూతాత్మకుణ్
వరసత్యోక్తు సుషుమ్నమధ్యగతు శ్రీ♦వాసుణ్ బ్రశంసించెదన్.

తా. ఆకాశమువలె నల్లనైనట్టి గరుడవాహనుఁడైనట్టి ఖరాసురునిశత్రువైనట్టి ఆకాశాదిపంచభూతరూపుఁడైనట్టి ఆకాశము నతిక్రమించినట్టి ఖేచరముద్రామంత్రములయందు నాసక్తిగలవారికి స్థానమైనట్టి కోటిమెఱుపులవలెఁ బ్రకాశించునట్టి ఆకాశమువలెఁ జెప్పశక్యము గానట్టి గరుడధ్వజము గలిగినట్టి ఖర్వాటపర్వతశిఖరమందు నివాసముగలిగినట్టి ఆకాశమువలె బట్టబయలుగా ఆరాధింపఁబడినట్టి ఇంద్రియపీఠమగు మనస్సునందు స్థానముగల తారకరూపరాముని సేవించుచున్నాను.

శ్లో. వేద్యం వేదగురుం విరించిజనకం వేదాంతమూర్తిం స్ఫుర
ద్వేదం వేదకలాపమూలమహిమాధారాంతకందాంకురమ్
వేదశృంగసమానశేషశయనం వేదాంతవేద్యాత్మకం
వేదారాధితపాదపంకజ మహం రామం భజే తారకమ్. 33

శా. వేదాధారు సమస్తవేదగురుని ♦ వేదాంతవేద్యుణ్ లస
ద్వేదారాధితపాదపంకజయుగుణ్ ♦ వేదాంతమూర్తిణ్ మహా
వేదభ్రాజితవేద్యు బ్రహ్మజనకుణ్ ♦ వేదాంతభావోల్లస
ద్వేదాగ్రేసరతల్పు రాము మహిమా♦ధారుణ్ బ్రశంసించెదన్.

తా. తెలియఁగలిగినట్టి వేదము నుపదేశించునట్టి బ్రహ్మను గన్నట్టి వేదాంతరూపుఁడైనట్టి ప్రకాశించుచున్న వేదములు గలిగినట్టి వేదసముదాయముయొక్క ప్రధానమహిమ కాధారమైనదుంపయొక్క మొలకయైనట్టి వేదశిఖరములతో సమానమైన శేషునియందు శయనించినట్టి వేదాంతములచేఁ దెలియఁదగినరూపము గలిగినట్టి వేదముల కారాధింపఁదగిన పాదపద్మములుగల తారకుఁడైన రాముని సేవించుచున్నాను.

శ్లో. మూలాధారధనంజయస్ఫుటపటుజ్వాలాసమాలింగితం
మూర్ధన్యాంతరశాంకమండలగతం క్షీరాభిషేకప్రియమ్
ముక్తాశోభితమౌళిభి ర్మునివరై రారాధితం భావయే
ప్రఖ్యాతై స్త్రిగణై ర్జనాధిపగణై శ్శాఖామృగై ర్దైవతైః. 34

మ. ప్రకటాధారమునన్ ధనంజయశిఖాభాసప్రభాయుక్తు మ
స్తకపూర్ణద్విజరాజమండలసుధాధారాభిషేకప్రియున్
సుకళాశోభితమౌనివానరమహాక్షోణీశ్వరప్రాప్యతున్
సకలాత్మున్ త్రిగణార్చితున్ గొలుతు భూజాతావిభున్ రాఘవున్.

తా. మూలాధారచక్రమందలి యగ్నియొక్క స్ఫుటమైన గొప్పజ్వాలలచేఁ జుట్టుకోఁబడినట్టి సహస్రారచక్రమధ్యమందలి చంద్రమండలమును బొందినట్టి పాలయభిషేకమం దిష్టము గలిగినట్టి ముత్యములచేతఁ బ్రకాశించుచున్నట్టి శిఖలుగలమునులచేత నారాధింపఁబడునట్టి ప్రసిద్ధములైనరాజులు, వానరులు, దేవతలు అన్నట్టి మూడు గణములచేతఁ బూజింపఁబడుచున్న రాముని సేవించుచున్నాను.

శ్లో. తారాకారవిమానమధ్యనిలయం తత్త్వత్రయారాధితం
తత్రాధీశ్వరయోగనిర్గుణమహాసిద్ధైస్సమారాధితమ్
తత్సంగం తరుణేందుశేఖరసఖం తారాత్రయాంతర్గతం
తప్తస్వర్ణకిరీటకుండలయుగం రామం భజే తారకమ్. 35

శా. తారాకారవిమానమధ్యనిలయున్ దత్త్వత్రయారాధితున్
సారాచారవిశిష్టసిద్ధమునిసంస్తవ్యాంఘ్రితత్సంజ్ఞికున్
దారాద్రీశ్వరసంతతాప్తుఁ బరమున్ దారాత్రయాంతర్గతున్
శ్రీరాము న్మకుటాంగదాభరణు సంసేవింతు నిష్ఠాప్తికిన్.

తా. నక్షత్రములవంటివిమానమధ్యముననున్నట్టియు, జీవుఁడు, ప్రకృతి, యీశ్వరుఁడు అన్న మూఁడుతత్త్వములచేత నారాధింపఁబడుచున్నట్టి అందుఁ బ్రధానమైన యోగముచేత నిర్గుణులైన గొప్పసిద్ధులచేతఁ బూజింపఁబడుచున్నట్టి తత్పదముయొక్క సంగమును గలిగినట్టి యీశ్వరునికిన్నీ హితుఁడైనట్టి నేత్రత్రయమధ్యభాగమైన భ్రూ

సూర్యుఁడున్నట్టి ఘటము వేసిన బంగారముయొక్క కిరీటకుండలప్రకాశము గల తా
రకరాముని సేవించుచున్నాను.

శ్లో॥ తారం తారకమండలోపరిలసజ్జ్యోతిస్స్ఫురత్తారకా
తీతం తత్త్వమసీతి వాక్యమహిమాధారం తటిత్సన్నిభమ్
తద్బ్రహ్మాఖ్యపవిత్రితత్రిభువనం తారాననాంతర్గతం
తారాంతర్ధ్రువమండలాబ్జరుచిరం రామం భజే తారకమ్. 36

శా. తారున్ దారకమండలోపరిప్రసిద్ధజ్యోతివిద్యున్నిభున్
తారాంతర్ధ్రువమండలాబ్జరుచిరున్ దారాననాంతర్గతున్
దారాతీతు విశుద్ధపవిత్రతుని సీతానాథు సత్కీర్తివి
స్తారు న్తత్త్వమసీతివాక్యమహిమాధారు న్భజింతు న్మదిన్.

తా. తరింపఁజేయునట్టి నేత్రమండలమునకుఁ బైన ప్రకాశించుచున్న సహస్రా
రము నతిక్రమించినట్టి "నీవు పరబ్రహ్మవైతివి" అనువాక్యమహిమ కాధారమైనట్టి
మెఱుపులతో సమానుఁడైనట్టి బ్రహ్మజ్ఞానముచేఁ బవిత్రమై చేయఁబడిన మూఁడులోక
ములు గలిగినట్టి ముఖ్యాలపీఠము మధ్యము బొందినట్టి నక్షత్రములపైనుండు ధ్రువమం
డలమునందుఁ బద్మముచే శోభించు తారకరాముని సేవించుచున్నాను.

శ్లో॥ కస్తూరీఘనసారకుంకుమలసచ్ఛ్రీచందనాలంకృతం
కందర్పానికసుందరం ఘననిభం కాకుత్స్థవంశధ్వజమ్
కల్యాణాంబరవేష్టితం కమలయా యుక్తం కళావల్లభం
కల్యాణాచలకార్ముకప్రియసఖం కల్యాణరామం భజే. 37

మ. శితికంఠాప్తు మృగీమదాసమిళిత శ్రీచందనాలంకృతున్
క్షితిపుత్రీసహితు న్ఘనాఘనవిభు న్శ్రీరాముఁ బీతాంబరున్
దతసౌందర్యజితస్మరు న్ప్రబలసత్కాకుత్స్థవంశధ్వజున్
హితవిద్యాధిపు రామభద్రు మది నేనెంతు న్కృపాకాంక్షినై.

తా. కస్తూరి, కర్పూరము, కుంకుమము, మంచిగంధము అనువానిచే నలంక
రింపఁబడినట్టి మన్మథునికంటె మిక్కిలి సుందరుఁడైనట్టి మేఘముతో సమానుఁడైనట్టి
కకుత్స్థవంశమునకుఁ బ్రధానుఁడైనట్టి బంగారుబట్టఁ గట్టుకొనినట్టి లక్ష్మితోఁ గూడినట్టి
శాస్త్రములయం దిష్టుఁడైనట్టి ఈశ్వరుని కిష్టస్నేహితుఁడైనట్టి మంగళరూపుఁడైన
రాముని సేవించుచున్నాను.

శ్లో॥ మజ్జీవం మదనుగ్రహం మదధిపం మద్భావనం మత్సుఖం
మత్త్రాతం మమసద్గురుం మమవరం మోహాంధవిచ్ఛేదనమ్

మత్పుణ్యం సదనేకబాంధవజనం మజ్జీవనం మన్నిధిం
మత్సిద్ధిం మమసర్వకర్మసుకృతం రామం భజే తారకమ్. 38

ఉ. నాకు గురుం డనుగ్రహుఁడు ♦ మజ్జనకుండు విభుండు జీవముం
నాకు పితామహావగ్రజుఁడు ♦ సుత్సుకృతంబు సుఖంబు భావముం
నాకు సమస్తబాంధవజ♦నంబు ధనంబు సుకర్మసిద్ధియుం
నాకు సమస్తతారకము ♦ మారిపురాముఁ డటంచు నెంచెదన్.

తా. నాప్రాణము, నాకుం దనుగ్రహముగలవాఁడు, నాయేలిక, నాధ్యానరూపుఁడు, నాసౌఖ్యము, నాతండ్రి, నాగురువు, నాపరమాత్మ, నాయజ్ఞానాంధకారముఁ బోఁగొట్టువాఁడు, నాపుణ్యరూపుఁడు, నాకు బహుబంధురూపుఁడు, నాప్రాణాధారమైనవాఁడు, నానిధి, నాతపస్సిద్ధి, నాసమస్తకర్మలపుణ్యమునైన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. నిత్యం నీరజలోచనం నిరుపమం నీవారశూకోపమం
నిర్భేదానుభవం నిరంతరగుణం నీలాంగరాగోజ్జ్వలమ్
నిష్పాపం నిగమాగమార్చితపదం నిత్యాత్మకం నిర్మలం
నిష్పుణ్యం నిఖిలం నిరంజనపదం రామం భజే తారకమ్. 39

శా. నిత్యు న్నిర్దురితున్ సరోజనయనున్ ♦ నీలాంగరాగోజ్జ్వలున్
నిత్యాత్మున్ విమలు న్నిరంతరగుణు ♦ న్నిర్భేదు నిష్పుణ్యునిన్
సత్యున్ సూక్ష్ము నిరంజను న్నిరుపమున్ ♦ సర్వాత్ము యోగీంద్రసం
స్తుత్యు న్నిర్గుణు రాముఁ దారకు భజింతున్ సత్కృపాకాంక్షినై.

తా. నిత్యుఁడు, పద్మములవంటికన్నులు గలవాఁడు, ఉపమానము లేనివాఁడు, నివారిగింజముల్లువలె సూక్ష్మరూపుఁడు, అభేదానుభవస్వరూపుఁడు, ఎడతెగనిగుణములు గలవాఁడు, నల్లనిశరీరశోభచే బ్రకాశించువాఁడు, పాపశూన్యుఁడు, వేదశాస్త్రములచేఁ బూజింపఁబడుపాదములు గలవాఁడు, నిత్యుఁడు, నిర్మలుఁడు, పుణ్యశూన్యుఁడు (పుణ్యపాపశూన్యుఁడని యర్థము), సర్వస్వరూపుఁడు, అజ్ఞానశూన్యుఁడునైన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. ధ్యాయే త్వాం హృదయాంబుజే రఘుపతిం విజ్ఞానదీపాంకురం
హంసోహంసపరంపరాదిమహిమాధారం జగన్మోహనమ్
హస్తాంభోజగదాబ్జచక్రమతులం పీతాంబరం కౌస్తుభం
శ్రీవత్సం పురుషోత్తమం మణినిభం రామం భజే తారకమ్. 40

మ. హృదయాబ్జంబునఁ గొల్చెద న్రఘుపతిన్ హేమాంబరు న్నిస్సమా
ను నిరామాళిన్ ధృతకౌస్తుభున్ హరిజగన్మోహున్ గదాద్యాయుధున్
త్రిదశేంద్రాంశనిభున్ మహామహిమునిన్ శ్రీవత్సవక్షస్థలున్
విదితాత్మున్ బరమహంసరూపుఁ బురుషున్ విజ్ఞానదీపాంకురున్.

తా. జ్ఞానదీపుండును నైన రఘువంశశ్రేష్ఠుండు నైన నిన్ను హృదయపద్మమందు ధ్యానించుచున్నాను. పరమహంసరూపుండును, ఉత్కృష్టమహిమ కాధారమైనట్టి జగత్తులను మోహింపఁజేయునట్టి చేతియందు శంఖచక్రగదలు గలిగినట్టి పీతాంబరము గలిగినట్టి కౌస్తుభమణి శ్రీవత్సము గలిగిన పురుషశ్రేష్ఠుండైన నీలమణితోఁ దుల్యుఁడైన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. సత్యజ్ఞాన మనంత మచ్యుత మజం అవ్యాకృతం తత్పరం
కూటస్థాదిసమస్తసాక్షి మనఘం సాకాద్విరాట్తత్త్వదమ్
వేద్యం విశ్వమయం ప్రలీనభువనం స్వారాజ్యసౌఖ్యప్రదం
పూర్ణం పూర్ణతరం పురాణపురుషం రామం భజే తారకమ్, 41

మ. అనఘున్ బూర్ణు ననంతు నచ్యుతుని సత్యజ్ఞానమూర్తిన్ విరా
ట్తను విశ్వాత్ము జగన్మయున్ బరదుఁ గూటస్థాయిసాక్షిన్ సనా
తను నవ్యాకృతుఁ జీవతత్త్వపరు సత్రామాదిభోగప్రదున్
గుణునిన్ వేద్యుఁ బురాణపూరుషు నజున్ గాకుత్స్థు సేవించెదన్.

తా. సత్యజ్ఞానరూపుండును నాశనములేనట్టి సర్వత్ర ఎడఁబాయునట్టి పుట్టుకలేని వికారములులేని ప్రధానుండైనట్టి కూటస్థరూపుండు మొదలగుసమస్తమునకు సాక్షియైనట్టి దోషములేనట్టి కేవలవిరాట్స్వరూపుండైనట్టి తెలియఁదగినట్టి ప్రపంచరూపుండు దనయందణఁగిన లోకములు గలవాఁడు మోక్షసౌఖ్యమునిచ్చునట్టి సర్వత్ర నిండియున్నట్టి పూర్ణుండైనట్టి తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. రామం రాక్షసవంశనాశనకరం రాకేందుబింబాననం
రక్షోరిం రఘువంశవర్ధనకరం రక్తాధరం రాఘవమ్
రాధాయాత్మనివాసితం రవినిభం రమ్యం రమానాయకం
రంధ్రాంతర్గతశేషశాయిన మహం రామం భజే తారకమ్. 42

మ. అసురద్వేషికులాటవీదహను రంధ్రాంతర్గతాహీంద్రత
ల్పు మహాత్ము న్నరిపూర్ణచంద్రముఖు రామున్ శ్రీరమానాయకున్
గమలాప్తోజ్జ్వలుఁ బల్లవాధరు జగత్కల్యాణు శ్రీరాఘవున్
రమణీయున్ రఘువంశదీప్తుఁ గొలుతున్ రాధాత్మసంస్థాయినిన్.

తా. రాక్షసవంశమును నశింపఁజేయునట్టి పూర్ణచంద్రునివంటి మొగము గలిగినట్టి రాక్షసశత్రువైనట్టి రఘువంశమును వృద్ధిఁజేయునట్టి రొట్టనియాధరోష్ఠము గలిగినట్టి రఘువంశమందుఁ బుట్టినట్టి రాధాదేవియొక్క శుభానన్దైవముగల హృదయమందు నివసించినట్టి సూర్యునితోఁ దుల్యుఁడైనట్టి సుందరుఁడైనట్టి లక్ష్మీనాథుఁడైనట్టి హృదయ రంధ్రమందున్నట్టి కుండలియందున్నట్టి తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. తారాకారం నిఖిలనిలయం తత్త్వమస్యాదిలక్ష్యం
శబ్దావాచ్యం త్రిగుణరహితం వ్యోమ మంగుష్ఠమాత్రమ్
నిర్వాణాఖ్యం సగుణ నిగుణం వ్యోమరంధ్రాంతరస్థం
సౌషుమ్నాంతః ప్రణవసహితం రామచంద్రం భజేహమ్. 43

మ. ప్రకటవ్యోమబలాంతరస్థు సగుణు న్బ్రహ్మాధిపుఁ లోకనా
యకుఁ దారాకృతిను త్రిసంజ్ఞికు సుషుమ్నాంతస్థిఁ నోంకారవ
ర్ణకరాహిత్యు నశబ్దు నిత్యు బుధు లెన్న న్దత్త్వమస్యాదిల
క్ష్యుఁ గళాస్థాను భజింతు నిర్గుణుని నంగుష్ఠప్రమాణు న్హరిన్.

తా. తరింపఁజేయుస్వరూపము గలిగినట్టి సమస్తమునకు స్థానమైనట్టి తత్త్వమస్యాదివాక్యములకు గురియైనట్టి శబ్దములచేఁ జెప్పఁబడినట్టి సత్త్వరజస్తమోగుణశూన్యుఁడైనట్టి ఆకాశరూపుఁడైనట్టి బొటనవ్రేలియంత ప్రమాణము గలిగినట్టి మోక్షశోభగలిగినట్టి సగుణనిర్గుణరూపుఁడైనట్టి. ఆకాశరంధ్రమధ్యమందు గమనాఁగాను సుషుమ్నానాడియందు నాదాలీనుఁడైయున్నట్టి శ్రీరాముని సేవించుచున్నాను.

శ్లో. ముక్తేర్మూలం మునివరహృదానందకందం ముకుందం
కూటస్థాఖ్యం సకలవరదం సర్వచైతన్యరూపమ్
నాదాతీతం కమలనిలయం నాదనాదాంతతత్త్వం
నాదాతీతం ప్రకృతిరహితం రామచంద్రం భజేహమ్ 44

మ. మునిహృత్తోషకరు న్బ్రిధానరహితు న్మోక్షైకనాథు న్సనా
తను గూటస్థుని సర్వవిశ్వమయుఁ జైతన్యాకృతి న్కృష్ణనం
దను సర్వాత్ము ముకుందు లోకవరదు న్నాదాంతతత్త్వాత్ము న
త్యనఘున్ రాముధరాసుతాధిపతి నాదాతీతు భావించెదన్.

తా. మోక్షకారణమైనట్టి మునులమనస్సునకు ఆనందమునకు హేతువైనట్టి ముకుంద నామము గలిగినట్టి కూటస్థచైతన్యరూపుఁడైనట్టి అందరికి వరములనిచ్చునట్టి సర్వప్రాణిరూపుఁడైనట్టి శబ్దబ్రహ్మము నతిక్రమించినట్టి సహస్రారపద్మమందు స్థానము

గలిగినట్టి ఓంకారధ్వనియొక్క వాస్తవరూపుఁడైనట్టి (నాదాతీతం అని అపరముచే మరలఁ జెప్పఁబడినది) ప్రకృతిశూన్యుఁడైన రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. నిజానందాకారం నిగమతురగారాధితపదం
పరబ్రహ్మానందం పరమపదగం పాపహరణమ్
కృపాపారావారం పరమపురుషం పద్మనిలయం
భజే రామం శ్యామం ప్రకృతిరహితం నిర్గుణమహమ్. 45

మ. పరమామ్నాయతురంగిసేవితలసత్పాదాంబుజద్వంద్వుఁ బం
కరుహాక్షోత్తముఁ గృపాబ్ధి నిర్గుణు నఘౌఘధ్వంసు రమ్యుం బరా
త్పరునంబుజ మునిసోత్తముం బరుఁ బరబ్రహ్మంబు నిజానందు శ్రీ
హరి శ్రీరాముఁ బ్రధానసత్కృతు ఘనశ్యామాంగు భావించెదన్.

తా. తనయానందమే తానైనట్టి శివునిచేఁ బూజింపఁబడు పాదములు గలిగినట్టి పరబ్రహ్మస్వరూపమున రమింపఁదగినట్టి మోక్షస్థానమును బొందినట్టి పాపములను హరించునట్టి దయకుసముద్రుఁడైనట్టి ప్రధానపురుషుఁడైనట్టి సహస్రారమందు నివసించినట్టి నల్లనైనట్టి ప్రకృతిశూన్యుఁడు నిర్గుణుఁడు నైన రాముని నేను సేవించుచున్నాను.

శ్లో. శ్రీమద్వైకుంఠనాథం సురమునిముకుటద్యోతితస్వర్ణపీఠం
నీలాంగం చంద్రవక్త్రం మణిమయమకుటం బాణకోదండహస్తమ్
పద్మాక్షం పాపనాశం ప్రణవమయమహారత్నసింహాసనస్థం
శ్రీసీతావామభాగం శ్రితజనవరదం రామచంద్రం భజేహమ్. 46

మ. శ్రీవైకుంఠవిభుం మణీమకుటుఁ గోదండాస్త్రహస్తున్ సమా
గతగీర్వాణకిరీటరత్నరుచిరాక్రాంతాంఘ్రియుగ్మున్ శత
క్రతు నీలాంగు శశాంకవక్త్రు లసదోంకారాసనున్ జానకీ
యుతు గంజేక్షణు రాముఁ బాపహరు నాద్యుం దారకుం గొల్చెదన్.

తా. శోభాయుక్తమగు వైకుంఠమున కధిపతియైనట్టి దేవతలయొక్క మునులయొక్క కిరీటములచేఁ బ్రకాశింపఁజేయఁబడిన బంగారుపాదపీఠముగలిగినట్టి నల్లనిశరీరముగలిగినట్టి చంద్రునివంటి మొగము గలిగినట్టి మాణిక్యకిరీటముగలిగినట్టి ధనుర్బాణములు హస్తమందు గలిగినట్టి పద్మములవంటి నేత్రములు గలిగినట్టి పాపములను నశింపఁజేయునట్టి ఓంకారరూపరత్నపీఠమందున్నట్టి సీత యెడమప్రక్కఁ గలిగినట్టి ఆశ్రయించువారికి వరములనిచ్చు రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. సాకేతే మణిమంటపే సురతరుప్రాంతే విమానాంతరే
పద్మే చాష్టదళోజ్జ్వలే నుతమహాసౌధే సుధామాన్వితే

సత్యం సూర్యజరావణానుజమరుత్పుత్రానుజైః సేవితం
మధ్యే వాసవనీలకోమలనిభం రామం భజే తారకమ్. 47

మ. ప్రకటాయోధ్యను కల్పవృక్షములమూలముల హర్మ్యస్థంబందు సింహాసనపు
ష్పకమధ్యాష్టదళాబ్జమధ్యమున భాస్వద్గేహమందుండు సుర
ప్రకరంబుల్ రవిపుత్రముఖ్యు లనుజుల్ భావింప బన్నిద్రసం
దకలంకుం డగు నీలరత్నవిభు రామాధీశుఁ బ్రార్థించెదన్.

తా. అయోధ్యయందు రత్నమంటపమందుఁ గల్పవృక్షసమీపమున విమానమ-
ధ్యమందు అష్టదళపద్మమునందు మంచికాంతిగల ఎన్నికెక్కిన గొప్పమేడయందు స
త్యస్వరూపుఁడై సుగ్రీవవిభీషణాంజనేయులచే సేవింపఁబడుచున్నట్టి వారిమధ్యమందు
నింద్రనీలమాణిక్యములతోఁ దుల్యుఁడైన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. హృదయకుహరమధ్యేద్యోతితన్మంత్రసారం
నిగమనియమగమ్యం వేదశాస్త్రై రచింత్యమ్
హరిహరవిధివంద్యం హంసమంత్రాంతరస్థం
దశరథసుతమీడే దైవతం దేవతానామ్. 48

మ. హరిభర్గాబ్జభవాదివంద్యు హృదయాంభోజాభ్యంతరద్యోతిసు
స్థిరమంత్రప్రకటార్థసారతరు రాజీవాక్షు శాస్త్రాగమ
స్ఫురదాకారు నచింత్యు వేదమయు సంపూర్ణు న్వచోగమ్యు వే
మరు రామప్రభు దేవదేవుఁ గొలుతు న్మంత్రాంతరాంతర్గతున్.

తా. హృదయాకాశమధ్యమందుఁ బ్రకాశించు "తత్" అనుమంత్రమునకు
సారమైనట్టి వేదనియమములచేఁ బొందఁదగినట్టి వేదశాస్త్రములచేఁ జింతింప శక్యము
గానట్టి బ్రహ్మవిష్ణుశివులకు నమస్కరించఁదగినట్టి హంసమంత్రమధ్యమందున్నట్టి
దేవతలకు దేవుఁడైన దశరథపుత్రుఁడైన రాముని స్తుతించుచున్నాను.

శ్లో. దేవేంద్రనీలనవమేఘఘననిర్జితాంగం
పూర్ణేందుబింబవదనం శరచాపహస్తమ్
సీతాసమేత మనిశం శరణం శరణ్యం
చేతో మదీయ మభివాంఛతి రామచంద్రమ్. 49

మ. హరినీలోత్పలమేఘసంపదపహాసాంగుఁడు ధరాపుత్రికా
వరుఁ గోదండశరోజ్జ్వలోత్కరకరుఁ డు భద్రాసనాసీను దా
శరథి న్పూర్ణశశాంకబింబవదను న్సర్వాత్ము శ్రీరాము శ్రీ
కరభక్తాంగణకల్పకంబు మన మాకాంక్షించి సేవింపుమా.

శ్లో. కోదండదీక్షాగురు మాదిమూలం
గుణాశ్రయం చందనకుంకుమాంకమ్
సలక్ష్మణం సర్వజనాంతరస్థం
పరాత్పరం రామమహం నమామి. 52

మ. ధరణీజాకుచచర్చ చందనలస ♦ త్కాశ్మీరజన్మాంకిత
స్ఫురదత్యున్నతవక్షు నవ్విగు జగ ♦ న్మూలాంకురాంబు స్ఫురా
త్ప్రభు సౌమిత్రియుతుఁ గుణాశ్రయు ననేక ♦ భక్తాంతరంగంబునఁ
గురుకారుణ్యపయోనిధిన్ గొలుతుఁ ♦ గోదండదీక్షాగురున్.

తా. ధనుర్విద్యాగురు వైనట్టి కారణమూలమునుఁ గారణమైనట్టి సద్గుణములకాధార మైనట్టి గంధము కుంకుమను చిహ్నములుగాఁ గలిగినట్టి లక్ష్మణునితోఁ గూడినట్టి ఎల్లవారి యంతరంగమం దున్నట్టి పరునికంటెఁ బరుఁడైన రాముని నేను నమస్కరించుచున్నాను.

శ్లో. మూలాధారసరోరుహే హుతవహస్థానే త్రికోణాంతరే
కందే కుండలికాసుషుప్తిపటలీవాసాంతవర్ణాశ్రయే
బాలార్కప్రతిమం పరాభయకరం పాశాంకుశాలంకృతం
భూతస్వాశ్రయ మాదిపూరుష మజం రామం భజే తారకమ్. 53

మ. అరయన్ గందసుషుప్తికాలమహితవా ♦ సాంతపురవాస్య ప్రభా
సుర మాకంద త్రికోణమధ్యమమునన్ ♦ శుభ్రస్థలిన్ బాలభా
స్కరసందీపితు భూతసంశ్రయు విరా ♦ జత్పాశముఖ్యాస్త్రుని
స్థిరు విద్వేషిహరున్ బరాత్పరు నజున్ ♦ శ్రీరాము సేవించెదన్.

తా. అంతమున్న దుంపయైన మూలాధారచక్రమందు అగ్నిస్థానమందుఁ ద్రికోణయంత్రమందు కుండలిరూపముగా సుషుప్తిచేత నొప్పుచున్న వకారము మొదలు సకారపర్యంతాక్షరములకాశ్రయమైనట్టి లేఁతసూర్యునితో సమానుఁడైనట్టికరములు అభయముగల హస్తములుగలిగినట్టి పాశాంకుశములచేత నలంకరింపఁబడినట్టి భూతములకు ముఖ్యాశ్రయమైనట్టి మొదటిపురుషుఁడైనట్టి పుట్టుకలేని తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. స్వాధిష్ఠానసరోరుహే ప్రవిలసద్బాలాంతవర్ణాశ్రయం
బ్రహ్మగ్రంథిమహోన్నతే కరతలే శ్రీకుండికామాలికామ్
పీఠే రత్ననిభం పరాభయకరం వాణీయుతం బిభ్రతం
సాక్షాద్బోధ సునన్యమంగళకరం రామం భజే తారకమ్. 54

మ. స్థిరమైనట్టిబలాంతవర్ణదళస్వా ♦ ధిష్ఠానకగ్రంథికా
కరుసత్కుండికమాలికు న్సుజనతా ♦ కల్యాణముద్రోజ్జ్వలున్

పరిశా ప్రమా సృతివైరిసాధ్వసకరుఁ • వాణీయుతుఁ దారకుఁ
బను శ్రీరాము సుధాభిరాము మది సం•భావించి సేవించెదన్.

తా. స్వాధిష్ఠానచక్రమందుఁ బ్రకాశించుచున్న బకారము మొదలు లకారము వఱకుఁ గల యక్షరములకు క్షేత్రమైనట్టి బ్రహ్మగ్రంథిచే నున్నతమైన హస్తమునందుఁ గిమ్మందియున్నను నాటికను దాల్చినట్టియు పీఠమునందున్నట్టియు రత్నములతో సమానుఁడైనట్టి గొప్పభిషేకమును జేయునట్టియు సాధువాక్యములతోఁ గూడినట్టి కేవలబోధస్వరూపుఁడైనట్టి అసాధారణవధమును జేయు తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. డాఫాంతాక్షరపంకజే దళదళే మాణిక్యసంపూరితే
విష్ణుగ్రంథియుతే పరాభయకరం ఆశంఖచక్రాన్వితమ్
మార్తాండద్యుతిమంజులాభమతులం పీతాంబరం కౌస్తుభం
సర్వం సర్వగమిందిరాసహచరం రామం భజే తారకమ్. 55

మ. ఘనమైనట్టిడఫాంతవర్ణదళయు•క్తం బై హరిగ్రంథిశో
భన జెల్వౌ మణిపూరచక్రమున నం•బాళోజ్జ్వలుఁ రాముఁ గాం
చనచేలుఁ రిపుజైత్రుఁ దారకుఁ బను • న్నర్వాత్ముఁ జక్రాబ్జహ
స్తుని లక్ష్మీయుతుఁ బద్మనాభు భజియిం•తుఁ గౌస్తుభోద్భాసితున్.

తా. పదిరేకులు గలిగినట్టి మునులచే నిందింపఁబడినట్టి విష్ణుగ్రంథిస్వరూపమైన డకారాదిఫకారపర్యంతాక్షరరూపమైన చక్రమందున్నట్టి మిక్కిలి యభయమును జేయునట్టి శంఖచక్రములతోఁ గూడినట్టి సూర్యమండలముయొక్క కాంతివలె మనోహరమైన కాంతిగలిగినట్టి సామ్యములేనట్టియు పచ్చనివస్త్రము గలిగినట్టియు కౌస్తుభమణి గలిగినట్టి సర్వస్వరూపుఁడైనట్టి సమస్తమును బొందినట్టి లక్ష్మీసహాయుఁడైన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. హృత్పద్మే విలసార్కకోటిసదృశం కాంతాంతవర్ణోజ్జ్వలే
ప్రాణాంతప్రణవాంతరే ప్రవిలసద్గోర్వాణపీఠాంతరే
సూర్యం హంసమయం సదాశివపదం కోదండదీక్షాగురుం
వాసం మోక్షదమానసేతమనిశం రామం భజే తారకమ్. 56

మ. సరగన్ భవకాదికాంతవర్ణసహితుం • బ్రాణానిలోంకారను
స్థితు ఛాయాధిపహంసహంపునిలయా•దిత్యాయుతోద్భాసివి
స్ఫురితోద్భాణవసత్సదాశివసుధా•ప్రున్ మోక్షలక్ష్మీయుతుఁ
గురుభక్తిన్ భజియింతుఁ దారకు మహా•కోదండదీక్షాగురున్.

తా. కకారాదిక్షకారాంతవర్ణరూపమైన ప్రాణాపానవాయువులచేత నొప్పుచున్న ఓంకారమధ్యమందు గలయట్టి ప్రకాశించుచున్న భుజగకుండలి బ్రహ్మపీఠముగల హృదయపద్మమందున్నట్టి ప్రళయసూర్యులతోఁ దుల్యమైన రూపముగలయట్టి సూర్యరూపుడు హంసరూపుడునైనట్టి యోగస్థానమైనట్టి ధనుర్విద్యాగురుఁడైనట్టి మోక్షలక్ష్మితోఁ గూడినట్టి తారకరాము నెల్లప్పుడు సేవించుచున్నాను.

శ్లో. సాక్షాత్ షోడశదివ్యపత్రకమలే జీవాత్మసంస్థాపితే
రుద్రగ్రంథియుతే మనోన్మనిపథే జాలంధ్రపీఠాంతరే
శుభ్రజ్యోతిమయం శరీరసహితం సుస్థం సుధాశీతలం
శబ్దబ్రహ్మనివాసభూతవదనం రామం భజే తారకమ్. 57

మ. తనరఁ షోడశపద్మపత్రమున రుద్రగ్రంథితంబై మనో
న్మనిమార్గంబున జీవసంస్థలిని మాన్యంబైన జాలంధ్రపీ
ఠిని శబ్దాహ్వయబ్రహ్మకూటమున మేఘజ్యోతిరూపంబునన్
సునతం జెన్నగు రాముఁ దారకు సముగ్రానుగ్రహుం గొల్చెదన్.

తా. జీవాత్మస్థానమైనట్టి రుద్రగ్రంథి స్వరూపమైనట్టి మనోన్మనీమార్గమైనట్టి జాలంధరపీఠము మధ్యమందుఁ గలిగినట్టి షోడశదళపద్మమందున్నట్టి పరిశుభ్రజ్యోతి స్వరూపమైనట్టియు దేహముతోఁ గూడినట్టియు నమృతమువలెఁ జల్లనైనట్టియు శబ్దబ్రహ్మకు(అనఁగా వేదములకు) నివాసమగు ముఖముగల తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. భ్రూమధ్యే నిగమాగమోజ్జ్వలపదే చంద్రే త్రిమార్గాంతరే
నిర్ద్వంద్వే నిఖిలార్థతత్త్వవిలసత్సూక్ష్మే సుషుమ్నాముఖే
ఆసీనం ప్రళయార్కభాసురపరం జ్యోతిస్స్వరూపాత్మకం
వర్ణాభ్యంచితమోక్షలక్ష్మిసహితం రామం భజే తారకమ్. 58

మ. శ్రుతిమార్గంబున ద్వైపహాంకరమునన్ భ్రూమధ్యమందు న్సము
న్నతభాస్వత్సకలార్థతత్త్వగసుషుమ్నాస్థానసంస్థానుఁడై
భితకల్పారుణతేజు మోక్షకమలాశ్రీయుక్తుఁ దారకున్
ద్యుతిమంతున్ స్ఫుటవర్జితున్ హరిపరంజ్యోతిన్ భజింతు న్మదిన్.

తా. వేదశాస్త్రములచేఁ బ్రకాశించుచున్న స్థానమైన చంద్రస్వరూపమై మూఁడుమార్గముల మధ్యప్రదేశమైన కనుబొమ్మలమధ్యమందు సుఖదుఃఖాదిద్వంద్వములు లేనట్టి సమస్తతత్త్వములచే నొప్పుచున్న సూక్ష్మమైన సుషుమ్నాభిముఖమైన స్థానమందుఁ గూర్చున్నట్టి ప్రళయసూర్యునివలెఁ బ్రకాశించు తేజోరూపుఁడైన కకారాది వర్ణములచేత నొప్పుచున్నట్టి మోక్షలక్ష్మితోఁ గూడినట్టి తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. శీర్షాంభోరుహకర్ణికే నిరుపమే శ్రీషోడశాంతే శశి
ప్రఖ్యాతామృతవార్ధివీచిలహరీ నిర్వాణపీఠాంతరే
శబ్దబ్రహ్మపరం చరాచరగురుం తేజఃపరం శాశ్వతం
సత్యాసత్య మగోచరం హృది సదా సీతాసమేతం భజే. 59

మ. అలశీర్షాంబుజకర్ణికస్థుఁ బరిపూర్ణార్ణాబ్జామృతాంభోధిపీ
ఠిలసన్మోక్షమహాసనాంతరమునం జెల్వొందు సీతాసము
జ్జ్వలుఁ దేజఃపరునిం జరాచరగురుం సత్యానృతుం శాశ్వతుం
బలభిన్నేత్రుల నగోచరుం దలఁతు శబ్దబ్రహ్మవాచ్యాధికున్.

తా. సామ్యము లేని పదియాఱు రేకలుగల శిరస్సునందలి పద్మముయొక్క కర్ణికయందుఁ బ్రసిద్ధమైన అమృతసముద్రతరంగములుగల ప్రవాహముతోఁ గూడిన మోక్షపీఠమునందు శబ్దబ్రహ్మప్రధానము గలిగినట్టి స్థావరజంగమములకు గురువైనట్టి శాశ్వతమైన ఉత్కృష్టతేజస్సైనట్టి ఈశ్వరప్రపంచరూపుఁడైనట్టి నేత్రములకుఁ గోచరించనట్టి సీతతోఁ గూడినరాముని సేవించుచున్నాను.

శ్లో. సాకేతే రవికోటిసన్నిభమహాహర్మ్యే సుసింహాసనే
నానారత్నవినిర్మితే మునిజనాకీర్ణే సదానందనే
దేవాధీశ్వరసంయుతే నివసితం వామాంకసీతోజ్జ్వలం
దేవేంద్రోపలనీలకోమలతనుం రామం భజే తారకమ్. 60

మ. తనప్రోలం గమలాప్తకోటివిలసత్సౌధాంతరానందదా
యనవీనోజ్జ్వలరత్నపీఠమున నామాయేశ్వరాభ్యంతరం
బున జెల్వొందినశక్రనీలనిభు రాముం జానకీయుక్తుఁ గాం
చనమంజీరకిరీటకుండలవిరాజద్భూషణుం గొల్చెదన్.

తా. అయోధ్యయందుఁ గోటిసూర్యులతోఁ దుల్యమైన మేడయందు శ్రేష్ఠసింహాసనమందు అనేకరత్నములచే నిర్మింపఁబడినట్టి మునీశ్వరులచే వ్యాప్తమైనట్టి యెల్లప్పుడు నానందమును గలిగించునట్టి దేవతాశ్రేష్ఠులతోఁ గూడిన పద్మమందు నివసించి యున్నట్టియు నెడమతొడయందు సీతచేఁ బ్రకాశించుచున్నట్టియు నింద్రనీలమణులతో సమానుఁడైనట్టి తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. సాకేతే నగరే సమస్తసుఖదే హర్మ్యే ఽబ్జకోటిద్యుతే
నక్షత్రగ్రహపఙ్క్తిలగ్నశిఖరే చాంతర్యపంకేరుహే

వాల్మీకాత్రిపరాశరాదిమునిభి స్సంసేవ్యమానం స్థితం
సీతాలంకృతవామభాగ మనిశం రామం భజే తారకమ్. 61

మ. తనయూరన్ శరదిందుకోటినిభమై తారాగ్రహాక్రాంతశృం
గనితాంతోన్నత మైనసౌధమున సౌఖ్యం బౌ తదంతస్థన
ద్వనజంబందుఁ బరాశరాత్రిభృగుదూర్వాసాదులుం గొల్వ భూ
తనయాసంయుతుఁ డైనరామవిభునిన్ దాసుండ నై గొల్చెదన్.

తా. అయోధ్యయందు సర్వసౌఖ్యముల నిచ్చునట్టి కోటిచంద్రులవంటి మేడల శోభగలిగినట్టి అశ్విన్యాదినక్షత్రములయొక్క- అంగారకాదిగ్రహములయొక్కయు నరుసచేఁ దగులుకోఁబడిన శిఖరముగలిగినట్టి మధ్యమునంగల పద్మమందుండి వాల్మీకి మొదలగుమునులచేత సేవించఁబడుచున్నట్టి సీతచేత నలంకరింపఁబడిన యెడమభాగము గల తారకరాముని నెల్లపుడు సేవించుచున్నాను.

శ్లో. వందే రామ మనాదిపూరుష మజం వందే రమానాయకం
వందే హారకిరీటకుండలధరం వందే సునీలద్యుతిమ్
వందే చాపకలంబకోజ్జ్వలకరం వందే జగన్మంగళం
వందే పఙ్క్తిరథాత్మజం మమగురుం వందే సదా రాఘవమ్. 62

మ. కమలానాథు ననాదిపూరుషు జగత్కల్యాణుఁ గోదండది
వ్యమహాస్త్రోజ్జ్వలు హారకుండలకిరీటాలంకృతు న్నిర్జరేం
ద్రమణీశోభితగాత్రు మద్గురు నజున్ రాముస్ దశస్యందనో
త్తమపుత్రున్ సుచరిత్ర మద్హృదయమధ్యంబందు భావించెదన్.

తా. పురాణపురుషుఁడైనట్టి పుట్టుకలేనట్టియు లక్ష్మీనాథుఁడైనట్టి రాముని నమస్కరించుచున్నాను. (ఆదరముచే వందే అని మరలమరల జెప్పఁబడినది) హారములు కిరీటము కుండలములు ధరించినట్టి యింద్రనీలములవంటి కాంతిగలిగినట్టి ధనుర్బాణములచేఁ బ్రకాశించుహస్తములు గలిగినట్టి జగత్తులకు శుభములను జేయునట్టి దశరథునికొమారుఁ డైనట్టియు నాకు గురువైనరాముని నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

శ్లో. వందే శౌనకగౌతమాద్యభినుతం వందే ఘనశ్యామలం
వందే తారకపీఠమధ్యనిలయం వందే జగన్నాయకమ్
వందే భక్తజనౌఘదేవవిటపం వందే ధనుర్వల్లభం
వందే సత్త్వమసీతివాక్యజనకం వందే సదా రాఘవమ్. 63

మ. సరుసిం దత్త్వమసీతివాక్యజనకుఁ ♦ భక్తామరానోకహుఁ
సురుచిం దారకపీఠపద్మనిలయుఁ ♦ సుత్రామనీలోజ్జ్వలుఁ
బరసుం గౌతమశౌనకాద్యభినుతుఁ ♦ సర్వేశ్వరుఁ జానకీ
వరుఁ గోదండగురుఁ సురారిహరుభా♦వంబందు సేవించెదన్.

తా. శౌనకుఁడు గౌతముఁడు మొదలగువారిచె స్తోత్రము చేయఁబడినట్టి మేఘమువలె నల్లనైనట్టి నక్షత్రపీఠమధ్యమందు స్థానముగలిగినట్టి జగత్తుల కధిపతియైనట్టి భక్తసముదాయమునకుఁ గల్పవృక్షశాఖయైనట్టి ధనుస్సునం దిష్టుఁడైనట్టి "అబ్రహ్మము నీవైతివి" అనువాక్యమును గలిగించినట్టిరాము నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

శ్లో. వందే సూర్యశశాంకలోచనయుగం వందే జగత్పావనం
వందే పత్రసహస్రపద్మనిలయం వందేపురారిప్రియమ్
వందే రాక్షసవంశనాశనకరం వందే సుధాశీతలం
వందే దేవకపీంద్రకోటివినుతం వందే సదా రాఘవమ్. 64

మ. హరమిత్రుఁ రవిచంద్రనేత్రు జితిపు♦త్రారణ్యదావాగ్నిని
ర్జరశాఖామృగసేవితాంఘ్రియుగు శ్రీ♦రాముఁ సుధాశీతలుఁ
ధరణీనాథు సహస్రపత్రకమల♦స్థానుఁ జగత్పావనుం
బరమాత్ముఁ రఘురామచంద్రు మది సం♦భావించి సేవించెదన్.

తా. చంద్రసూర్యులు నేత్రద్వంద్వము గలిగినట్టియు జగత్తులను బవిత్రముఁ జేయునట్టి సహస్రారపద్మమందు స్థానముగలిగినట్టి యీశ్వరుని కిష్టుఁడైనట్టి రాక్షసకులమును నశింపఁజేయునట్టి యమృతమువలెఁ జల్లనైనట్టి దేవతలచేతను బహువానరులచేతను స్తోత్రము చేయఁబడుచున్న రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. వందే సాగరగర్వభంగవిశిఖం వందే జగజ్జీవనం
వందే కౌశికయాగరక్షణకరం వందే గురూణాం గురుమ్
వందే బాణశరాసనోజ్జ్వలకరం వందే జటావల్కలం
వందే లక్ష్మణభూమిజాన్వితమహం వందే సదా రాఘవమ్. 65

మ. శరచాపోజ్జ్వలహస్తు లక్ష్మణధరా♦సత్పుత్రికాయుక్తు సా
గరగర్వాపహశౌర్యధుర్యు ననఘుఁ ♦ గాధేయయజ్ఞావనుఁ
వరదుఁ దేశికదేశికుఁ ధృతజటా♦వల్కుం జగజ్జీవనుం
గరుణాంభోనిధి రామచంద్రునియతిం ♦ గాంక్షించి సేవించెదన్.

తా. సముద్రుని గర్వమును భంగము చేసిన బాణము గలిగినట్టి జగత్తులకుఁ బ్రాణ మైనట్టి విశ్వామిత్రయజ్ఞసంరక్షణముఁజేసినట్టి సుమవృతిరిఁ గలదైనట్టి ధనుర్బాణము లచేఁ బ్రకాశించుచున్నహస్తములు గలిగినట్టి జడలు నారచీరలు ధరించినట్టి సీతాలక్ష్మణులతోఁగూడిన శ్రీరాముని నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

శ్లో. వందే పాండరపుండరీకనయనం వందేబ్జబింబాననం
వందే కంబుగళం కరాబ్జయుగళం వందే లలాటోజ్జ్వలమ్
వందే పీతదుకూల మంబుదనిభం వందే జగన్మోహనం
వందే కారణమానుషోజ్జ్వలతనుం వందే సదా రాఘవమ్. 66

మ. సితకంజేక్షణు హస్తిహస్తకర రాజీవారిబింబాస్యు భా
సితప్రావృణ్ఘననర్ణుఁ గాంచనజసచ్చేలుఁ సుశీలుఁ బుధా
ర్చితునిం గారణదేహుఁ గంబుగళు భాశ్రీ భూత జగన్మోహనుఁ
ధృతమాణిక్యలలాము రామవిభు నంతుం దత్కృపాకాంక్షినై.

తా. తెల్లదామరలవంటి నేత్రములు గలిగినట్టి చంద్రబింబమువంటి మొగము గలిగినట్టి శంఖమువంటికంఠము గలిగినట్టి పద్మములవంటిహస్తములజోడు గలిగినట్టి అలంకారములచేఁ బ్రకాశించుచున్నట్టి పచ్చపట్టుబట్టలు గలిగినట్టి మేఘముతో సమానుఁడైనట్టి జగత్తులకు మోహపెట్టునట్టి ఏదోకారణముచేత మనుష్యదేహముచేతఁ బ్రకాశించువాఁడునైన రాముని నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

శ్లో. వందే నీలసరోజకోమలరుచిం వందే జగద్వందితం
వందే సూర్యకులాబ్ధికౌస్తుభమణిం వందే సురారాధితమ్
వందే పాతకపంచకప్రహరిణం వందే జగత్కారణం
వందే వింశతిపంచతత్త్వరహితం వందే సదా రాఘవమ్. 67

మ. వరనీలోత్పలకోమలాంగు త్రిజగద్వంద్యుం జగత్కారణుఁ
సరసీజాప్తకులాబ్ధికౌస్తుభమణిఁ సర్వాత్ము దేవార్చితుఁ
వరదుం బంచమహాఘనాశకుఁ గృపావార్ధిఁ బరుఁ దైత్యసం
హరు షడ్వింశతితత్త్వభాసితుని రామాధీశు సేవించెదన్.

తా. నల్లకలువలవంటి సొగసైనకాంతిగలిగినట్టి జగత్తులచేత నమస్కరింపఁబడు చున్నట్టి సూర్యవంశమను సముద్రమునకుఁ గౌస్తుభమణియైనట్టి దేవతలచేఁ బూజింపఁ బడుచున్నట్టి పంచమహాపాపములను హరించునట్టి జగత్తులకుఁ గారణమైనట్టి యిరువ

దైనతత్త్వములు లేనివాఁడను. ఇట్టిసకలాంతరస్థుఁడైనరాముని నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

శ్లో. వందే సాధకవర్గకల్పకతరుం వందే త్రిమూర్త్యాత్మకం
వందే నాదలయాంతరస్థలగతం వందే త్రివర్గాత్మకమ్
వందే రాగవిహీనచిత్తసులభం వందే సభానాయకం
వందే పూర్ణదయామృతార్ణవమహం వందే సదా రాఘవమ్. 68

మ. వరదున్ సాధకవర్గకల్పకతరున్, భవ్యున్, త్రిమూర్త్యాత్మకున్
సరసున్ నాదలయాంతరస్థలగతున్, శాంతుం, ద్రివర్గాత్మకున్
గురుసంపూర్ణదయామృతాబ్ధిమహితాంగున్, సత్సభానాథు, సు
స్థిరునిన్ రాగవిహీనచిత్తసులభున్, శ్రీరాము సేవించెదన్.

తా. యోగిసమువారియందుఁ గల్పవృక్షమైనట్టి బ్రహ్మవిష్ణురుద్రస్వరూపుఁడైనట్టి నాదలయమగునట్టిస్థలమునఁ బొందినట్టి ధర్మార్థకామములరూపుఁడైనట్టి వైరాగ్యచిత్తులకు సులభుఁడైనట్టి సభాస్థలములకు అధిపతియైనట్టి సంపూర్ణదయామృతమునకు సముద్రుఁడైనట్టిరాముని నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

శ్లో. వందే సాత్త్వికతత్త్వముద్రితతనుం వందే సుధాదాయకం
వందే చారుచతుర్భుజం మణినిభం వందే షడబ్జస్థితమ్
వందే బ్రహ్మపిపీలికాదినిలయం వందే విరాడ్విగ్రహం
వందే పన్నగతల్పశాయినమహం వందే సదా రాఘవమ్. 69

మ. వరు నీలాంగు షడంబరస్థితుఁ జతుర్బాహున్ సుధాదాయకున్
సరసున్ సాత్త్వికతత్త్వముద్రితతను న్నుత్యున్ విరాడ్విగ్రహుం
బరమబ్రహ్మాదిపిపీలికాంతనిలయున్, నాగేంద్రపర్యంకని
ర్జరబృందావనశీలు రాఘవుఁ బరబ్రహ్మంబు సేవించెదన్.

తా. సత్త్వగుణప్రధానమైనస్వభావము గలవారిచే హృదయమందు నిలుపఁబడినరూపము గలిగినట్టి అమృతము (అనఁగా మోక్షము) నిచ్చునట్టి సుందరములైన నాల్గుచేతులు గలిగినట్టి రత్నముతోఁ దుల్యుఁడైనట్టి మూలాధారము మొదలగు నారు చక్రములయందున్నట్టియు బ్రహ్మ మొదలు చీమవరకుఁగల జంతువులయందున్నట్టి అవి విరాట్స్వరూపుఁడైనట్టి శేషశయ్యయందుఁ బరున్నట్టిరాముని నే నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

శ్లో. అయోధ్యపురమంటపే స్ఫురితసింహపీఠే స్థితం
వసిష్ఠశుకగౌతమై ర్భృగుశుకాదిభి స్సేవితమ్
దినేశసుత రావణానుజసహోదరాద్యైర్వృతం
భజామి రఘునందనం ప్రణవబీజసారాత్మకమ్. 70

మ. ప్రకటాయోధ్యాపురత్నమంటపమునన్ భద్రాసనాసీనుఁడై
యకలంకుల్ శుకగౌతమభృగువసిష్ఠాదుల్ దినేశాత్మపు
త్రకముఖ్యుల్ దశకంఠసోదరుఁడు భాగవతుల్ గొల్వ నోంకారబీ
జకసారాత్మకుఁడైన శ్రీజనకజాజానిం బ్రశంసించెదన్.

తా. అయోధ్యాపురమందలి ప్రకాశించుచున్న సింహాసనమందున్నట్టి వసిష్ఠాది మునులచేత సేవింపఁబడుచున్నట్టి సుగ్రీవవిభీషణులచేఁ దమ్ములు మొదలగువారచేఁ జుట్టుకోఁబడినట్టి ఓంకారబీజముయొక్క సారరూపుఁడైన రాముని సేవించుచున్నాను.

శ్లో. విలోలమణిమండలం విమలచంద్రబింబాననం
విఖండితదశాననం వితతచాపబాణోజ్జ్వలమ్
విమోహితజగత్త్రయం వికచపద్మపత్రేక్షణం
విభీషణసురక్షకం విజయరామమీశేహరిమ్. 71

చ. అనుపమరత్నకుండలు దశాననకంఠవిలుంఠనున్ శరా
సనశరధారణున్ వికచసారసపత్రవిశాలనేత్రు స
న్మునినుతుఁ బూర్ణచంద్రముఖు మోహితసద్భువనత్రయుం జనా
ర్దనుని విభీషణావనుని రాఘవు నెంతు హృదంతరంబునన్.

తా. కదలుచున్న రత్నకుండలములు గలిగినట్టి నిర్మలమైన చంద్రబింబమువంటి మొగము గలిగినట్టి సంహరింపఁబడిన రావణుఁడు గలిగినట్టి గొప్పధనుర్బాణములచేఁ బ్రకాశించుచున్నట్టి మోహపెట్టఁబడిన మూఁడులోకములు గలిగినట్టి వికసించిన తామరరేకులవంటి నేత్రములు గలిగినట్టి విభీషణుని రక్షించినట్టి విజయముగల విష్ణురూపుఁడైన రాముని స్తుతిఁజేయుచున్నాను.

శ్లో. చలత్కనకకుండలోల్లసితదివ్యగండస్థలం
చరాచరజగన్మయం చరణపద్మగంగాశ్రయమ్
చతుర్విధఫలప్రదం చరమపీఠమధ్యస్థితం
చిదంశ మఖిలాస్పదం దశరథాత్మజం చింతయే. 72

చ. ఘనతరకుండలోల్లసిత♦గండయుగుఁ నిజపాదపద్మసం
జనితసురాపగుఁ జరమ♦సంజ్ఞకపీఠనివాసితుఁ బరా
త్ముని సచరాచరాత్మకుఁ జ♦తుర్విధసత్ఫలము న్నిడంబురా
ముని నఖిలాస్పదు న్భువన♦మోహను దాశరథిం భజించెదన్.

తా. కదలుచున్న బంగారుకుండలములచేఁ బ్రకాశించుచున్న ప్రశస్తములైన చెక్కులు గలిగినట్టి స్థావరజంగమజగద్రూపుఁడైనట్టి పాదపద్మములయందు గంగయొక్క ఆశ్రయము గలిగినట్టి ధర్మార్థకామమోక్షరూపపురుషార్థములనిచ్చునట్టి సహస్రారమధ్యమం దున్నట్టి జ్ఞానాంశరూపుఁడైనట్టి సమస్తమునకు స్థానమైనట్టి దశరథపుత్రుఁడైన రాముని ధ్యానించుచున్నాను.

శ్లో. సనందనమునిప్రియం సకలవర్ణవేదాత్మకం
సమస్తనిగమాగమస్ఫురితతత్త్వసింహాసనమ్
సహస్రనయనాబ్జజాద్యమరబృందసంసేవితం
సమష్టిపురవల్లభం దశరథాత్మజం చింతయే. 73

చ. సనకసనందనాదిముని♦సత్తమసత్ప్రియు రాఘవుఁ సనా
తను నిగమాగమస్ఫురిత♦తత్త్వ మృగేంద్రమహాసనస్థు స
న్మునిముఖవాదినిర్జరస♦మూహసమర్చితు నాగమాత్ముఁ బా
వనచరితుఁ సమష్టిపుర♦వల్లభు దాశరథిఁ భజించెదన్.

తా. సనందనుఁడను నాదిమునికి నిష్టుఁడైనట్టి సమస్తార వేదస్వరూపుఁడైనట్టి ఎల్ల వేదశాస్త్రములయందు స్ఫురించుచున్న వాస్తవార్థమే సింహాసనముగా గలిగినట్టి దేవేంద్రుఁడు మొదలగు దేవసమూహముచేత సేవింపఁబడుచున్నట్టి వైకుంఠపురమున కధిపతియైనట్టి దశరథపుత్రుఁడైన రాముని ధ్యానించుచున్నాను.

శ్లో. అనర్ఘమణిపూరకోల్లసితదివ్యతేజఃపరం
అనాహతసరోరుహస్ఫురితహంసనాదాన్వితమ్
అనంతదళపంకజస్ఫుటమృగాంకబింబామృత
ప్లుతాంగ మఖిలాస్పదం దశరథాత్మజం చింతయే. 74

చ అనుపమమూత్నరత్నలస♦దద్భుతతేజు ననాహతాంబర
జ్జనవరహంసనాదయుతు ♦ శౌరి ననంతదళాబ్జచంద్రబిం
బనవసుధాప్లుతాంగుఁ బర♦మం బఖిలాస్పదు నాజియుగ్రసం
దను రఘురామచంద్రు నవ♦తారకనాము మదిఁ భజించెదన్.

తా. విలసితేని మణిపూరకచక్రమందు ప్రకాశించు గొప్ప తేజోమూర్తియైనట్టి యుత్కృష్టుఁడైనట్టి అనాహతచక్రమందుఁ బ్రకాశించుచున్న హంసమంత్రనాదముతోఁ గూడినట్టి సహస్రారచక్రమందు స్ఫుటమైన చంద్రబింబమందలి సుధాప్రవాహముచేఁ దడుపఁబడిన దేహము గలిగినట్టి సమస్తమునకు నాధారమై [illegible] ధ్యానించుచున్నాను.

శ్లో. జాగ్రత్స్వప్నసుషుప్తికాలనిలసత్తత్త్వాత్మచిన్మాత్రకం
నైజేన్నాత్మకి మహాద్ధివాపకహితం భూమ్యాదితత్త్వాత్మకమ్
శాంభవ్యాదిసమస్తయోగకులకం సాంఖ్యాదితత్త్వేశ్వరం
శబ్దావాచ్యమహం నమామి సతతం వృత్పత్తినాశాత్పరమ్. 75

మ. గరిమన్ శాంభవిముఖ్యయోగయుతు జాగ్రత్స్వప్నసుప్తంబులం
దురుతత్త్వాత్ము జిదాత్ము బాపహరు నాద్యున్ బంచభూతాత్మకున్
బరు నుత్పత్తివినాశవర్జితుని శబ్దావాచ్యు నాత్మున్ బరా
త్పరు సాంఖ్యాదిసమస్తతత్త్వపరునిన్ ధ్యానింతు శ్రీరామునిన్.

తా. జాగ్రదాద్యవస్థాత్రయమందు బ్రకాశించుతత్త్వము జ్ఞానమాత్రమును రూపము గలిగినట్టి చేతనాస్వరూపుఁడైనట్టి మహోన్నతాపాపములను లేనట్టి భూమి మొదలగువాని తత్త్వాత్రస్వరూపుఁడైనట్టి శాంభవీముద్ర మొదలగు సమస్తయోగములయొక్క సమూహము గలిగినట్టి సాంఖ్యతత్త్వములకంటె వేరైనట్టి శబ్దగోచరుఁడుగానట్టి జన్మనాశములు లేనిరాము నెల్లపుడు నేను నమస్కరించుచున్నాను.

శ్లో. ధ్యాయే త్వాం నవవిద్రుమస్ఫుటతనుం బర్హోల్లసన్మేచకం
నానారంజితహారకం కలితసత్పీతాంబరం కౌస్తుభమ్
వేణూకంబురథాంగపాశపరిఘాస్త్రాఢ్యైస్సుచాపాన్వితం
శ్రీరామం నవమన్మథాభిపమహం షట్కోణచక్రస్థితమ్. 76

మ. ప్రణుతింతున్ నవవిద్రుమస్ఫుటతను న్బర్హోల్లసన్మేచకున్
గదపాశేక్షుధనుశ్శరాబ్జశరవేణుప్రాసముఖ్యాస్త్రని
ర్గుణు షట్కోణసరోజవాసుఁ బరిపూర్ణున్ నాసికాహారకున్
మణిభూషున్ నవమన్మథాభిపతి రామున్ హృన్నిగుఁ బీతాంబరున్.

తా. క్రొత్తపగడమువలె శోభించు దేహము గలిగినట్టి నెమలిపురికన్నులలంకారముగాఁ గలిగినట్టి ముక్కునందుఁ బ్రకాశించుచున్న ముత్యము గలిగినట్టి ప్రకాశించుచున్న పచ్చనిబట్ట గలిగినట్టి కౌస్తుభమణి గలిగినట్టి రాముని సేవించుచున్నాను.

శ్లో. సాకేతే నగరే సమస్తమహిమాధారే జగన్మోహనే
రత్నస్తంభసహస్రమంటపమహాసింహాసనే సాంబుజే
విశ్వామిత్రవసిష్ఠగౌతమశుకవ్యాసాదిభిర్ధ్యానిభిః
ధ్యేయం లక్ష్మణలోకపాలసహితం సీతాసమేతం భజే. 77

మ. తతసాకేతపురీవరంబున మహా రత్నస్తంభసాహస్రహా
సితసౌధంబున భద్రపీఠమున రాజీవాసనాసీను సు
వ్రతగాధేయవసిష్ఠగౌతమశుకవ్యాసాదిభావ్యున్ సతీ
యుతు దిక్పాలకలక్ష్మణాన్వితు సముద్యోగుఁ జగన్మోహనున్
వితతోద్యన్మహిమున్ రఘూద్వహుని సేవింతున్ గృపాకాంక్షినై.

తా. అయోధ్యాపురమందు ఎల్లమహిమలకు నాధారమై జగత్తులను మోహింపఁజేయు వేయిమణిస్తంభములుగల మంటపమందలి పద్మముతోఁగూడిన సింహాసనమందున్నట్టి విశ్వామిత్రుఁడు మొదలగు మునులచే ధ్యానింపఁదగినట్టి లక్ష్మణునితో లోకపాలకులతోఁగూడినట్టి సీతతోఁగూడినరాముని సేవించుచున్నాను.

శ్లో. ఏకాంతే కమలేజలే వికసితే చంద్రాకృతిస్థాపితే
స్థానే తారకమంటపే తనుబిలవ్యాప్తే సుధామంటపే
అబ్జార్కానలమండలోపరిమహాశ్రీపీఠదేశాంతే సదా
నాదాంతే జనకాత్మజాన్వితమహారామం భజే తారకమ్. 78

ఉ. తారకమంటపంబున సుధాగృహమందు రహస్యలీల నిం
పారఁ గృశానుభాస్కరనిశాధిపమండలిపై సిసత్కళా
పూర్ణశశాంకనిర్గళితభూరిసుధాప్లుతనాదపీఠపీ
ఠారమణీసమేతుఁ డగు దాశరథిన్ రఘువీరు నెన్నెదన్.

తా. రహస్యమందు (అనఁగా హృదయమందు) నీటియందు వికసించిన పద్మమందుఁ జంద్రరూపముననున్నట్టి నక్షత్రమంటపమందు సూక్ష్మరంధ్రమున వ్యాపించినట్టి సూర్యచంద్రాగ్నులపైఁ బదియారంచులుగల మంటపమందు నాదబ్రహ్మమధ్యమునందు సీతతోఁగూడిన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. సాకేతే మణిమంటపే సురతరుప్రాంతేష్టవర్ణోల్లస
త్పత్రే తారకకర్ణికే ప్రవిలసత్కల్పప్రసూనాంచితే
పద్మే వేదచతుష్కమండలపితే నాదాంతశయ్యాతలే
తం సేవే ధ్రువమండలేబ్జవిగళత్పీయూషధారాప్లుతమ్. 79

మ. తనపోల్కిన్ మణికుట్టిమస్థలలస ♦ త్సంతానభూజాంతికం
బున నష్టాక్షరపత్ర వేదలలితాం ♦ భోజంబునన్ దారకం
బనుతన్కర్ణికఁ గల్పపుష్పయుతు నా ♦ దాంతోరుపర్యంకు మే
ధను గొల్తున్ ధ్రువమండలోద్భవసుధా ♦ ధారాప్లుతున్ దారకున్.

తా. అయోధ్యయందుఁ గల్పవృక్షసమీపమందు ఎనిమిదియక్షరములచేఁ బ్రకాశించుచున్నట్టి పత్త్రకర్ణికగలిగినట్టి శోభించుచున్న కల్పవృక్షపుష్పములచే నొప్పుచున్న మాణిక్యమంటపమందు వేదములే నాలుగుకుండలములు గలిగి తెల్లనైన పద్మమందు నాదబ్రహ్మమధ్యమందుఁగల శయ్యయందు ధ్రువమండలమువలనఁ జంద్రుని వలనజారుచున్న యమృతధారచేఁ దడుపఁబడిన యారాముని సేవించుచున్నాను.

శ్లో. ధ్యాయే త్వాం రవిమండలేందుధవళే పద్మే నిషణ్ణం హరిం
స్వర్ణాభం కరశంఖచక్రలలితం పీతాంబరం కౌస్తుభమ్
స్వర్ణశ్మశ్రునఖాలకం లలనయాయుక్తం కిరీటాంగదం
హారాలంకృతవక్షసంపదయుగశ్రీపాదుకాలంకృతమ్. 80

మ. రవిబింబాతరచంద్రపాండురలస ♦ ద్రాజీవసంస్థాను మా
ధవు సౌవర్ణనిభాలకాంఘ్రినఖరున్ ♦ దాంతున్ మణీభూషణున్
గవివంద్యున్ దరచక్రకౌస్తుభధరున్ ♦ గౌశేయవాసోజ్జ్వలున్
భవబంధాపహు రాముఁ గొల్తు మణిశుం ♦ భత్పాదుకాలంకృతున్.

తా. సూర్యునిబింబము గలిగినట్టియుఁ జంద్రునివలెఁ దెల్లనైనట్టియు పద్మమందుఁ గూర్చున్నట్టి పాపములను హరించునట్టి బంగారుశోభ గలిగినట్టి హస్తములయందలి శంఖచక్రములచే సుందరుఁడైనట్టి పచ్చనివస్త్రము గలిగినట్టి కౌస్తుభమణి గలిగినట్టి బంగారుమీసము, గోళ్లు, ముంగురులు గలిగినట్టి సీతాదేవితోఁగూడినట్టి కిరీటము భుజకీర్తులు గలిగినట్టి హారములచే నలంకరించఁబడినవక్షస్థలము గలిగినట్టి రెండుపాదములయందుఁ బావుకోళ్లచే నలంకరింపఁబడిన నిన్ను ధ్యానించుచున్నాను.

శ్లో. వసాంతాక్షరాఢ్యే చతుఃపత్త్రపద్మే
త్రికోణాంతికం తే ధరాతత్త్వయుక్తే
వరాభీతిపాశాంకుశం విద్రుమాభం
గజాస్యే నిషణ్ణం భజే రామచంద్రమ్. 81

మ. అరయన్ భవ్యవసాంతవర్ణయుతప ♦ త్రాబ్జత్రికోణోపసు
స్థిరభూతత్త్వసమేతుఁడై రిపుభయో ♦ త్సేకప్రపాశాంకుశ

స్ఫురితుండై వరవిద్రుమప్రతిభుఁడై భూతేశపుత్రాకృతిన్
పరగన్ జెన్నగు రామచంద్రవిభు సద్భక్తిన్ బ్రశంసించెదన్.

తా. వకారము మొదలు సకారపర్యంతము నక్షరముల శోభగల నాలుగు రేకులు గల కోణయంత్రమునందు భూతత్త్వముతోఁ గూడినట్టి పద్మమందు గజాశ్వములయందుఁ గూర్చున్నట్టి శ్రేష్ఠమైన యభయము పాశము నంకుశముగలిగి పగడముయొక్క శోభగలిగినట్టి రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. బలాంతాక్షరప్రాంతషట్పత్రపద్మే
లసత్తోయతత్త్వే వరాభీతిహస్తమ్
మహాకుండికాంచాక్షమాలాంవహాంతం
చతుర్వక్త్రరూపం భజే రామచంద్రమ్. 82

మ. తరగన్ భవ్యబలాంతవర్ణయుతషట్పత్రాంబుజంబున్ బలా
వరణంబై చెలువొందు నంబు రిపుగర్వధ్వంసహస్తోరు శ్రీ
కరసత్కుండికయక్షమాలధరుఁడై కంజాసనాకారుఁడై
స్థిరతన్ నిల్చినరామచంద్రు నతిభక్తిశ్రద్ధఁ గీర్తించెదన్.

తా. బకారము మొదలు లకారమువఱకుఁ గల యక్షరములు ప్రాంతమందుఁ గల యుదకతత్త్వముగల యాఱు రేకుల పద్మమందుండి యభయహస్తము గలిగినట్టి కమండలువును జపమాలికను వహించుచున్న నాల్గుమోములు గల రాముని సేవించుచున్నాను.

శ్లో. డఫాంతాక్షరాఖ్యే మణివ్రాతపూరే
రథాంగాబ్జహస్తం మహేంద్రోపలాంగమ్
లసద్వహ్నితత్త్వే నిషణ్ణం గదాంకం
మహావిష్ణురూపం భజే రామచంద్రమ్. 83

మ. జ్వలనస్థానము నై డఫాంతవిలసద్వర్ణంబు నై యొప్పి యు
జ్జ్వలితం బౌ మణిపూరకంబున గదాచక్రాదిధారుండు నై
లలితేందీవరగాత్రుఁడై యనఘుఁడై లక్ష్మీశురూపంబునన్
జెలువై నట్టి రఘూద్వహున్ వరభక్తిన్ శ్రీరాము బ్రార్థించెదన్.

తా. డకారాదిఫకారాంతములగు నక్షరములు గలిగి యగ్నితత్త్వముగల మణిపూరకచక్రమందుఁ గూర్చున్నట్టి శంఖచక్రహస్తుఁడై యింద్రనీలములవంటి దేహము గలిగి గదచిహ్నము గలిగిన విష్ణురూపుఁడగు రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. కశాంతాక్షరాఖ్యే జగత్ప్రాణతత్త్వే
పరాభీతిహస్తం త్రిశూలం దధానమ్
ఉమానాథ మబ్జారిఖండోజ్జ్వలాంకం
సదర్పాంగరూపం భజే రామచంద్రమ్. 84

మ. పవనస్థానకశాంతవర్ణదళదీప్తంబై హారద్రాభమై
ధరణిన్మై యొప్పు ననాహతాంబుజమునందున్ శత్రుప్రహృద్భీతిసం
భవహస్తోజ్జ్వలశూలుఁడై గిరిసుతాభర్తై మృగాంకాంకుఁడై
శివరూపంబున దేజరిల్లువరదున్ శ్రీరాము సేవించెదన్.

తా. కకారాదికకారాంతాక్షరరూపమైన వాయుతత్త్వరూపమగు ననాహతచక్రమందుండి యభయహస్తుఁడై త్రిశూలమును ధరించునట్టి చంద్రఖండము చిహ్నము గలిగి గర్వితరూపము గలిగి శివరూపుఁడైన రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. విశుద్ధాఖ్యపద్మే నభస్తత్త్వరమ్యే
అరూపం సురూపం సమస్తస్వరూపమ్
విశిష్టం మనోగమ్యమేకం అనాదం
భజే జీవజీవాత్మరామం చ రామమ్.

మ. సకలాత్ముం డయి రూపవర్జితుఁడునై సద్రూపియై జీవగూ
పకవాచ్యుండు ననాదియై సుజనసంభావ్యుండునై పుష్కల
ప్రకటస్థానవిశుద్ధపంకజమునన్ భాసిల్లుచున్నట్టిన
య్యకలంకాత్మున కాజిపుత్రునకు నే నశ్రాంతము మ్రొక్కెదన్.

తా. ఆకాశతత్త్వరూపమైన విశుద్ధచక్రమందున్నట్టి రూపశూన్యుఁడైనట్టి మంచిరూపము గలిగినట్టి సమస్తవస్తురూపుఁడైనట్టి అధికుఁడైనట్టి మనస్సునకుమాత్రము గోచరించునట్టి అద్వితీయుఁడైనట్టి కారణములేనట్టి జీవరూపుఁడును జీవులయందు రమించువాఁడును నైన రాముని సేవించుచున్నాను.

శ్లో. ద్విపత్రాబ్జమధ్యే మనస్తత్త్వగమ్యే
జగత్కారణం జ్యోతిరానందరూపమ్
లసద్భానవిష్ణుం మనోభావదీపం
పరాత్మస్వరూపం భజే రామచంద్రమ్. 86

మ. తతహృత్పద్మమునన్ ద్విపత్రకములస్థానంబునందున్ మనో
గతదీపంబు పరాత్మరూపము జగత్కల్యాణబీజంబునై

యతులజ్యోతియు నై పరాత్పరము నై సానంద మై కేశవ
ప్రతిభం జెందినరామచంద్రవిభు సంభావించి సేవించెదన్.

తా. మనస్సుయొక్క తత్త్వముచేఁ బొందఁదగిన రెండు రేకులుగల పద్మముయొక్క మధ్యమందున్నట్టి జగత్తులకుఁ గారణమైనట్టి తేజోరూపము ఆనందరూపమునైనట్టి ప్రకాశించుచున్న భావములయందు వ్యాపించినట్టి మనస్సునందు దీపము వలె నున్నట్టి పరమాత్మస్వరూపుఁడైనరాముని సేవించుచున్నాను.

శ్లో. సదానంద దేవే సహస్రారపద్మే
గలచ్చంద్రపీయూషధారామృతాంతే
స్థితం రామమూర్తిం నిషేవే నిషేవే
స్వదైవం న సేవే న సేవే న సేవే. 87

మ. తతసాహస్రదళాప్తనిర్గళసుధాధారాభిషేకంబునన్
సతతానందమునన్ జెలంగినరఘుస్వామిన్ బరంధాము నా
శ్రితచింతామణి రామచంద్రు మది నే సేవింతు నిష్ఠాప్తికై
నితరాదిత్యుల నెంతకాలమునకు న్నెంచం జిత్తమ్మునన్.

తా. నిత్యానందముచేఁ బ్రకాశించుచున్నట్టి జారుచున్న చంద్రుని యమృతధారచేత రమ్యమైన సహస్రారపద్మమందున్నట్టి శ్రీరామమూర్తిని సేవించుచున్నాను; సేవించుచున్నాను. ఇతరదైవమును నేను సేవించను సేవించను సేవించను.

శ్లో. సుధాభాసితద్వీపమధ్యేవిమానే, సుపర్వాళివృక్షోజ్జ్వలే శేషతల్పే
నిషణ్ణం రమాంకం నిషేవే నిషేవే, స్వదైవం న సేవే న సేవే న సేవే.

మ. తతదుగ్ధాబ్ధిసితాంతరీపమున మందారోపకంఠోర్వీసం
స్థితసత్స్వప్నకమధ్యసోమవిలసచ్ఛేషాహితల్పంబునన్
సతతంబున్ కమలాయుతుం డగురఘుస్వామిన్ బరంధాము నా
శ్రితమందారము రాముఁ దప్ప నొరులన్ జింతింప భావంబునన్.

తా. అమృతముచేఁ బ్రకాశించుచున్న ద్వీపముయొక్క మధ్యమందు (అనఁగా క్షీరసముద్రద్వీపమధ్యమందు) గలవిమానమందుఁ గల్పవృక్షములచేఁ బ్రకాశించుచున్న శేషశయ్యయందుఁ గూర్చున్నట్టి లక్ష్మి తోడయందుఁగలరాముని సేవించుచున్నాను. ఇతరదైవమును సేవించను సేవించను సేవించను.

శ్లో. చిదంశం సమానంద మానందకందం
సుషుమ్నాఖ్యరంధ్రాంతరాళేచ హంసమ్

సచక్రం సశంఖం సపీతాంబరాంకం
పరంచాన్యదైవం నజానే నజానే. 89

మ. సరసానందు సుషుమ్నమధ్యగతహం•సస్థుఁ జిదంశుఁ గర
స్ఫురదబ్జారిగదాదిసాధను జగ•త్పూర్ణాత్ముఁ బీతాంబరు
న్వరయోగీశ్వరభావభావితుఁ జిదా•నందుఁ ముకుందుఁ బరా
త్పరు శ్రీరాము భజింతు నన్యులను సం•భావింప భావంబునన్.

తా. జ్ఞానరూపుఁడైనట్టి హెచ్చుతగ్గులేనియానందము గలిగినట్టి యానందమునకుఁ గారణమైనట్టి సుషుమ్నానాడియొక్క మధ్యమందు హంసరూపుఁడైనట్టి శంఖముతోఁ గూడినట్టి చక్రముతోఁ గూడినట్టి పీతాంబరముతోఁ గూడినట్టి రాముని సేవించుచున్నాను. ఇతరదైవము నెఱుఁగను. ఎఱుఁగను.

శ్లో. సుపర్వాళివృక్షోజ్జ్వలస్వర్ణపీఠే
వనౌకాదిభి ర్మునిభి స్సేవ్యమానమ్
స్థితం పుష్పవృష్ట్యావృతం రామమూర్తిం
సదాభూమిజాయుక్తమీళే హృదంతే. 90

ఉ. చందనవృక్షమూలవిల•సత్తపనీయమృగేంద్రపీఠినా
నందము మీఱ జెన్నలరి • నవ్యసుమోత్కరవర్షితాంగుఁడై
సుందరవామభాగపరి•శోభితజానకియై మునీంద్రస
ద్బృందము వానరుల్ గొలువఁ • బెంపువహించినరాముఁగొల్చెదన్.

తా. కల్పవృక్షములచేఁ బ్రకాశించుచున్న బంగారుపీఠమందున్నట్టి వానరులు మొదలగువారిచేతను మునులచేతను సేవింపఁబడుచున్నట్టి పువ్వులవానచేత నావరింపఁబడినట్టి యెల్లపుడు సీతతోఁ గూడినట్టి శ్రీరామమూర్తిని హృదయమధ్యమందు స్తోత్రముఁ జేయుచున్నాను.

శ్లో. కరే దివ్యచక్రం పరే చారుశంఖం
గళే తారహారం లలాటే లలామమ్
భుజంగే నిషణ్ణం సదానందరూపం
సదాభూమిజాయుక్తమీళేహృదంతే. 91

చ. కరముల శంఖచక్రములు • కంధరమందునఁ దారహారముం
బరగ లలాటభాగమున • భవ్యలలామము తేజరిల్లు వి

స్ఫురితచిదాత్మరూపకుని • భూరిభుజంగసుతల్పకస్థితుఁ
ధరణిసుతాభవాసహితు • దాశరథిఁ శరణంబు వేఁడెదన్.

తా. ఒకచేతియందుఁ జక్రమును వేరుచేతియందు శంఖమును కంఠమునందుఁ బరిశుద్ధమగు ముత్యాలహారమును నుదుటియందు బొట్టును ధరించినట్టి శేషునియందున్నట్టి పరమానందరూపుఁడైనట్టి సీతతోఁగూడినట్టిరాముని హృదయమధ్యమందు స్తోత్రముఁ జేయుచున్నాను.

శ్లో. చతుర్వేదకూటోల్లసత్కారణాఖ్యం
స్ఫురద్దివ్యవైమానికేభోగితల్పే
పరంధామమూర్తిం నిషణ్ణం నిషేవే
నిషేవే న్యదైవం నసేవే నసేవే. 92

చ. సతతము వేదకూటవిల•సద్ఘనకారణనామధేయుఁడై
యతులితదివ్యపుష్పకము•నం దహితల్పశయానుఁడై జగ గా
ద్గితపరధామమూర్తి యగు•దీ ప్తివహించినరాము నెంతుఁ
కితరము లైనదైవముల • నేను భజింప భజింప నెప్పుడిన్.

తా. నాల్గువేదములయొక్క శిఖరములయందుఁ(ఉపనిషత్తులయందు)ప్రకాశించుచున్న కారణనామముగలిగినట్టి ప్రకాశించుచున్న దివ్యవిమానములచే సంచరించువారుగల శేషశయ్యయందుఁగూర్చున్నట్టి ఉత్కృష్టతేజోరూపముఁగలిగినరాముని సేవించుచున్నాను. ఇతరదైవమును సేవించను సేవించను.

శ్లో. లసద్దివ్యశేషాచలే యోగపీఠే
సదానందవైమానికేమాసహాయమ్
మునీనాం హృదానంద మోంకారగమ్యం
సదా భూమిజాయుక్తమీళే హృదంతే. 93

మ. వరశేషాద్రిలసద్విమానమున భా•స్వద్యోగపీఠంబునం
దురమాయుక్తముగా వసించి మునిసం•తోషాకృతిఁ గల్గి వి
స్ఫురదోంకారమునఁ భజింప దగురా•మున్ మేఘసుశ్యాము సుం
దరకాముఁ రవిధాము నిచ్చలు పరం•ధాముఁ భజింతు న్మదిన్.

తా. ఎల్లప్పుడు నానందముగల విమానచారులుగల ప్రకాశించుచున్న పర్వతమువంటి శేషునియందు యోగపీఠమందున్నట్టియు లక్ష్మీసహాయుఁడైనట్టియు మునులహృద

యముని కానందకరుఁడైనట్టియు ప్రణవమునఁ బొందఁదగినట్టియు సీతతోఁగూడినరామని హృదయమునం దెల్లప్పుడు స్తుతిఁ జేయుచున్నాను.

శ్లో. మనస్థం మనోతీత మాద్యంతరూపం
మహాచింత్యవర్జంచ మధ్యస్థ మీశమ్
మనోబుద్ధ్యహంకారచిత్తాదిసాక్షిం
పరస్వప్రకాశం భజే రామచంద్రమ్. 94

మ. అతిచింతారహితుఁ బరేశుఁ బరు నాద్యంతు న్మనాంతస్థితున్
శతపత్రేక్షణు నంతరింద్రియు లసత్సాక్షిన్ మనోవాసిన
చ్యుతు సర్వాత్ము నచింత్యు నవ్యయుఁ బరంజ్యోతి న్హరి న్స్వప్రకా
శితు మందస్మితు రామచంద్రు మది నే సేవింతు నశ్రాంతమున్.

తా. మనస్సునందున్నట్టియు మనస్సుకోపలనున్నట్టియు (అనువుకంటె నణువనుట) జగత్తులయొక్క ఆదియందు నంతమందున్నట్టి గొప్పదియై చింతింపఁదగినరూపులేనట్టి మధ్యస్థుఁడనఁగా దటస్థుఁడైనట్టి యీశ్వరుఁడైనట్టి మనోబుద్ధిచిత్తాహంకారములకు సాక్షియైనట్టి సమస్తమును బ్రకాశింపఁజేయునట్టి రామమూర్తిని సేవించుచున్నాను.

శ్లో. పరానందవస్తుస్వరూపాదిసాక్షిం
పరబ్రహ్మగమ్యం పరంజ్యోతిమూర్తిమ్
పరాశక్తిమిత్రాప్రియారాధితాంఘ్రిం
పరంధామరూపం భజే రామచంద్రమ్. 95

మ. పరమానందసమస్తసాక్షియుఁ బరబ్రహ్మం బగమ్యంబు భా
సురవేదాంతుఁ డనంతుఁ సనాతనుఁ బరంజ్యోతిన్ బరాశక్తిమి
త్రరిపువ్రాతసమార్చితాంఘ్రికమలున్ రాముఁ బరంధాము సుం
దరకాముఁ గుణధాము రాఘవుని సీతాకాంతు నెంతు న్మదిన్.

తా. పరమానందవస్తువుకు మొదటిసాక్షియైనట్టి గొప్పవాఁడైన బ్రహ్మచేఁ బొందఁదగినట్టి ఉత్కృష్టతేజస్స్వరూపుఁడైనట్టి శక్తిరూపురాలైన పార్వతికి నిష్టస్నేహితుఁడైన యీశ్వరునిచేఁ బూజింపఁబడుపాదములు గలిగినట్టి గొప్పతేజోరూపుఁడైన రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. పరం పవిత్రం పరవాసుదేవం, పరాత్పరం తం పరమేశ్వరాఖ్యం
గుణత్రయారాధితమూలకంద, మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. 96

చ. హరిఁ బరవాసుదేవుఁ ద్రిగుణాత్మకుఁ భాస్కరవర్ణు రాముఁ బ్రో
బరమపవిత్రు సద్భువనపాలనశీలుఁ బరానరుఁ బరే
శ్వరుఁ బహుమూలకారణుఁ బ్రశస్తు శ్రుతిస్మృతికీర్తితాంఘ్రిపం
కరుహాతమఃపరస్థు జనకప్రభుజాన్వితుఁ రాముఁ గొల్చెదన్.

తా. మిక్కిలి పవిత్రుఁడైనట్టి ఉత్కృష్టవాసుదేవవ్యూహస్వరూపుఁడైనట్టి పూర్వునికంటెఁ బూర్వుఁడైనట్టి సర్వేశ్వరత్వమును గలిగినట్టి సత్వాదిగుణములచే నారాధించఁబడిన సర్వకారణభూతుఁడైన సూర్యతేజస్సు గలిగినట్టి తమోగుణాతీతుఁడైన రాముని సేవించుచున్నాను.

శ్లో. సాకేతే గరుగంధధూపనిబిడే మాణిక్యదీపాన్వితే
కస్తూరీఘనసారకుంకుమరసప్రాచుర్యసరోజ్జ్వలే
నానాపుష్పవితానపఙ్క్తిరుచిరే సౌవర్ణసింహాసనే
వాసం మన్మథమన్మథం మణినిభం రామం భజే తారకమ్. 97

మ. తనయూరన్ సుమదామపఙ్క్తులసుగంధద్రవ్యమాణిక్యలే
పనిలాయంబుల గంధధూపనిబిడప్రఖ్యాత మైనట్టికాం
చనసింహాసనభాసమానుఁడు మణిశ్యాముండు రాముండు శో
భనసన్మన్మథమన్మథుం డెదుటఁ దాఁ బ్రత్యక్షమై ప్రోవుతన్.

తా. అయోధ్యాపురమందు, అగరుపరిమళముగల ధూపముచే దట్టమైనట్టి మణిదీపములతోఁ గూడినట్టి కస్తూరియొక్క కర్పూరముయొక్క కుంకుమముయొక్క ఆధిక్యముచే నన్నిటిలో నధికమైనట్టి సమస్తపుష్పసమూహములపఙ్క్తిచే మనోహరమైనబంగారుపీఠమందు నివాసము గలిగినట్టి మన్మథునికి మన్మథుఁడైనట్టి యింద్రనీలములతోఁ దుల్యుఁడైన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. భంగోత్తుంగమయామృతాబ్ధిలహరీ మధ్యే విరాడ్విగ్రహే
ద్వీపే నిర్జగపాదపైః పరివృతే కర్పూరదీపోజ్జ్వలే
ఓంకారాంతరమందిరే మణిమయే శేషాన్తరాశాయినం
లక్ష్మీయుక్త మసారచిత్సుఖపదం రామం భజే తారకమ్. 98

మ. అమితోత్తుంగతరంగదుగ్ధనిధివిఖ్యాతి న్విరాడ్దేహుఁడై
యమలం బయినసితాంతరీపమున దివ్యద్రుమాజపంపోహము
ధ్యమునందున్ బ్రణవోజ్జ్వలన్మణిగృహస్థానాహిపర్యంకుఁడై
కమలం గూడి సుఖించు రాముఁ గొలుతున్ గర్పూరదీపోజ్జ్వలున్.

తా. ఉన్నతతరంగమయమైన అమృతసముద్రప్రవాహమధ్యమందు విరాట్స్వరూపుఁడై కల్పవృక్షములచేఁ జుట్టఁబడిన శ్వేతద్వీపమందుఁ గర్పూరదీపములచేఁ బ్రకాశించుచున్నట్టి మాణిక్యమయమైన ప్రణవమధ్యగృహమందు శేషునిమధ్యమున శయనించినట్టి లక్ష్మితోఁగూడినట్టి మిక్కిలిసారమైన జ్ఞానసుఖమునకు స్థానమైన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. వైకుంఠేనగరే సురద్రుమతలే ఆనన్దవప్రాంతరే
నానారత్నవినిర్మితస్ఫుటపటుప్రాకారసంవేష్టితే
సాన్ద్రేందూపలశేషతల్పలలితే నీలోత్పలచ్ఛాదితే
పర్యంకే శయనం రమాదిసహితం రామం భజే తారకమ్. 99

మ. ఘనవైకుంఠమునందు రత్నమయప్రాకారాత్తమైనట్టిచం
దనవృక్షాంతికమందు భవ్యమగునానందాఖ్యవప్రాంతరం
బున హర్మ్యాంతరరత్నవేదికపయిం బూబాన్పునం శేషశ
య్యను లక్ష్మీయుతుఁడైనతారకుని రామాధీశు సేవించెదన్.

తా. వైకుంఠపురమందుఁ గల్పవృక్షస్థలమందు ఆనందకరమగు ప్రాకారమధ్యమున బహురత్నములచే నిర్మింపఁబడిన గొప్పరెండవప్రాకారముచేఁ జుట్టఁబడిన మేడయందలి చంద్రకాంతమణులయందలి శేషశయ్యచే సుందరమైన నీలమణులచేఁ జుట్టఁబడినట్టి మంచముపై శయనించినట్టి లక్ష్మిమొదలగువారితోఁగూడిన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. వైకుంఠే పుటభేదనే మణిమయప్రాంతేందుసింహాసనే
అష్టాంతాంతసరోరుహే శశిగళత్పీయూషవార్యంతరే
చంద్రార్కానలభానుమండలయుతే శేషాహితల్పాంతరే
వాసం వాసవనీలకోమలనిభం రామం భజే తారకమ్. 100

మ. అలవైకుంఠకరద్విడాసనమునం దష్టాంతవర్ణాంబుజో
జ్జ్వలతారాధిపమండలస్రవసుధావార్యంతరార్కాగ్నిచం
ద్రలసన్మండలయుక్తభవ్యఫణిరాట్తల్పస్థు నీలాంబుదో
త్పలసుత్రాసమణీనిభాంగునిఁ బరంధాముం హరిం గొల్చెదన్.

తా. వైకుంఠపురమునందు మాణిక్యవికారమైన ప్రాంతములుగలచంద్రునివంటి పీఠమందు అకారముమొదలు క్షకారమువఱకుఁ గల అక్షరరూపమైనపద్మమందుఁ జంద్రునివలన జారుచున్న అమృతోదకప్రవాహమధ్యమందు సూర్యచంద్రాగ్నిమండల

ములతోఁగూడిన శేషశయ్యయొక్క మధ్యమున నివసించినట్టి ఇంద్రనీలముల శోభతో సమానుఁడైన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. క్షీరాబ్ధౌ శశిశంఖమౌక్తికలసద్ద్వీపే సుధర్మాంతరే
బిందౌ సార్థకళాన్వితే పరిలసన్నాగాంతరే సంస్థితమ్
కోటీరాంగదహారకుండలమణిగ్రైవేయహారోజ్జ్వలం
శ్రీవత్సాంచితమింద్రనీలసదృశం రామం భజే తారకమ్. 101

శా. క్షీరాబ్ధిన్ శశిశంఖమౌక్తికలసచ్ఛ్వేతాంతరీపస్థశ్రృం
గారౌన్నత్యసుధర్మమధ్యమున వేడ్కం బిందుపస్వీధిఁదే
జోరాజత్కళ గల్గి నాదమునఁ దా శోభిల్లి శ్రీవత్సమం
జీరాంచత్పరికల్పయుక్తుఁ డగునా శ్రీరాము భావించెదన్.

తా. పాలసముద్రమందు చంద్రఖండమువంటి ముత్యములచేఁ బ్రకాశించుచున్న ద్వీపమందు సుధర్మయను సభయొక్క మధ్యమందు బిందువునందు (అనఁగా మంత్రశాస్త్రమందలి యంత్రములో నొకవిధమైన చుక్క) సార్థకమైన శోభతోఁగూడిన ప్రకాశించుచున్న శేషునియందున్నట్టి కిరీటము, భుజకీర్తులు, కుండలములు, రత్నపుకంఠె, హారములు అనువానిచేఁ బ్రకాశించుచున్నట్టి శ్రీవత్స మనుమచ్చతోఁ గూడినట్టి యింద్రనీలములతో సమానకాంతిగల తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. సాకేతేనలచంద్రభానువిలసచ్చిచ్చక్రబిందుస్థితం
బాలార్కద్యుతిభాసురం కరతలే పాశాంకుశౌ బిభ్రతమ్
బాణం చాపయుతం విశాలనయనం స్మేరాననాంభోరుహం
స్త్రీపుంరూపధరం విలాససదనం రామం భజే తారకమ్. 102

మ. స్థిరసాకేతమునన్ విరోచనవిభాచిచ్చక్రబిందుస్థితున్
దరుణార్కోజ్జ్వలు బాణచాపవిలసత్పాశాంకుశోద్యత్కరున్
సరసీజేక్షణు మందహాసవదనున్ శస్త్రీపుమాంసాకృతున్
బరు శ్రీరాముఁ విలాసరమ్యసదనున్ భ్రాజిష్ణుఁ గీర్తించెదన్.

తా. అయోధ్యయందు సూర్యచంద్రాగ్నులచేఁ బ్రకాశించు జ్ఞానచక్రమందలి బిందువునందున్నట్టి లేఁతసూర్యుని కాంతిచేఁ బ్రకాశించుచున్న చేతియందుఁ బాశము నంకుశమును బాణమును ధరించుచున్నట్టి ధనుస్సుతోఁగూడినట్టి విశాలనేత్రములుగలిగినట్టి చిఱునవ్వుగల ముఖపద్మము గలిగినట్టి స్త్రీపురుషరూపమును ధరించినట్టి విలాసములకు స్థానమైన తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. అర్థం రక్తపదాబ్జనీలరుచిరం అర్ధేందుచూడార్చితం
అర్థం రత్నకిరీటకుండలధరం తాటంక మర్థం ధనుః
శంఖంచక్రగదాబ్జసంయుతకరం శ్రేయోమయం వైష్ణవం
పాశంచాంకుశబాణసంయుతకరం రామం భజే తారకమ్. 103

చ. ఇరుదెసఁ దామ్రనీలరుచి ♦ నింపగుకర్ణికకుండలంబులన్
బరగి గదాదిచక్రధర పాశశశాంకుశచాపపాణి యై
సురుచిరవైష్ణవాకృతిని ♦ శోభిలి శంకరసేవ్యమాన మై
నిరుపమ మైనతారకము ♦ నిర్మలభక్తి భజింతు నెంతయున్.

తా. ఎఱ్ఱని పాదపద్మములు గలిగినట్టి నీలములవలె మనోహరమైనట్టి పదార్థమైనట్టియు ఈశ్వరునిచేఁ బూజింపఁబడునట్టియు రత్నకిరీటమును గుండలములు ధరించుపదార్థమైనట్టి కర్ణభూషణములుగల పదార్థమైనట్టి ధనుస్సును శంఖమును ధరించినట్టి చక్రగదాపద్మరేఖలతోఁ గూడిన హస్తములుగల విష్ణుసంబంధియగు పదార్థమైనట్టి పాశమును ధరించినట్టి అంకుశముతో బాణముతోఁ గూడిన హస్తములుగల తారకరాముని సేవించుచున్నాను.

శ్లో. సహస్రపత్రాంబుజకర్ణికాంత, ర్జ్యోతిః ప్రకాశం పరమాదిమూలమ్
తేజోమయం జన్మజరావిహీనం, శ్రీరాఘవం నిత్యమహం నమామి.

మ. అమలాత్ముల్ మది గాంచ నెంచినసహస్రాబ్జంబులన్ గర్ణిక
స్థిమితజ్యోతిప్రభాసితుండు జనివార్ధిక్యాదిహీనుండు కాం
తమయుండున్ బరమాదిమూలము శ్రీరాఘవుండు శ్రీజానకీ
రమణీయాననపద్మపద్మసఖుఁడౌ ♦ రాముండు నన్బ్రోవుతన్. 104

తా. సహస్రారపద్మముయొక్క కర్ణికామధ్యమందుఁ దేజోరూపుఁడైనట్టియు త్కృష్టుఁడైనట్టి కారణమునకుఁ గారణమైనట్టి తేజస్స్వరూపుఁడైనట్టి జన్మము మొదిమి లేనట్టి నిత్యుఁడైనరాముని నేను నమస్కరించుచున్నాను.

శ్లో. సకలభువనరత్నం సచ్చిదానందరత్నం
సకలహృదయరత్నం సూర్యబింబాంతరత్నమ్
విమలసుకృతరత్నం వేదవేదాంతరత్నం
పురహరజపరత్నం పాతు మాం రామరత్నమ్.
ఇక్ష్వాకువంశార్ణవజాతరత్నం
సీతాంగనాయౌవనభాగ్యరత్నమ్

వైకుంఠరత్నం మమభాగ్యరత్నం
శ్రీరామరత్నం శిరసా నమామి. 105

చ. భువనపవిత్రరత్నమును భూసుతయావనభాగ్యరత్నముం
రవిఘనబింబమధ్యగతరత్నము సర్వహృదిస్థరత్నముం
భవనుతరత్నముం నిగమభాసితరత్న మమేయరత్నముం
బ్రవిమలపుణ్యరత్న మినవంశజరత్నము నన్ను బ్రోవుతన్.

తా. సమస్తలోకశ్రేష్ఠుఁడైనట్టి సత్యజ్ఞానానందశ్రేష్ఠుఁడైనట్టి యెల్లవారిహృదయములయందు రత్నదీపమైనట్టి సూర్యబింబమధ్యమందు రత్నమువలె వెలుఁగుచున్నట్టి నిర్మలపుణ్యములలో శ్రేష్ఠుఁడైనట్టి వేదవేదాంతములకు రత్నమైనట్టి యీశ్వరుని జపమునకు రత్నమైనట్టి శ్రీరామరత్నము నన్ను రక్షించుఁగాక. ఇక్ష్వాకువంశ మనెడు సముద్రమందుఁబుట్టిన రత్నమైనట్టి సీతయొక్క పిన్నవయస్సను భాగ్యమునకు రత్నమైనట్టి వైకుంఠమునకు రత్నమైనట్టి నాభాగ్యమునకు రత్నమైనట్టి శ్రీరామరూపమైన రత్నమును శిరస్సుచేత నమస్కరించుచున్నాను.

శ్లో. నిగమశిశిరరత్నం నిర్మలానందరత్నం
నిరుపమగుణరత్నం నాదనాదాంతరత్నమ్
దశరథకులరత్నం ద్వాదశాంతస్థరత్నం
పశుపతిజపరత్నం పాతు మాం రామరత్నమ్.
శతమఖసుతరత్నం షోడశాంతస్థరత్నం
మునిజనజపరత్నం ముఖ్యవైకుంఠరత్నమ్
నిరుపమగుణరత్నం నీరజాంతస్థరత్నం
పరమపదవిరత్నం పాతు మాం రామరత్నమ్. 106

మ. విమలానందము నిస్సమానగుణముం వేదాంతభానంబు స
త్కమలాంతస్థము మోక్షదంబు మునివర్గస్థాణు జప్యంబు స
త్యము నాదాంతము షోడశాంతగతముం దద్వాదశాంతస్థర
త్నము విష్ణుస్తుతరామరత్నము నితాంతప్రేమ నన్ బ్రోవుతన్.

తా. వేదములకుఁ జల్లనిరత్నమైనట్టి స్వచ్ఛమైన యానందముచేత శ్రేష్ఠమైనట్టి సామ్యములేని గుణముల సద్రత్నములు గలిగినట్టి ప్రణవనాదమధ్యమందు రత్నమైనట్టి దశరథవంశశ్రేష్ఠుఁడైనట్టి ద్వాదశదళపద్మమందు రత్నమైనట్టి యీశ్వరునిజపమునకు రత్నమైనట్టి రాముఁడను రత్నము నన్నురక్షించుఁగాక. ఇంద్రునిచే స్తోత్రము చేయఁ

బడువారిలో శ్రేష్ఠుఁడైనట్టి షోడశదళపద్మమందు రత్నమైనట్టి మునులజపమునకు రత్నమైనట్టి వైకుంఠమందు ముఖ్యరత్నమైనట్టి సామ్యములేని రత్నములవంటి గుణములు గలిగినట్టి హృత్పద్మమందలి రత్నమైనట్టి ఉత్కృష్టపదవియందు రత్నమైన రత్నమువంటి రాముఁడు నన్ను రక్షించుఁగాక.

శ్లో. సకలసుకృతరత్నం సత్యవాక్యార్థరత్నం
శమదమగుణరత్నం శాశ్వతానందరత్నమ్
ప్రణయనిలయరత్నం ప్రస్ఫుటద్యోతిరత్నం
పరమపదవిరత్నం పాతు మాం రామరత్నమ్. 107

మ. సుకృతస్థానము సత్యము౯ బరముస౯ జ్యోతిస్స్వరూపంబు తా
రకనామం బపవర్గదంబు పరమబ్రహ్మంబు నోంకారనా
మకసుస్థానము సద్గుణాకరము శుంభచ్ఛాశ్వతానంద మ
త్యకలంకం బగు రామరత్నము నితాంతప్రేమ న౯ బ్రోవుతన్.

తా. సమస్తపుణ్యములు గలవారిలో శ్రేష్ఠుఁడైనట్టి సత్యంజ్ఞాన మిత్యాదివాక్యార్థములలోఁ బ్రధానమైనట్టి శమదమాదిగుణములనెడు రత్నములు కలిగినట్టి శాశ్వతమైన యానందముగలవారిలో శ్రేష్ఠుఁడైనట్టి ప్రేమకు స్థానమైన రత్నమైనట్టి స్ఫుటముగాఁ బ్రకాశించురత్నమైనట్టి పరమపదవికి రత్నమైన రామరత్నము నన్ను రక్షించుఁగాక.

శ్లో. నిఖిలనిలయమంత్రం నిత్యతత్త్వాఖ్యమంత్రం
భవకులహరమంత్రం భూమిజాప్రాణమంత్రమ్
పవనజనుతమంత్రం పార్వతీమోక్షమంత్రం
పశుపతినిజమంత్రం పాతు మాం రామమంత్రమ్. 108

చ. సకలనివాసము౯ దురితసంఘవినాశము పార్వతీసతీ
ప్రకటితమోక్షదాయకము పావనిభావితము౯ విదేహభూ
పకతనయాసుమంత్రము గపర్దిశుభాస్పదము౯ మునీంద్రతా
రక మగు రామమంత్రము నిరంతరము౯ మముఁ బ్రోచు గావుతన్.

తా. సమస్తమంత్రస్థానముగలమంత్రమైనట్టి నిత్యతత్త్వమనఁగా మోక్షము దానిపేరుగల మంత్రము (అనఁగా మోక్షమునిచ్చు మంత్రమనుట) సంసారమును హరించునట్టి సీతకుఁ బ్రాణమైనట్టి ఆంజనేయునిచేత స్తోత్రముచేయఁబడునట్టి పార్వతికి మోక్షమిచ్చునట్టి యీశ్వరునికిఁ దనముఖ్యమంత్రమైనట్టి రామమంత్రము నన్ను రక్షించుఁగాక.

శ్లో. ప్రణవనిలయమంత్రం ప్రాణనిర్వాణమంత్రం
ప్రకృతిపురుషమంత్రం బ్రహ్మరుద్రేంద్రమంత్రమ్
ప్రకటదురితరాగద్వేషనిర్నాశమంత్రం
రఘుపతినిజమంత్రం రామరామేతిమంత్రమ్.
దశరథసుతమంత్రం దైత్యసంహారమంత్రం
విబుధవినుతమంత్రం విశ్వవిఖ్యాతమంత్రమ్
మునిగణనుతమంత్రం ముక్తిమార్గైకమంత్రం
రఘుపతినిజమంత్రం రామరామేతిమంత్రమ్. 109

మ. ప్రకటోంకారనివాసము న్ద్రుహిణజం◆భద్వేషిజప్యంబు తా
రకము న్మౌనినుతంబు నాజికులమం◆త్రం బాసురధ్వంసము న్
సకలార్యావనము న్జగత్ప్రకటము న్◆ సన్ముక్తిమార్గంబు మా
మకషడ్వర్గహరంబు రామవిలస◆న్మంత్రంబు నన్ బ్రోవుతన్.

తా. ఓంకారస్థానమైనట్టి ప్రాణములకు మోక్షమిచ్చునట్టి ప్రకృతిపురుషుల రూపమైనట్టి బ్రహ్మరుద్రేంద్రులకు జపించఁదగినట్టి అతిశయమైనపాపములను రాగద్వేషములను నశింపఁజేయునట్టి రామ రామ యనుమంత్రము శ్రీరామమూర్తియొక్క ముఖ్యమంత్రము. దశరథపుత్త్రుఁడైనరామునిమంత్రమైనట్టి రాక్షసులను సంహరించునట్టి దేవతలచే స్తోత్రముచేయఁబడినట్టియు లోకమునఁ బ్రసిద్ధమైనట్టి మునిసముదాయముచే స్తోత్రముచేయఁబడినట్టి మోక్షమార్గమునకు ముఖ్యమైనట్టి రామ రామ యను మంత్రము రాముని ముఖ్యమంత్రము.

శ్లో. సంసారసాగరభయాపహవిశ్వమంత్రం
సాక్షాన్ముముక్షుజనసేవితసిద్ధమంత్రమ్
సారంగహస్తముఖహస్తనివాసమంత్రం
కైవల్యమంత్ర మనిశం భజ రామమంత్రమ్.
జయతు జయతు మంత్రం జన్మసాఫల్యమంత్రం
జననమరణభేదక్లేశవిచ్ఛేదమంత్రమ్
సకలనిగమమంత్రం సర్వశాస్త్రైకమంత్రం
రఘుపతినిజమంత్రం రామరామేతిమంత్రమ్. 110

మ. తతసంసారసముద్భవప్రబలసంతాపాపహారంబు సం
తతసారంగధరాస్యహస్తవిలసద్ధామంబు వేదాంతస
న్నుతమున్ జన్మజరాంతదుఃఖహరమున్ మోక్షాస్పదంబున్ సమా
శ్రితసాఫల్యము రామమంత్రము మదిన్ జింతింతు నశ్రాంతమున్.

తా. సంసారసముద్రమువలని భయమును బోఁగొట్టు సమస్తమంత్రరూపమైనట్టి మోక్షము నిచ్చుచుండుజనులచేత సేవింపఁబడు సిద్ధికరమైనమంత్రమైనట్టి ఈశ్వరుఁడు మొదలగువారిహస్తములయందు నివాసముగల మంత్రమైనట్టి (హస్తముచేత లెక్కించుచు జపింతురనుట) మోక్షమంత్రమైనరామమంత్రము నెల్లప్పుడు సేవించుము. జన్మసాఫల్యమును జేయునట్టి జన్మము మరణము మొదలగుభేదములుగల కష్టములను గొట్టివేయునట్టి సర్వవేదములలోఁ బ్రధానమంత్రమైనట్టి సర్వశాస్త్రములలో ముఖ్యమైనట్టి రామ రామ అనునట్టి రాముని ప్రధానమంత్రము సర్వోత్కృష్టమై యుండుఁగాక.

శ్లో. అజ్ఞానసంభవభవాంబునిబాడబాగ్ని
రవ్యక్తతత్త్వనికరప్రణవాధిరూఢః
సీతాసమేతమనుజేన హృదంతరాళే
ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తే. 111

మ. ప్రకటజ్ఞానభవాంబురాశిబడబప్రాయుం బభివ్యక్తమ
త్యకలంకంబు సలక్షణం బవనిజాతాయుక్తమవ్యక్తమున్
సకలవ్యాపకమున్ మహాప్రణవసుస్థానంబు రామాఖ్యతా
రకమున్ మామకదృష్టిగోచర మగున్ బ్రాణప్రయాణంబునన్.

తా. అజ్ఞానమువలనఁ బుట్టిన సంసారసముద్రమునకు బడబాగ్నియైనట్టి స్ఫుటముగాని తత్త్వములసముదాయముగల ప్రణవము నధిష్ఠించినట్టి శ్రీరామమూర్తి ప్రాణోత్క్రమణసమయమందు నాహృదయమందు సీతతోఁగూడుకొనునట్టుగాఁ దమ్మునితోఁగూడ సమీపించుఁగాక.

మ. శివసామ్యుం డగునాదిశంకరులు మున్ శ్రీరామకర్ణామృతం
బవనిన్ సంస్కృత నేర్పరించె నది మోక్షాపేక్ష చేకూరు వం
శవరాబ్ధీందుప్రసిద్ధసిద్ధకవిచే శ్రద్ధన్ దెనుంగించి రా
ఘవ! పూదండగ నిచ్చినాఁడ గొనుమా కల్పంబుగా సత్కృపన్.

మాలినీ. హరిపదయుగధారీ ♦ యార్యచిత్తానుసారీ
పరమపదవిహారీ ♦ భక్తలోకోపకారీ
శరధిశరధిమిత్రా ♦ శత్రుసంఘాతజైత్రా
సరసిజదళనేత్రా ♦ సన్మునిస్తోత్రపాత్రా.

మ. ఇది శ్రీరామపదారవిందమకరం♦దేచ్ఛాభృత్స న్మత్తష
ట్పదవిజ్ఞానపదాబ్జరేణుపటల♦ప్రాప్తోత్తమాంగోల్లస
న్ముదితాంతఃకరణుండు సిద్ధకవిమా♦న్యుం డైనరామావనీ
శదయాలోకనఁ జెప్పె రెండవదియా♦శ్వాసం బభీష్టాప్తికిన్.



# తృతీయాశ్వాసము.

శ్లో. శ్రీరామం శివచాపభంగనిపుణం సీతాంగనావల్లభం
సుత్రామార్చితపాదపద్మయుగళం సూర్యేందునేత్రోజ్జ్వలమ్
కర్పూరాంగవిలేపనం ఘనరుచిం కారుణ్యపాథోనిధిం
వందే కల్పతరుప్రవేశితలసత్సింహాసనాధిష్ఠితమ్. 1

శా. శ్రీమందారమహీరుహోపరిలసత్సింహాసనాసీనునిన్
శ్రీమద్భర్గధనుర్విభంగనిపుణున్ సీతాధినాథున్ ఘన
శ్యామున్ జందనచర్చితాంగు కవిచందార్యున్ గృపాబ్ధిన్ బరం
ధామున్ రాముఁ బురందరార్చితు మదిన్ ధ్యానింతు నశ్రాంతమున్.

తా. ఈశ్వరధనుస్సును విఱచుటయందు నేర్పరియైనట్టియు సీతకుఁ బ్రియుఁడై నట్టియు దేవేంద్రునిచేఁ బూజింపఁబడిన పాదపద్మద్వంద్వము గలిగినట్టియు సూర్యచంద్ర నేత్రములచేఁ బ్రకాశించుచున్నట్టియుఁ గర్పూరపుమైపూఁతగలిగినట్టియు మేఘకాంతి గలిగినట్టియు దయాసముద్రుఁడైనట్టియుఁ గల్పవృక్షసమీపమందున్నట్టి ప్రకాశించుచున్న సింహాసనము నధిష్ఠించినరాముని నమస్కరించుచున్నాను.

శ్లో. శ్రీరామ స్సితికంధరస్యధనుష స్సంభేదనప్రాపితాం
సీతాంకాంచనసన్నిభాం పరిణతా మాకల్పరత్నోజ్జ్వలామ్
వామాంకోపరిలజ్జయానతముఖీ మాలోక్య దివ్యాసనే
శ్రీమద్భానుశశాంకకోటిసదృశః పాయాత్సనో రాఘవః. 2

మ. రవిచంద్రాయుతకోటికోటినిభుఁడై రమ్యాసనాసీనుఁడై
భవకోదండవిఖండలబ్ధవిలసత్స్వర్ణాగ్రహారన్ మైథిలిన్
నవరత్నాభరణప్రభాన్వితసువర్ణన్ నైజవామాంకమం
దవలోకించురఘూద్వహుండు దయ నన్నశ్రాంతమున్ బ్రోవుతన్.

తా. శివధనుస్సు విఱచుటచేత లభించినట్టి బంగారుతోఁ దుల్యురాలైనట్టి ఈరూపముగా మారినలక్ష్మియైనట్టి యలంకారములయందలి రత్నములచేఁ బ్రకాశించుచున్నట్టి యెడమతొడపైనుండి సిగ్గుచే వంచఁబడిన ముఖముగల సీతనుజూచి ప్రశస్త

మైనపీఠమందుఁ గూర్చున్నట్టి శోభించుచున్న - బహుసూర్యచంద్రులతో సమానుఁడైన ప్రసిద్ధుఁడైన రాముఁడు మమ్ము రక్షించుఁ గాక.

శ్లో. శ్రీరామం భువనైకసుందరతనుం ధారాధరశ్యామలం
రాజీవాయతలోచనం రఘువరం రాకేందుబింబాననమ్
కోదండాదినిజాయుధాశ్రితభుజైర్భాంతం విదేహాత్మజా
ధీశం భక్తజనావనం రఘువరం శ్రీరామచంద్రం భజే. 3

మ. సరసీజాయతపత్రనేత్రు విలసత్సౌందర్యపాత్రుం సుధా
కరబింబాననునీలతోయదలసద్గాత్రుం ధరాపుత్రికా
వరుఁ గోదండముఖాయుధాశ్రితభుజుం బందారు మందారు శ్రీ
కరు శ్రీరాముని రాఘవుం రఘువరుం గాంక్షించి సేవించెదన్.

తా. లోకములయందు దొక్కటియే సొగసైన దేహముగలిగినట్టియు మేఘమువలె నల్లనైనట్టియు పద్మమువలె విస్తారమైన నేత్రములు గలిగినట్టి రఘుశ్రేష్ఠుఁడైనట్టి పూర్ణచంద్రబింబమువంటి మొగముగలిగినట్టి ధనుస్సు మొదలగు తనయాయుధములచే నాశ్రయించఁబడిన భుజములచేఁ బ్రకాశించునట్టి సీతానాథుఁడైనట్టి భక్తజనులను రక్షించునట్టి రఘుశ్రేష్ఠుఁడైనట్టి శోభచేఁ బ్రకాశించుచంద్రుఁడైనట్టి (అనఁగాఁ జంద్రునివలె శోభించునట్టి) రాముని సేవించుచున్నాను.

శ్లో. ఆరామం వైభవానా మభినవసుపథం హారకేయూరకాంతం
హాసోల్లాసాభిరామం మణిమయమకుటం మంగళానాం నివాసమ్
మందారారామసీమాంతరమణిభవనాధిష్ఠితం శిష్టసేవ్యం
సల్లాపానందసింధుప్రణయ మభినిశం రామచంద్రం భజేహమ్. 4

చ. తతవిభవాభిరాము సుపథప్రవిహారు దరస్మితాననాం
చితు మకుటాంగదాభరణు సేవకసేవధి మంగళాకరుం
సతతము గల్పభూరుహవనస్థలసన్మణిగేహమధ్యరం
జితు సరసోక్తిసంతుషితసింధువు రామవిభుం భజించెదన్.

తా. వైభవములకుఁ దోఁటయైనట్టి మంచికీర్తిమార్గమైనట్టి హారములచే భుజకీర్తులచే మనోహరుఁడైనట్టి నవ్వుయొక్క యుల్లాసముచే శోభించుచున్నట్టి మణికిరీటము గలిగినట్టి శుభములకు స్థానమైనట్టి కల్పవృక్షములతోఁటలోనిమణిగృహము నధి

ష్టించినట్టి యోగ్యులకు సేవింపఁదగినట్టి యోగ్యసంభాషణముచేతనైన యానందసముద్రమందుఁ బ్రేమ గలిగినట్టి రామునిఁ బ్రతిదినము సేవించుచున్నాను.

శ్లో. రామం రాజశిఖామణిం రఘువరం రాకేందుబింబాననం
రాజీవాయతలోచనం రణహతానేకాసురం రాఘవమ్
సీతాచారుపయోధరాంచితలసత్కాశ్మీరగంధాంచితం
రాజత్కుండలమండితం శుభకరం రామాభిరామం భజే. 5

మ. ధరణీనాథశిరోమణిన్ శుభకరున్ దైత్యాభ్రజంఝానిలున్
ధరణీజోరుపయోధరాంకితలసత్కాశ్మీరగంధాంకితున్
సరసీజేక్షణు గండమండలవిరాజత్కుండలున్ రాము సుం
దరపూర్ణేందునిభాననున్ గొలిచెదన్ రామాభిరామున్ మదిన్.

తా. రాజులకు శిరోరత్నమైనట్టియు రఘుశ్రేష్ఠుఁడైనట్టియు పూర్ణచంద్రబింబమువంటి మొగము గలిగినట్టియు పద్మమువలె విశాలములైన కన్నులు గలిగినట్టియు యుద్ధమందుఁ జంపఁబడిన బహురాక్షసులు గలిగినట్టి రఘువంశమందుఁ బుట్టినట్టి సీతాదేవియొక్క స్తనములయందు దొప్పుచున్న కుంకుమపరిమళముచే నొప్పుచున్నట్టియు ప్రకాశించుచున్న కుండలములచే నలంకరించఁబడినట్టి శుభములను జేయునట్టి సుందరులలో సుందరుఁడైనరాముని సేవించుచున్నాను.

శ్లో. రామం కోమలనీలమేఘవిలసద్గాత్రం పయోజాననం
కాకుత్స్థం దశకంఠబాహువిదళత్కోదండబాణాన్వితమ్
పాపఘ్నం విశదాయతాక్షియుగళం సౌమిత్రిసంసేవితం
భక్తానాం పరమౌషధం మునివరైస్సంస్తూయమానం భజే. 6

చ. కలుషవినాశకారి దశకంధరకంధరబాహుఖండనో
జ్జ్వలశరధారి పంకరుహవక్త్రుఁ బరాపరు సర్వమౌనిమం
డలనుతుఁ గంజనేత్రు గరుడధ్వజు నాశ్రితలోకలోకని
ర్మలపరమౌషధం బయిన రాము సలక్ష్మణు నాశ్రయించెదన్.

తా. సొగసైన నల్లనిమేఘమువలెఁ బ్రకాశించుచున్న దేహము గలిగినట్టియుఁ బద్మమువంటి మొగము గలిగినట్టియుఁ గకుత్స్థవంశమందుఁ బుట్టినట్టియు రావణునిభుజములను బ్రద్దలుచేయు ధనుర్బాణములతోఁ గూడినట్టియుఁ బాపములను గొట్టివేయు

నట్టి నిర్మలమైన విస్తారమైన నేత్రద్వంద్వము గలిగినట్టి భక్తులకు ముఖ్యౌషధప్రాయుఁడైనట్టి మునిశ్రేష్ఠులచే స్తోత్రము చేయఁబడుచున్న రాముని సేవించుచున్నాను.

శ్లో. రామం శ్యామలమేఘకోమలరుచిం రాకేందుబింబాననం
రక్షోఘ్నం రవిజార్చితం రఘువరం రత్నోజ్జ్వలత్కుండలమ్
రాజీవాక్ష మమానుషం రణబలోదగ్రం రమానుగ్రహం
రాజేంద్రం రమణీయరూప మసకృద్ధ్యాయే జగన్మోహనమ్. 7

శా. రాముం విశ్వవిమోహనుం రఘువరుం • రాజేంద్రు గంజాక్షు సు
త్రామారాతినిమర్దనుం రణబలో•దగ్రుం రమానుగ్రహుం
శ్యామాంగుం రవిజార్చితుం గనకర•త్నాకల్పదీప్తుం బరం
ధాముం గారణమూర్తి రమ్యుని సుధా•ధామాననుం గొల్చెదన్.

తా. నల్లని మేఘమువలె సొగసైనకాంతిగలిగినట్టియు పూర్ణచంద్రబింబమువంటి మొగము గలిగినట్టియు రాక్షసులఁ గొట్టునట్టియు సుగ్రీవునిచేఁ బూజింపఁబడినట్టి రఘుశ్రేష్ఠుఁడైనట్టి రత్నములచేఁ బ్రకాశించుచున్న కుండలములు గలిగినట్టి పద్మముల వంటి నేత్రములు గలిగినట్టి మనుష్యమాత్రుఁడు గానట్టి యుద్ధబలముచే గొప్పవాఁడైనట్టి లక్ష్మియం దనుగ్రహముగలిగినట్టి రాజశ్రేష్ఠుఁడైనట్టి సుందరమైనరూపము గలిగినట్టి జగములను మోహింపఁజేయు రాముని బలుమాఱు దలంచుచున్నాను.

శ్లో. రామం రమ్యగుణం రమాపతిసమం రాకాశశాంకాననం
రాజన్యం రమణీయరూప మమలం రామాభిరామం హరిమ్
రాజారాధితపాదపద్మ మనిశం రాజన్యసద్భాసితం
రాకేందుప్రతిమం రమాకుచయుగే విన్యస్తహస్తం భజే. 8

శా. రాముం రమ్యగుణుం రమాధిపసముం • రామాభిరాముం బరం
ధాముం రాజలలాము రాఘవు సుధా•ధామాననుం భార్గవీ
రామారత్నపయోధరోజ్జ్వలకరుం • రాకేందుసంకాశు నా
స్వామిం రాజవరార్చితాంఘ్రియుగళుం • సద్భక్తి సేవించెదన్.

తా. సుందరగుణములు గలిగినట్టి విష్ణుతుల్యుఁడైనట్టి పూర్ణచంద్రునివంటి ముఖముగలిగినట్టి రాజవంశమందుఁ బుట్టినట్టి సుందరరూపము గలిగినట్టి నిర్మలుఁడైనట్టి సుందరులలో సుందరుఁడైనట్టి విష్ణురూపుఁడైన రాజులచేఁ బూజింపఁబడు పాదపద్మములు గలిగినట్టి రాజులయందు లెస్సగాఁ బ్రకాశించుచున్నట్టి పూర్ణచంద్రునితో

సామ్యముగలిగినట్టి లక్ష్మీదేవియొక్క స్తనద్వంద్వమందుంచఁబడిన చేతులు గలరాముని సేవించుచున్నాను.

శ్లో. రామం కౌశికగౌతమప్రియకరం సీతాపతిం సానుజం
రక్షోఘ్నం వనవాసినం గుణనిధిం విఘ్నఘ్న మాప్తార్కజమ్
సేతోర్బంధనధీరవానరబలం ధిక్కుంభకర్ణేంద్రజి
త్పఙ్క్తిగ్రీవముపద్విభీషణమజం శ్రీరామచంద్రం భజే. 9

మ. సరసుఁ గౌశికగౌతమప్రియకరుఁ ద్వ్యాజేశు విఘ్నఘ్ను సు
స్థిరసౌమిత్రిసమేతు రాము వనవాసిఁ భానుపుత్రాప్తు ను
త్తరవారాశినిబంధనప్లవగసంతానుఁ దశాస్యాదిము
ష్కరదైత్యారివిభీషణావను రఘుస్వామిఁ బ్రశంసించెదన్.

తా. విశ్వామిత్రగౌతముల కిష్టముఁజేయునట్టి సీతానాథుఁడైనట్టి తమ్మునితోఁ గూడినట్టి రాక్షసులఁగొట్టునట్టి వనవాసముఁజేసినట్టి గుణములకు స్థానమైనట్టి విఘ్నములను హరించునట్టి ఇష్టుఁడైనసుగ్రీవుఁడు గలిగినట్టి సేతువుగట్టుటయందు ధైర్యముగల వానరసేన గలిగినట్టి కుంభకర్ణుని నింద్రజిత్తుని రావణుని ధిక్కరించినట్టి విభీషణుని రక్షించినట్టి పుట్టువులేనట్టి రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. రామం కోమలనీలనీరదనిభం నీలాలకాలంకృతం
కట్యాం శోభితకింకిణీఝుణఝుణధ్వానై రుపేతం శిశుమ్
కంఠాలంబితరక్షునిర్మలనఖం కంజాక్ష మబ్జచ్ఛవిం
భాస్వంతం మకుటాంగదాదివివిధాకల్పం సదాహం భజే. 10

మ. హరినీలాలకు నీలనీరదవిరాజాంగుఁ గిరీటాదిసుం
దరసద్భూషణుఁ గింకిణీఝుణఝుణధ్వానస్ఫురన్మేఖలుఁ
వరశార్దూలనఖప్రకాశితగళుఁ బాలుఁ రఘుస్వామి సు
స్థిరురాకేందునిభాననుఁ గుణనిధిఁ శ్రీరాముఁ గీర్తించెదన్.

తా. సుందరమైన నల్లనిమేఘముతో సమానుఁడైనట్టి నల్లనిముంగురులచే నలంకరించఁబడినట్టి మొలయందుఁ బ్రకాశించుచున్న చిరుగంటలధ్వనులతోఁ గూడినట్టి బాలుఁడైనట్టి కంఠమందు వ్రేలుచున్న చిరుతగియొక్క (అనఁగాఁ బులియొక్క) నిర్మలమైనగోరు గలిగినట్టి పద్మములవంటి నేత్రములు గలిగినట్టి పద్మమువంటికాంతి గలిగినట్టి (నల్లగలువవంటి కాంతిగల) ప్రకాశించుచున్నట్టి కిరీటము భుజకీర్తులు మొదలగు పలుతెఱంగుల అలంకారము గలరాముని సేవించుచున్నాను.

శ్లో. రామం సీతాసమేతం విపులరవిశతాభాసమానం రసార్ద్రం
శ్యామం దేదీప్యమానం స్మితరుచిరముఖం కుండలోద్భాసగండమ్
శ్రీవత్సం శ్రీనివాసం సురతరువిలసద్రత్నసింహాసనస్థం
దివ్యాకల్పోజ్జ్వలాంగం దివిజపతినుతం సంతతం తం భజేహమ్. 11

మ. సురభూజాంతికరత్నపీఠవిలసత్ క్షోణీసుతాయుక్తు భా
స్కరకోటిద్యుతి శ్రీనివాసుఁ గుముదశ్యాముఁ బరంధాము సుం
దరమందస్మితవక్త్రు జిష్ణునుతు నానారత్నవిభ్రాజితా
భరణుఁ రాము రసార్ద్రు నాజినుతు శ్రీవత్సాంకు సేవించెదన్.

తా. సీతతోఁగూడినట్టి నిర్మలమగు నూరుగురసూర్యులశోభతో సమానుఁడై నట్టి దయారసముచేఁ దడిసినట్టి నల్లనై మిక్కిలి ప్రకాశించుచున్నట్టి చిఱునవ్వుచే సొగసైనమొగము గలిగినట్టి కుండలములచేఁ బ్రకాశించుచున్నగండస్థలములు గలిగినట్టి శ్రీవత్సచిహ్నము గలిగినట్టి లక్ష్మికి స్థానమైనట్టి కల్పవృక్షములయందుఁ బ్రకాశించుచున్న రత్నపీఠమందున్నట్టి శ్రేష్ఠములగు నలంకారములచేఁ బ్రకాశించుదేహముగలిగినట్టి దేవేంద్రునిచే స్తోత్రముచేయఁబడుచున్నరాము నెల్లపుడు సేవించుచున్నాను.

శ్లో. జలనిధికృతసేతుం దేవతానందహేతుం
దశముఖముఖరక్షోదారవైధవ్యహేతుమ్
మునిజననివహానాం ముక్తిసౌఖ్యాదిహేతుం
రఘువరకులకేతుం కీర్తయే ధర్మహేతుమ్. 12

మ. తతపౌలస్త్యముఖాసురేంద్రసతివైధవ్యప్రహేతుండు సం
తతమౌనీశ్వరమోక్షసౌఖ్యదుఁడు మార్తాండాన్వయాంభోధిభా
సితచంద్రుండు సురప్రమోదితుఁడు రాజీవాయతాక్షుండు బం
ధితసింధుం డగురామభూవిభుఁడు మన్నించుఁ నన్ సత్కృపన్.

తా. సముద్రమునకుఁ జేయఁబడినగట్టు గలిగినట్టి దేవతలకానందకారణమైనట్టి రావణుఁడు మొదలగురాక్షసులభార్యల వైధవ్యమునకుఁ గారణమైనట్టి మునిసముదాయములకు మోక్షాదిసుఖాదులకుఁ గారణమైనట్టి రఘువుయొక్క శ్రేష్ఠమైనవంశమున కలంకారమైనట్టి ధర్మమునకుఁ గారణమైనరాముని గానముచేయుచున్నాను.

శ్లో. సకలగుణనిధానం యోగిభిస్తూయమానం
భజితసురవిమానం రక్షితేంద్రాదిమానమ్

మహితవృషభయానం సీతయాశోభమానం
స్మరతు హృదయభానుం బ్రహ్మరామాభిరామమ్. 13

మ. వరయోగీంద్రనుతుఁ సురేంద్రముఖగీర్వాణేశమానావనుఁ
హరమిత్రుఁ హితపుష్పకుఁ జనకజావ్యాయుక్తు హృత్పంకజాం
తరసందీపితభాను సద్గుణనిధిఁ రామాభిరాముఁ బరా
త్పరు శ్రీరాము నమేయు రాఘవపరబ్రహ్మంబుఁ జింతించెదన్.

తా. సమస్తగుణములకు నిధియైనట్టి యోగీశ్వరులచే స్తోత్రము చేయఁబడినట్టి పొందఁబడిన దేవవిమానము గలిగినట్టి రక్షించఁబడినయింద్రాదులగౌరవము గలిగినట్టి పూజింపఁబడిన యీశ్వరుఁడు గలిగినట్టి సీతచే ప్రకాశించుచున్నట్టి హృదయమందు సూర్యుఁడైనట్టి సుందరులలో సుందరుఁడైనట్టి పరబ్రహ్మను (జనము) స్మరించుఁగాక.

శ్లో. వరగుణమణిసింధు ర్మైథిలీప్రాణబంధుః
కనకశిఖరిధైర్యో భూతలాబ్జాతసూర్యః
దశరథనృపసూనుః దేవవక్త్రాబ్జభానుః
జయతు భువనభద్రో సర్వదా రామభద్రః. 14

మ. సరసుఁ సద్గుణరత్నసింధువసుధాజాప్రాణసద్బంధువుఁ
ధరణీతామరసప్రభాకరు జగద్భద్రానుసంధాయిఁ బ
ఙ్క్తిరథక్షోణిపరత్నముఁ రఘువరుఁ దేవాగ్రగణ్యుఁ బరా
త్పరు శ్రీరాము సుమేరుధీరు మది సంభావింతు నిష్ఠాప్తికిన్.

తా. శ్రేష్ఠగుణములనెడు మణులకు సముద్రుఁడైనట్టి సీతయొక్క ప్రాణబంధువైనట్టి మేరుపర్వతమువంటిధైర్యము గలిగినట్టి భూమియందు దున్నతకిరణములుగల సూర్యుఁడైనట్టి దశరథరాజుయొక్క ప్రధానవస్తువైనట్టి దేవతలకుముందు ముఖ్యముగా లెక్కించఁదగినట్టి పొందించఁబడిన లోకముల శుభములుగలరామభద్రుఁడు నన్ను రక్షించుఁగాక.

శ్లో. త్రిదశకుముదచంద్రో దానవాంభోజచంద్రో
దురితతిమిరచంద్రో యోగినాం జ్ఞానచంద్రః
ప్రణతనయనచంద్రో మైథిలీనేత్రచంద్రో
దశముఖరిపుచంద్రః పాతు మాం రామచంద్రః. 15

మ. శ్రితనేత్రాబ్జుఁ డఘాంధకారకమలారిప్రాజ్ఞసుజ్ఞానమా
నితచంద్రుండు సురాబ్జమిత్రుఁ డసురానీకాబ్జసోముండు సం

తతసీతానయనప్రకాశశశిదైత్యశ్రేష్ఠప్రాణాపహా
ద్ధతసోముం డగు రామభూవిభుఁడు నిత్యంబు న్ననుం బ్రోవుతన్.

తా. దేవతలనెడు కలువలకుఁ జంద్రుఁడైనట్టి రాక్షసులనెడు పద్మములకుఁ జంద్రుఁడైనట్టి (అనఁగా దేవతల నానందింపఁజేయువాఁడు రాక్షసులను బాధించువాఁడు) పాపములను చీఁకటికిఁ జంద్రుఁడైనట్టి యోగులజ్ఞానమునకుఁ జంద్రుఁడైనట్టి నమస్కరించువారి నేత్రములకుఁ జంద్రుఁడైనట్టి సీతయొక్క కన్నులకుఁ జంద్రుఁడైనట్టి రావణునిశత్రువైనట్టియుఁ జంద్రునివలె శోభించునట్టియు రామచంద్రమూర్తి నన్ను రక్షించుఁగాక.

శ్లో. స్వయువతికుచచంద్రం బంధుదుగ్ధాబ్ధిచంద్రం
సుజనకుముదచంద్రం వైరివక్త్రాబ్జచంద్రమ్
వికసితముఖచంద్రం వ్యాప్తసత్కీర్తిచంద్రం
సకలభువనచంద్రం సంతతం రామచంద్రమ్. 16

మ. తనయోషాకుచచంద్రు బంధుజనసంతానాబ్ధిచంద్రుఁ సుధా
శనవిద్వేషిముఖాబ్జచంద్రుఁ గరుణాసాంద్రుఁ మునిస్తోత్రు స
జ్జననీలోత్పలచంద్రు దిగ్భరితరాజత్కీర్తిచంద్రుఁ సనా
తనుఁ జంద్రాసను రామభూరమణు నిత్యంబుఁ బ్రశంసించెదన్.

తా. సీతాకుచములయందు నఖక్షతములు గలవాఁడైనట్టి (నఖక్షతముల నుంచువాఁడనుట) చుట్టములనెడు పాలసముద్రమునకుఁ జంద్రుఁడైనట్టి యోగ్యులనెడు కలువలకుఁ జంద్రుఁడైనట్టి శత్రువులముఖపద్మములకుఁ జంద్రుఁడైనట్టి వికసించినముఖచంద్రుఁడు గలిగినట్టి వ్యాపించినకీర్తిచంద్రుఁడు గలిగినట్టి యెల్లలోకములకుఁ జంద్రుఁడైనట్టిరామచంద్రు నెల్లప్పుడు సేవించుచున్నాను.

శ్లో. భేత్తారం దశకంఠకంఠకదళీః కందర్పదర్పాపహం
శ్రీకంఠాకృతి మాప్నువానమమలం ఘోరాసురప్రాణదమ్
బాణం ప్రత్యుపసంహరంత మతులం బాణాసనోద్యత్కరం
వందే రాతిభయాపహం మునినుతం రామం ఘనశ్యామలమ్. 17

ఉ. లీల దశాస్యకంఠకదళీదళనక్రమవిక్రమక్రముఁ
ఫాలవిలోచనాకృతిశుభప్రదు దైత్యవిరాము మానిరా
ట్పాలు విరోధిభీతికరు బాణపరంపరకార్ముకోజ్జ్వలుఁ
నీలఘనాఘనాంగు రమణీయచరిత్రుని రాముఁ గొల్చెదన్.

తా. రావణునియొక్క అరఁటిదవ్వలవంటికంఠములను ఛేదించినట్టియు మన్మథుని దర్పమును హరించిన యీశ్వరునియాకారము గలిగినట్టియు నిర్మలునిదయచేఁ దడపుచున్నట్టియు భయంకరులగు రాక్షసుల ప్రాణములను హరించునట్టి బాణమును (రాక్షస సంహారానంతరమందు) ఉపసంహరించుచున్నట్టి సామ్యములేనట్టి ధనుస్సునందు సంధించినహస్తములు గలిగినట్టి శత్రువులకు భయంకరుఁడైనట్టి మునులచే స్తోత్రముచేయఁబడినట్టి మేఘమువలె నల్లనైనరాముని నమస్కరించుచున్నాను.

శ్లో. ఆకర్ణాంతగుణోల్లసచ్ఛరమజం కల్పాంతకాలోపమం
నేత్రాంతారుణతాం వహంత మనిశం ప్రహ్లాదదన్నాకినామ్
పౌలస్త్యానుగదృష్టిచంచలకరం శస్త్రాస్త్రసంధాయినం
బాణానేకవిచిత్రహస్తకుశలం శ్రీవీరరామం భజే. 18

శా. ఆకర్ణాంతగుణప్రయుక్తవిశిఖుం డై తామ్రనేత్రాబ్జుఁ డై
యాకల్పాంతకృతాంతుఁ డై చలితశైత్యాలోకనుం డై పరా
నీకాశ్చర్యవిచిత్రలాఘవశరానీకుండు నాదేవతా
లోకాభీష్టదు వీరరామవిభు నాలోకింతు నశ్రాంతమున్.

తా. కర్ణాంతపర్యంత మున్న నారియందు శోభించుచున్న బాణము గలిగినట్టి పుట్టువులేనట్టియుఁ బ్రళయమందలి యమునితో సామ్యము గలిగినట్టియు నేత్రప్రాంతములయం దెఱుపును వహించుచున్నట్టియు దేవతలకు సంతోషము నిచ్చునట్టియుఁ బులస్త్యవంశమందలి రాక్షసులదృష్టికిఁ జలనముఁ జేయునట్టియు మంత్రప్రధానబాణములను కేవలబాణము లనుసంధానముఁ జేయునట్టియు బాణముల బహువిచిత్రములుగ హస్తనైపుణ్యము గలిగినట్టి వీరుఁడైనరాముని సేవించుచున్నాను.

శ్లో. నహి మాతా నహి తాతో నహి మమతనయాశ్చ నైవ సోదర్యాః
ఇతి మనసికృతే మృత్యౌ రఘుపతి రయమేవ బంధురాసన్నః. 19

ఉ. ఆరయ మృత్యుసన్నిహితమైనతఱిఁ దనతల్లిదండ్రులుఁ
గూరిమిఁ గల్గినట్టికొడుకుల్ నిజసోదరు లింక నన్యు లె
వ్వారలు లేరు లేరు హితవర్తనుఁ డార్తశరణ్యగణ్యుఁ డౌ
శ్రీరఘురామదైవతమె చేరువబందుగుఁ డై మెలంగెడిన్.

తా. నాకు మృత్యువు సమీపించియుండఁగాఁ దల్లి లేదు, తండ్రి లేఁడు, కొడుకులు లేరు, తోఁబుట్టినవాఁడు లేఁడు ఇట్లుండఁగా నీరాముఁడే దగ్గిరచుట్టమైయుండును.

శ్లో. దేవేంద్రేణ సమర్పితే ధ్వజయుతే తత్స్యందనే సంస్థితం
సోత్కంఠం సురవైరివీర్యవిభవం జ్ఞాత్వా భుజాస్ఫాలనమ్
కృత్వా సూతయుతం దశాననహరం తూణీరసంస్థం శరం
హృత్వా జ్యానినదాదరాతిభయదం శ్రీవీరరామం భజే. 20

మ. శతమన్యర్పితసూతకేతుయుతభాస్వత్స్యందనారూఢుఁడై
ప్రతిరోధీశబలంబు బెఱింగి కృతదోస్స్ఫాలుండు సోత్కంఠనో
ద్ధతుఁడై జ్యానినదంబునన్ భయదుఁడై దైత్యేశనానాశుగా
దృతహస్తుం డగువీరరాముని భజింతున్ స్వాంతమం దెప్పుడున్.

తా. ఇంద్రునిచేత నీఁబడినట్టి టెక్కెముతోఁగూడినట్టి యాయింద్రునిరథమం దున్నట్టియు వేడుకతోఁ గూడుకొన్నట్టియు రాక్షసపరాక్రమము నెఱిఁగి చేయి చఱచి సారథితోఁగూడునట్లుగా రావణుని సంహరించునట్టి యంబులపొదియందున్న బాణమునుబూని ధనుష్టంకారమువలన శత్రుభయముఁజేయు వీరుఁడగు రాముని సేవించుచున్నాను.

శ్లో. రుచిరమణికిరీటం సుందరభ్రూలలాటం
కనకరుచిరచేలం శేషసద్భోగఖేలమ్
విమలజలదనీలం కుండలోద్భాసికర్ణం
రఘుకులజనరత్నం సంతతం చింతయామి. 21

చ. సురుచిమణీకిరీటు నతిసుందరభవ్యలలాటు గాంచన
స్ఫురితవిశాలచేలు ఫణిపుంగవభోగవిభోగఖేలు కం
ధరనిభనీలు సన్మణివితానవిరాజితకుండలద్వయున్
సరసిజమిత్రవంశమణి సంతత మెంతు హృదంతరంబునన్.

తా. సుందరమగు మాణిక్యకిరీటము గలిగినట్టియు సొగసైనకనుబొమలు లలాటము గలిగినట్టియు బంగారుచే సొగసైనబట్ట గలిగినట్టియు శేషునిదేహమందు విహరించుచున్నట్టియు నిర్మలమేఘమువలె నల్లనైనట్టియుఁ గుండలములచేఁ బ్రకాశించునట్టి కర్ణములు గలిగినట్టియు రఘువంశమనుష్యులలో శ్రేష్ఠుఁడైనరాము నెల్లప్పుడు ధ్యానించుచున్నాను.

శ్లో. శ్రీవత్సాంక ముదారకౌస్తుభలసత్పీతాంబరాలంకృతం
నానారత్నవిరాజమానమకుటం నీలాంబుదశ్యామలమ్
కస్తూరీఘనసారచర్చితతనుం మందారమాలాధరం
కందర్పాయుతసుందరం రఘుపతిం సీతాసమేతం భజే. 22

మ. వనదశ్యామలదివ్యవిగ్రహుని శ్రీవత్సాంకుఁ బీతాంబరుం
ఘనసారాంతమృగీమదాంచితు లసత్కందర్పసౌందర్యుఁ గాం
చనరత్నోజ్జ్వలసత్కిరీటు విబుధక్ష్మాజస్రజుం సంస్మితా
నను సీతాయుతుఁ గౌస్తుభద్యుతిజగన్నాథుం హరిం గొల్చెదన్.

తా. శ్రీవత్సచిహ్నము గలిగినట్టియు గొప్పకౌస్తుభముచేఁ బ్రకాశించుచున్న పీతాంబరముచేత నలంకరించఁబడినట్టియు బహురత్నములచేఁ బ్రకాశించునట్టి కిరీటము గలిగినట్టియు నల్లనిమేఘమువలె నల్లనైనట్టియు కస్తూరిచేతను గర్పూరముచేతను బూయఁబడిన దేహము గలిగినట్టియు మందారమాలికను ధరించినట్టియు బహుమన్మథులవలె సుందరుఁడైనట్టియు సీతతోఁగూడిన శ్రీరాముని సేవించుచున్నాను.

శ్లో. యన్నామైవ సహస్రనామసదృశం యన్నామ వేదైస్సమం
యన్నామాంకితవాక్య మాసురబలస్త్రీగర్భవిచ్ఛేదనమ్
యన్నామశ్వపచార్యభేదరహితం ముక్తిప్రదానోజ్జ్వలం
తన్నామాలఘురామరామరమణం శ్రీరామనామామృతమ్. 23

ఉ. ఏవిభుపేరు వేదసమ మెన్న సహస్రసమాఖ్యసన్నిభం
బేవిభునామకీర్తన రహిం దనుజాంగనగర్భభేదనం
బేవిభునామ మెన్నఁగ మహిం శ్వపచార్యవిభేదవర్జితం
బేవిభుపేరు ముక్తిద మదెంతు సుధాదము రామనామమున్.

తా. ఏపేరు సహస్రనామములతోఁ సమమో యేపేరు వేదములతోఁ సమమో యేపేరుచే నలరించఁబడినవాక్యము రాక్షసస్త్రీగర్భములను ఛేదించునో యేపేరు చండాలులు యోగ్యులు ననుభేదములేనిదై యెల్లపుడు ముక్తినిచ్చునో అట్టిప్రసిద్ధమైన గొప్పది యగునట్టి మిక్కిలి మనోహరమైనవానిలో సంతోషకరమైన రామనామామృతమును దలంతును.

శ్లో. రామం రాక్షసమర్దనం రఘువరం దైతేయవిధ్వంసినం
సుగ్రీవేప్సితరాజ్యదం సురపతేర్భీత్యంతకం శార్ఙ్గిణమ్
భక్తానామభయప్రదం భయహరం పాపౌఘవిధ్వంసినం
సామీరిస్తుతపాదపద్మయుగళం సీతాసమేతం భజే. 24

మ. రవిపుత్రేప్సితరాజ్యదుం రఘువరున్ రక్షఃకులధ్వంసకున్
దివిజాధీశ్వరభీతిసంహరు శ్రితార్తిఘ్నుం మహాపాపవ

ర్గవినాశుఁ ధరణీసుతాసహితు శ్రీరాముఁ బరంధాముని
బవమానాత్మజసేవితాంఘ్రికమలుఁ • భావింతు శార్ఙ్గిన్ హరిన్.

తా. రాక్షసులను మర్దించునట్టియు రఘువంశశ్రేష్ఠుఁడైనట్టియు దితిపుత్త్రులైన రాక్షసభేదములను నశింపఁజేయునట్టియు సుగ్రీవుని కిష్టమైనరాజ్యము నిచ్చునట్టియు నింద్రునిభయమునను సంహారకుఁడైనట్టియు శార్ఙ్గధనుస్సు గలిగినట్టియు భక్తుల కభయ మిచ్చునట్టియు భయమును హరించునట్టియుఁ బాపసముదాయమును బోఁగొట్టునట్టియు నాంజనేయునిచే స్తోత్రముచేయఁబడిన పాదపద్మద్వంద్వము గలిగినట్టియు సీతతోఁ గూడినరాముని సేవించుచున్నాను.

శ్లో. రామం రక్తసరోరుహాక్షమమలం లంకాధినాథాంతకం
కౌసల్యానయనోత్సుకం రఘువరం నాగేంద్రతల్పస్థితమ్
వైదేహీకుచకుంభకుంకుమరజోలంకారహారం హరిం
మాయామానుషవిగ్రహం రఘుపతిం సీతాసమేతం భజే. 25

శా. కౌసల్యానయనోత్సుకున్ విమలు లం•కానాథవిధ్వంసినీ
తాసాధ్వీకుచకుంకుమాంకితలస•ద్వక్షున్ సరోజేక్షణున్
దాసస్తోత్రు భుజంగతల్పు నరనా•థస్వామి శ్రీరామునిన్
నాస్వామిన్ రఘునాయకున్ దలఁచెద • న్మాయామనుష్యాకృతిన్.

తా. ఎఱ్ఱదామరలవంటి నేత్రములుగలిగినట్టి నిర్మలుఁడైనట్టియు రావణునికి యముఁడైనట్టియు కౌసల్యాదేవియొక్క నేత్రముల కానందకరుఁడైనట్టియు రఘువంశ శ్రేష్ఠుఁడైనట్టియు శేషశయ్యయందున్నట్టియు సీతయొక్క కలశములవంటి స్తనముల యందలి కుంకుమపరాగ మలంకారముగలహారములు గలిగినట్టియు విష్ణురూపుఁడైనట్టి మాయామనుష్యదేహము గలిగినట్టి సీతతోఁగూడిన రఘునాథుని సేవించుచున్నాను.

శ్లో. రామం హేమతటిత్ప్రభాంశుకధరం వీరాసనే సంస్థితం
బాలం నీలమణిప్రభం మధురిపుం దైత్యేంద్రగర్వాపహమ్
విశ్వామిత్రవసిష్ఠవానరవరైస్సంసేవ్యమానం సదా
నిత్యం భాస్కరచంద్రకోటిసదృశం సీతాసమేతం భజే. 26

మ. వరవీరాసనసంస్థితున్ మధురిపున్ • వైదేహిసంయుక్తు సుం
దరవిద్యుత్ప్రభుఁ గాంచనాంబరధరున్ • దైత్యేంద్రగర్వాపహున్
వరదున్ భాస్కరచంద్రకోటినిభు వి•శ్వామిత్రవైరించ వా
నరసంసేవితు బాలు నీలసదృశున్ • రామప్రభున్ గొల్చెదన్.

తా. బంగారువికారమైనట్టి మెఱుపువంటికాంతిగల వస్త్రమును ధరించినట్టియు పీఠాసనమందున్నట్టియు బాలుఁడైనట్టియు నింద్రనీలముల కాంతివంటికాంతి గలిగినట్టియు మధ్వాసురునిశత్రుఁడైనట్టియు రాక్షసగర్వమును హరించినట్టియు విశ్వామిత్రునిచే వసిష్ఠునిచే వానరులచే నెల్లపుడు సేవించఁబడుచున్నట్టియు బహుసూర్యచంద్రులతోఁ దుల్యుఁడైనట్టియు సీతతోఁగూడినరాముని సేవించుచున్నాను.

శ్లో॥ శత్రుఘ్నో వ్యజనాంకితోపి భరతః పార్శ్వద్వయే పశ్చిమే
ఛత్రం చామరసంయుతం కలితవాన్ యం సేవతే లక్ష్మణః
మూలే కల్పతరో ర్విభూనవిలసన్మాణిక్యసింహాసనే
పద్మాస్యం మునిసేవితం రఘుపతిం సీతాసమేతం భజే. 27

శా॥ మందారాంతికపుష్పకాంతివిలసన్మాణిక్యసింహాసనం
బందుం జామరపుండరీకధరులై సానందులై భ్రాతలిం
పొందం గొల్వ మునుల్ భజింపఁ జెలువిం పొందం బ్రకాశించు నా
నందబ్రహ్మము రామచంద్రుఁ గొలుతుం నాళీకవక్త్రుం హరిన్.

తా. కల్పవృక్షము మొదటఁ బ్రకాశించుచున్న మణిపీఠమందున్న యేరాముని వింజామరలతోఁగూడిన శత్రుఘ్నుఁడును భరతుఁడును రెండుప్రక్కలయందును ఆవింజామరలతోఁ గలసినగొడుగును లక్ష్మణుఁడు పూనినవాఁడగుచు వెనుకను ఉండి సేవించుచున్నాఁడో అట్టిపద్మమువంటి మొగము గలిగినట్టియు ఋషులచే సేవించఁబడుచున్నట్టియు సీతతోఁగూడినరఘునాథుని సేవించుచున్నాను.

శ్లో॥ వామాంకోపరితప్తకాంచననిభం సీతాసమాలోకితం
హస్తాభ్యాం ధృతఛత్రచామరమహాసౌమిత్రిణా సేవితమ్
నిత్యం పూజితపాదపద్మయుగళం దైవై స్సురేంద్రాదిభిః
సేవ్యం మానుషరాక్షసైః కపివరైః శ్రీరామచంద్రం భజే. 28

మ॥ సతతంబుం వ్యజనాతపత్రధరుఁడై సౌమిత్రి గొల్వంగ సం
తత మింద్రాదిసుపర్వు లంఘ్రికమలద్వంద్వంబుఁ బూజింప నా
శ్రితదైతేయకపీంద్రమర్త్యతతి సంసేవింప వామాంకసం
స్థితశృంగారధరాకుమారిఁ గను నా శ్రీరాము సేవించెదన్.

తా. ఎడమతొడపైఁ బుటము వేసిన బంగారముతో దుల్యురాలైన సీతం జూచుచున్నట్టియు చేతులచేఁ బట్టఁబడిన ఛత్రచామరముగల లక్ష్మణునిచే సేవింపఁబడి

నట్టియు నింద్రాదిదేవతలచే నెల్లప్పుడు సేవింపఁబడిన పాదపద్మద్వయము గలిగినట్టియు మనుష్యులచే రాక్షసులచే వానరులచే సేవించఁదగినరామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. కస్తూరీతిలకం కపీంద్రహరణం కారుణ్యవారాన్నిధిం
క్షీరాంభోధిసుతాముఖాబ్జమధుపం కళ్యాణసంపన్నిధిమ్
కౌసల్యానయనోత్సుకం కపివరత్రాణం మహాపౌరుషం
కౌమారప్రియ మర్కకోటిసదృశం సీతాసమేతం భజే. 29

శా. కౌసల్యానయనోత్సుకుఁ సరసిజాగారాననాబ్జాళికై
లాసాధీశ్వరమిత్రునిఁ మృగమదాలంకారఫాలస్థలుఁ
రాసూనుఁ రవికోటితుల్యుఁ గపివర్యత్రాణు భవ్యాత్ము సీ
తాసాధ్వీయుతుఁ గాలభేదిఁ గొలుతుఁ దాంతుఁ మహాపౌరుషున్.

తా. కస్తూరిబొట్టుగలిగినట్టియు వాలిని హరించినట్టియు దయాసముద్రుఁడైనట్టియు లక్ష్మియొక్క ముఖపద్మమునకుఁ దుమ్మెదయైనట్టియు శుభసంపదలకు నిధియైనట్టియు కౌసల్యాదేవియొక్క నేత్రముల కుల్లాసముఁజేయునట్టియు సుగ్రీవుని రక్షించినట్టియు గొప్పపరాక్రమము గలిగినట్టియు కౌమారావస్థచే సంతోషింపఁజేయునట్టియు బహుసూర్యులతోఁ దుల్యుఁడైనట్టియు సీతతోఁగూడినరాముని సేవించుచున్నాను.

శ్లో. విద్యుత్కోటిదివాకరద్యుతినిభం శ్రీకౌస్తుభాలంకృతం
యోగీంద్రైస్సనకాదిభిః పరివృతం కైలాసనాథప్రియమ్
ముక్తారత్నకిరీటకుండలధరం గ్రైవేయహారాన్వితం
వైదేహీకుచసన్నివాస మనిశం సీతాసమేతం భజే. 30

మ. ఇనసౌదామినికోటికోటినిభు గౌరీశప్రియుఁ రత్నకాం
చనగ్రైవేయకిరీటకుండలవిరాజత్కౌస్తుభాలంకృతుఁ
సనకాదిప్రకటప్రభావయతిసన్మాన్యుఁ ధరాపుత్రికా
స్తనకుంభాంచితకుంకుమాంకితుని సీతారాముఁ బ్రార్థించెదన్.

తా. కోటి మెఱుపులయొక్కయు సూర్యునియొక్కయు కాంతితోసమానుఁడైనట్టియు శోభాయుక్తమగు కౌస్తుభముచే నలంకరించఁబడినట్టియు సనకాదియోగిశ్రేష్ఠులచేఁ జుట్టు వారఁబడినట్టియు శివునికిష్టుఁడైనట్టియు ముత్యములు రత్నములు ప్రధానముగల కిరీటము కుండలములు ధరించునట్టియుఁ గంఠాలంకారముల తోహారముల తోఁ గూడినట్టియు సీతయొక్క కుచములయందు నివాసము గలిగినట్టియు సీతతోఁగూడినరాము నెల్లప్పుడు సేవించుచున్నాను.

శ్లో. విద్యుత్కోటిసహస్రభానుసదృశం సింహాసనే సంస్థితం
మూలేకల్పతరోర్మహామణిమయే భాసం పరేశం విభుమ్
సుగ్రీవాంగదజాంబవాదిహరిభిః సంసేవ్యమానం హరిం
శంభుబ్రహ్మసురాదిభిః పరివృతం సీతాసమేతం భజే. 31

మ. దివిజానోకహసన్నికృష్టవిలసత్సింహాసనాసీనుఁ డై
రవిసాహస్రనికోటికోటినిభుఁ డై బ్రహ్మేశముఖ్యామల
స్తవుఁ డై వాయుజభానుజాదికపిసంతానార్చితుం డై నరా
ఘవు సీతాన్వితు రామచంద్రు పదసత్కంజంబు లర్చించెదన్.

తా. కోటి మెఱుపులతోడను వేయిసూర్యులతోడను సమానుఁ డైనట్టియు కల్పవృక్షముయొక్క మొదట మాణిక్యవికారమైన పీఠమందున్నట్టియు తేజోరూపుఁ డైనట్టియుఁ బరమేశ్వరుఁ డైనట్టియు సమర్థుఁ డైనట్టియు సుగ్రీవుఁడు, అంగదుఁడు, జాంబవంతుఁడు మొదలగువానరులచే సేవింపఁబడుచున్నట్టియు విష్ణురూపుఁ డైనట్టియు శివ బ్రహ్మ దేవాదులచేఁ జుట్టువారఁబడినట్టియు సీతతోఁగూడినరాముని సేవించుచున్నాను.

శ్లో. మేఘశ్యామలమంబుజాతనయనం విస్తీర్ణవక్షస్స్థలం
బాహుద్వంద్వవిరాజితం సువదనం శోణాంఘ్రిపంకేరుహం
నానారత్నవిచిత్రభూషణయుతం కోదండబాణాంకితం
త్రైలోక్యాప్రతిమానసుందరతనుం సీతాసమేతం భజే. 32

మ. సరసీజాయతనేత్రుఁ దోయజవిరాజద్గాత్రు శోణాంఘ్రిపం
కరుహుఁ దీర్ఘకరుఁ విశాలతరవక్షస్థాను నానామణి
స్ఫురితాకల్పవిభూషితుఁ సువదను న్భూపుత్రికాధీశ్వరు
న్వరకోదండధరు న్త్రిలోకవిలసత్సౌందర్యు సేవించెదన్.

తా. మేఘమువలె నల్లనైనట్టియు పద్మములవంటికన్నులు గలిగినట్టియు విశాలమైన వక్షస్స్థలము గలిగినట్టియు రెండుచేతులచేఁ బ్రకాశించుచున్నట్టియు మంచిమోము గలిగినట్టియు నెఱ్ఱని పాదపద్మములు గలిగినట్టియుఁ బలుతెఱంగురత్నములచేఁ జిత్రములగు నలంకారములతోఁగూడినట్టియు ధనుర్బాణములచేఁ జిహ్నితుఁ డైనట్టియు మూఁడులోకములయందు సామ్యములేని సుందరదేహము గలిగినట్టియు సీతతోఁగూడినరాముని సేవించుచున్నాను.

శ్లో. దివ్యారణ్యయుతేంద్రనామనగరే మధ్యే మహామంటపే
స్వర్ణస్తంభసహస్రషోడశయుతే మందారమాలాశ్రితే

నానారత్నవిచిత్రనిర్మలమహాసింహాసనే సంస్థితం
సీతాలక్ష్మణసేవితం రఘుపతిం సీతాసమేతం భజే. 33

మ. విదితారణ్యయతీంద్రనామనగరిన్ ♦ వెల్గొందు కల్పస్థలిన్
బదియార్వన్నెపసిండికంబములచే ♦ భాసిల్లు సౌధంబునం
దుదయార్కద్యుతిపీఠమధ్యమమునం ♦ దుర్వీతనూజాత నె
మ్మది సౌమిత్రియుఁ గొల్వఁ జెల్వలరు రా♦మస్వామిఁ బ్రార్థించెదన్.

తా. ప్రశస్తమైన అరణ్యయతీంద్ర నామ మగుపట్టణమున గొప్పమంటపమందు మధ్యభాగమందు పదియారు వేలబంగారు స్తంభములతోఁ గూడినట్టి మందారవృక్షమూలముం బొందినట్టి బహురత్నచిత్రమైన నిర్మలసింహాసనమందున్నట్టియు సీతాలక్ష్మణులచే సేవింపఁబడినట్టియు సీతతోఁగూడినరఘునాథుని సేవించుచున్నాను.

శ్లో. యత్పాదాంబుజసంభవా త్రిపథగా భాగీరథీ ముక్తిదా
లోకానాం హృతకిల్బిషా భగవతీ మందాకినీ శాంభవీ
లోకేభాతి సరస్వతీ సురనదీ పుణ్యేందుకాంతిప్రభా
తం విష్ణుం భరతాగ్రజం రఘువరం సీతాసమేతం భజే. 34

మ. భవపధ్వంసిని ముక్తిదన్ ద్రిపథగన్ ♦ భాగీరథిన్ శాంభవిన్
దివిజహ్లాదిని శారదన్ భగవతి ♦ న్నీలోత్పలాప్తప్రభన్
భవుకాత్మన్ గనె పాదపద్మమున నే♦ పద్మాక్షుఁ డావిష్ణు రా
ఘవు సీతాన్వితు రామచంద్రవిభు ప♦త్కంజంబు లర్చించెదన్.

తా. ఎవనిపాదపద్మమందుఁ బుట్టినగంగ భగీరథునికూఁతురై ముక్తి నిచ్చునదియై లోకములపాపమును గొట్టివేయునదియై భగవత్స్వరూపయై మందాకినినామముగలదియై యీశ్వరునిభార్యయై సరస్వతీనదియై దేవనదియై పవిత్రమైనదియై చంద్రకాంతివంటికాంతి గలదియై లోకమందుఁ బ్రకాశించుచున్నదో అట్టి విష్ణుస్వరూపుఁడైనట్టియు భరతునియన్న యైనట్టియు సీతతోఁగూడిన రఘువంశశ్రేష్ఠుని సేవించుచున్నాను.

శ్లో. యత్పాదాంబుజరేణునా మునిసతీ ముక్తింగతా యన్మహా
పుణ్యాం పాతకనాశనం త్రిజగతాం భాతి స్మృతం పావనమ్
స్మృత్వా రాఘవ మప్రమేయ మమలం పూర్ణేందుమందస్మితం
తం రామం సరసీరుహాక్ష మమలం సీతాసమేతం భజే. 35

ఉ. ఏవిభుపాదరేణుకణ మించుక సోకి యహల్యశాపమున్
బోవిడనాడె సంస్మరణ పొందుగఁ జేసి కృతార్థయై జగ
త్పావని యంచుఁ గీర్తిఁ గనెఁ దత్సరసీరుహపత్రనేత్రు సీ
తావిభుఁ గైరవాప్తసమధామదరస్మితు రాముఁ గొల్చెదన్.

తా. ఎవని పాదపద్మమందలి ధూళిచేత గౌతమునిభార్య శాపవిమోచనమును బొందెనో ఎవని తేజస్సు పవిత్రమైనదియు స్మరింపఁబడినదియై పవిత్రముచేయునట్టిది యును నగుచు మూఁడులోకముల పాపనాశనముఁ జేయుచుఁ బ్రకాశించుచున్నదో అట్టి రఘువంశమందుఁ బుట్టినట్టియుఁ బ్రమాణించ శక్యముగానట్టియు నిర్మలుఁడైనట్టియుఁ బూర్ణచంద్రునివంటిమందహాసము గలిగినట్టియు పద్మములవంటికన్నులు గలిగినట్టియు నిర్మలుఁడైనట్టియు సీతతోఁ గూడినట్టి రాముని సేవించుచున్నాను.

శ్లో. వైదేహీకుచమండలాగ్రవిలసన్మాణిక్యహస్తాంబుజం
చంచత్కంకణహారనూపురలసత్కేయూరహారాన్వితమ్
దివ్యశ్రీమణికుండలోజ్జ్వలమహాభూషాసహస్రాన్వితం
వీరశ్రీరఘుపుంగవం గుణనిధిం సీతాసమేతం భజే 36

చ. జనకసుతాకుచోపరిలసన్మణిపాణిసరోజు రత్నకాం
చనమకుటాంగదాద్యఖిలచారువిభూషణభూషితాంగు స
జ్జననుతపాదపంకజు విశాలభుజాంతరు వీరరాఘవున్
దినమణివంశవర్ధను సతీయుతు నెంచి నమస్కరించెదన్.

తా. సీతయొక్క స్తనమండలముపైఁ బ్రకాశించుచున్న రత్నమైన హస్తపద్మము గలిగినట్టియుఁ బ్రకాశించుచున్న కంకణములు హారములు కాలికడియములు ప్రకాశించుచున్న భుజకీర్తులు హారవిశేషములు అనువానితోఁ గూడినట్టియు శ్రేష్ఠమైన మాణిక్యకుండలములతోడను బ్రకాశించుచున్న గొప్పయలంకారసహస్రముతోఁ గూడినట్టియు గుణములకు స్థానమైనట్టియు సీతతోఁగూడినట్టి రఘువంశశ్రేష్ఠుని సేవించుచున్నాను.

శ్లో. వైదేహీకుచమండలోపరిలసన్మాణిక్యహారావలీ
మధ్యస్థం నవనీతకోమలరుచిం నీలోత్పలశ్యామలమ్
కందర్పాయుతకోటిసుందరతనుం పూర్ణేందుబింబాననం
కౌసల్యాకులభూషణం రఘుపతిం సీతాసమేతం భజే. 37

మ. ధరణీపుత్త్రికుచోపరిప్రవిలసద్రత్నావళీమధ్యభా
సురపర్జన్యవినీలరత్నసదృశున్ సూనాస్త్రసాహస్రసం

దరుఁ బూర్ణేందునిభాననున్ రఘుపతిన్ • దైత్యాంతకున్ గోసలే
శ్వరపుత్రీకులభూషణున్ జనకజా•సంయుక్తుఁ బ్రార్థించెదన్.

తా. సీతయొక్క స్తనమండలముపైఁ బ్రకాశించుచున్న మణిహారపఙ్క్తిమధ్యమం దున్నట్టియు వెన్నవలె మృదువైనశోభఁ గలిగినట్టియు నల్లగలువవలె నల్లనైనట్టియు బహుఘనఘులవలె సుందరమైనశరీరము గలిగినట్టియుఁ బూర్ణచంద్రబింబమువంటి మోము గలిగినట్టియు కౌసల్యయొక్క కులమునకు (అనఁగా మాతామహవంశమునకు) అలంకారమైనట్టియు సీతతోఁగూడినట్టిరఘునాథుని సేవించుచున్నాను.

శ్లో. వైదేహీయుతవామభాగమతులం వందారుమందారకం
వందే ప్రస్తుతకీర్తివాసితతరుచ్ఛాయానుకారిప్రభమ్
వైదేహీకుచకుంకుమాంకితమహోరస్కం మహాభూషణం
వేదాంతైరుపగీయమానమసకృత్సీతాసమేతం భజే. 38

మ. ధరణీజాన్వితవామభాగు విమలున్ • దాసామరానోకహున్
సరసున్ బ్రస్తుతకీర్తివాసితతరు•చ్ఛాయానుకారిన్ ధరా
వరపుత్రీకుచకుంకుమాంకితలస•ద్వక్షున్ మహాభూషణున్
వరవేదాంతనిరంతరస్తుతు విభున్ • వర్ణింతు సీతాయుతున్.

తా. సీతతోఁగూడిన యెడమపార్శ్వము గలిగినట్టియు సామ్యములేనట్టియు నమస్కరించువారికిఁ గల్పవృక్షమైనట్టియు స్తోత్రముచేయఁబడినకీర్తిచేఁ బ్రకాశింపఁజేయఁబడినట్టియు చెట్టునీడను బోలినకాంతిగలిగినట్టియు సీతయొక్క స్తనములయందలి కుంకుమచేఁ జిహ్నితమైన గొప్పవక్షస్థలము గలిగినట్టియు గొప్పఅలంకారములు గలిగినట్టియు ఉపనిషత్తులచే నుతింపఁబడుచున్నట్టియు సీతతోఁగూడిన రామునిఁ బలుమాఱు సేవించుచున్నాను.

శ్లో. వైదేహీస్తనకుంభసంభ్రమపరీరంభాదృతం సింధుగం
రాకాచంద్రనిభాననం రఘువరం రాజీవపత్రేక్షణమ్
ప్రావృణ్మేఘనిభద్యుతిం స్మితయుతం హారావళీభూషితం
శ్రీరామం ప్రణమామి భక్తజనతాచింతామణిం సంతతమ్. 39

మ. రమణీయావనిజాపయోధరపరీ•రంభున్ సముద్రస్థితున్
గమలాత్మున్ హసితాననున్ వరదు రా•కాచంద్రబింబాస్యు ర
త్నమయోద్యోతవిభూషణున్ రఘువరున్ • దాసామరానోకహున్
విమలస్తవ్యఘనాఘనాంగు మది భా•వింతున్ గృపాకాంక్షినై.

తా. సీతయొక్క స్తనకలశములయొక్క తొందరచేతనైన యాలింగనమం దాదరము గలిగినట్టియు సముద్రమును బొందినట్టియు (అనఁగా సముద్రశయనుఁడనుట) పూర్ణచంద్రునితో సమానమగు మొగము గలిగినట్టియు రఘుశ్రేష్ఠుఁడైనట్టియు పద్మము రేకులవంటికన్నులు గలిగినట్టియు వర్షాకాలమేఘముతోఁ దుల్యమగుకాంతి గలిగినట్టియుఁ జిఱునవ్వుతోఁగూడినట్టియు హారపఙ్క్తులచే నలంకరింపఁబడినట్టియు భక్తసమూహమునకుఁ జింతారత్నమైనట్టిరాము నెల్లపుడు నమస్కరించుచున్నాను.

శ్లో. వైదేహీరమణీ హిరణ్యతిలకం విశ్వంభరాపాలకం
వర్ధిష్ణుం వివిధాయుధేషు నిపుణం విద్వజ్జనశ్రీకరమ్
విద్యావాసగృహం వియచ్చరనుతం విద్యుత్ప్రకాశాంబరం
విప్రత్రాణవిధేయ మాదిపురుషం శ్రీరామచంద్రం భజే. 40

మ. క్షితిపుత్రీరమణుఁ హిరణ్యతిలకుఁ శ్రీరాము వర్ధిష్ణు ర
క్షితవిశ్వంభరు దేవతావినుతు రాజీవాక్షు విప్రావనుఁ
దతవిద్వజ్జనశ్రీకరుఁ సకలవిద్యావాసు సౌదామినీ
ద్యుతిచేలుఁ వివిధాస్త్రశస్త్రనిపుణుఁ దోషాపహుఁ గొల్చెదన్.

తా. సీతకుబంగారుబొట్టుగాఁ గలిగినట్టియు భూమిని బాలించునట్టియు వృద్ధిఁ బొందునట్టియు సమస్తాయుధములయందు నేర్పరియైనట్టియు విద్వాంసులకు శోభను జేయునట్టియు విద్యలకు నివాసస్థానమైనట్టియు దేవతలచే స్తోత్రముచేయఁబడినట్టియు మెఱుపువంటి శోభగలవస్త్రము గలిగినట్టియు బ్రాహ్మణసంరక్షణమునకు నధీనుఁడైనట్టియు నాదిపురుషుఁడైన శ్రీరామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. వైదేహీవశవర్తినం రణజితం రత్నాకరాగారిణం
వజ్రగ్రీవ మదాపహం పటుభుజం వద్మాస్తకోటిప్రభమ్
విష్ణుం జిష్ణు మవార్యశౌర్యనిలయం నీలాంబుదశ్యామలం
రత్నాలంకరణాన్వితం రఘుపతిం శ్రీరామచంద్రం భజే. 41

మ. అవనీజావశవర్తి జిష్ణు రఘురాణ్మాధీశు దోస్సారునిఁ
రవికోటిద్యుతినీలనీరదనిభుఁ రత్నాకరాగారు రా
ఘవు సర్వాత్ము నవార్యశౌర్యుఁ గనకాకల్పోజ్జ్వలుఁ బజ్రకం
ఠవినిర్భేదను విష్ణునిఁ హృదయపీఠంబందు భావించెదన్.

తా. సీతకు వశమైయుండునట్టియు యుద్ధమందు జయించునట్టియు సముద్రము గృహము గలిగినట్టియు రావణమదమును గోసివేసినట్టియు సమర్థములైన హస్తములు

గలిగినట్టియు కోటిసూర్యులకాంతి గలిగినట్టియు వ్యాపకస్వభావుఁడును జయస్వభావుఁడునై నట్టియు అడ్డగింపశక్యముగాని శౌర్యమునకు స్థానమైనట్టియు నల్లమేఘమువలె నల్లనైనట్టియు రత్నాలంకారములతోఁగూడినట్టియు రఘుపతియగు శ్రీరామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. దేవానాం హితకారణేనభువనే ధృత్వావతారం ధ్రువం
రామం కౌశికయజ్ఞవిఘ్నదళనం తాటకాసంహారమ్
నిత్యం గౌతమపత్నిశాపదళన శ్రీపాద రేణుం శుభం
శంభోరుత్కటచాపఖండనమహాసత్వం భజే రాఘవమ్. 42

చ. అమరహితార్థమై ధరణిఁ యందవతారముఁ దాల్చి తాటకన్
సమయఁగఁ జేసి గాధిసుతసత్త్రవిఘాతుల సంహరించి ప
త్కమలపరాగరాజిమునికాంతకు శాపముఁ బాపి శంభుచా
పము నవలీలఁ ద్రుంచినశుభంకరు రాఘవు నాశ్రయించెదన్.

తా. దేవతల కిష్టముఁ జేయుట యను హేతువు చేత భూమియం దవతారముధరించి శాశ్వతుఁడైనట్టియు విశ్వామిత్రయజ్ఞవిఘ్నమును బోఁగొట్టినట్టియుఁ దాటకను సంహరించునట్టియు అహల్యాశాపమును గొట్టివేసిన పాదధూళి గలిగినట్టియు శుభస్వరూపుఁడైనట్టియు శివునిగొప్పధనుస్సు ఖండించినట్టి గొప్పబలము గలరాముని సేవించుచున్నాను.

శ్లో. రాజీవనేత్ర రఘుపుంగవ రామభద్ర
రాకేందుబింబసదృశాననీలగాత్ర
రామాభిరామ రఘువంశసముద్భవత్వం
శ్రీరామచంద్ర మమదేహి కరావలంబమ్. 43

ఉ. సారసపత్రనేత్ర రఘుసత్తమ నీరదనీలగాత్ర శృం
గారనిధీశరచ్ఛశివికాసితవక్త్ర మహాత్మ రాఘవా
శ్రీరఘువంశవార్ధిమణి శ్రీరమణీముఖపద్మభాస్కరా
ధీరజనావనా రఘుపతీ యభయంబు నొసంగవే దయన్.

తా. పద్మమువంటి కన్నులుగలవాఁడా! రఘుశ్రేష్ఠుఁడా! పూర్ణచంద్రబింబములతో సమమగు ముఖముగలవాఁడా! నల్లని దేహముగలవాఁడా! సుందరులలో సుందరుఁడా! రఘువంశమందుఁ బుట్టినవాఁడా! రామచంద్రా! రామభద్రా! నాకుఁ జేయూఁతనిమ్ము.

శ్లో. ముకురరుచిరగండం పుండరీకాభతుండం
కరికరభుజదండం రౌద్రతేజోగ్నికుండమ్
నమితభువనషండం ఖేదితోగ్రారిమండం
గుణనికరకరండం నౌమిరామప్రచండమ్. 44

మ. ఘనరౌద్రజ్వలదగ్నికుండనిభు రక్షఃప్రాణవిధ్వంసకున్
ఘనసద్బాహుని తుండితుండసమదోర్దండప్రచండున్ సరో
జనినాభున్ ముకురాభగండయుగళున్ సర్వాత్ము సర్వప్రపం
చనతాంఘ్రిద్వయు సద్గుణాకరు రఘుస్వామిన్ మదిన్ గొల్చెదన్.

తా. అద్దములవలె సుందరములైన చెక్కులు గలిగినట్టియు పద్మశోభగల ముఖము గలిగినట్టియు ఏనుఁగుతొండములవంటిచేతులు గలిగినట్టియు భయంకరముగా నుండుతేజస్సునకగ్నికుండమైనట్టియు నమస్కరించుచున్నలోకసమూహము గలిగినట్టియు బ్రద్దలుచేయఁబడిన భయంకరశత్రుమండలము గలిగినట్టియు గుణసమూహమునకు గనియైనట్టియుఁ దీక్ష్ణరూపుఁడైనరాముని నమస్కరించుచున్నాను.

శ్లో. కోదండకాండవినివేశితబాహుదండ
మాఖండలాద్యమరవర్షితపుష్పవర్షమ్
ఆయోధనస్థితరజఃపరిధూసరాంగ
మప్యూర్జితం రఘువరేంద్ర మరిప్రభేదమ్. 45

మ. దనుజాధీశవిదారియై ప్రకటయుద్ధక్ష్మాపరాగోల్లస
త్తనుఁడై వాసవముఖ్యదేవతలు మందారప్రసూనప్రవృ
ష్టిని వర్షింప శరాసనాగ్రకరుఁడై చెల్వొంద సూర్యాన్వవా
యనదీశోత్పలమిత్రు రామవిభు సీతాధీశుఁ బ్రార్థించెదన్.

తా. ధనుర్దండమంగుంచఁబడిన భుజాదండము గలిగినట్టియు నింద్రుఁడు మొదలగు దేవతలచే వర్షింపఁబడిన పువ్వులవాన గలిగినట్టియు యుద్ధమందున్నధూళిచే మలినమగుదేహము గలిగినట్టియు బలము గలిగినట్టియు శత్రువులను ఛేదించునట్టి రఘుశ్రేష్ఠునిఁ గొలుచుచున్నాను.

శ్లో. సేవ్యం శ్రీరామమంత్రం శ్రవణశుభకరం శ్రేష్ఠసుజ్ఞానిమంత్రం
స్తవ్యం శ్రీరామమంత్రం నరకదురితదుర్వారనిర్ఘాతమంత్రమ్
భవ్యం శ్రీరామమంత్రం భజతా భజతు సంసారనిస్తారమంత్రం
దివ్యం శ్రీరామమంత్రం దివిభువివిలసన్మోక్షరక్షైకమంత్రమ్. 46

చ. శ్రవణశుభంకరంబు పటు•సంసృతిపాపనివారణంబు రౌ
రవముఖహేతుదుష్కృతనికారకరంబు రిపుప్రహారసు౯
భువిదివిను ప్రకాశితము • మోక్షనిదానము౯ సువివేకకారణం
బవు రఘురామనాయకసు•హాసమనుజపము మొనర్తు నిత్యమున్.

తా. సేవింపఁదగినట్టియుఁ జెవులకు సుఖముగ జేయునట్టియు శ్రేష్ఠజ్ఞానులచేఁ స్తుతమైనట్టియు స్తోత్రముఁజేయఁదగినట్టియు నరకముఖములకుఁ బాపములకు నివారించి రెక్క మూగాని పీడు గెనట్టియు క్షేమకరమైనట్టియు సంసారము దాఁటించునట్టియు శ్రేష్ఠమైనట్టియు భూమ్యాకాశములయందలి వారికి మోక్షరూపసంరక్షణమునకు ముఖ్యమైన శ్రీరామమంత్రమును జనము సేవింపుఁగాక! సేవింపుఁగాక!

శ్లో. ఆజానుబాహు మరవిందదళాయతాక్షం
రాజాధిరాజ మఘురాజితసుప్రతంగమ్
శ్రీజానకీముఖసరోరుహమత్తభృంగం
శ్రీనాయకం హృది భజామి కృపాంతరంగమ్. 47

మ. అరవిందాయతపత్రనేత్రు వరక•ల్యాణాంగు శ్రీజానకీ
తరుణీవక్త్రసరోజమత్తమధుపు౯ • దైత్యారి నాజానుబా
హు రమేశు౯ గుణసాంద్రకారరవినా•దిత్యు౯ కృపాంభోధిసం
దరుశి౯ రాజలలాము రామవిభు నా•నందనంబునం గొల్చెదన్.

తా. మోకాళ్లపర్యంతము భుజములు గలిగినట్టియు పద్మములవంటి కన్నులు గలిగినట్టియు శుభమగుదేహము గలిగినట్టియు రాజులకు రాజైనట్టియుఁ బాపపంక్తి యను చీకటికి సూర్యుఁడైనట్టియు సీతాముఖపద్మమునకుఁ దుమ్మెదయైనట్టియు లక్ష్మికిఁ బెనిమిటియైనట్టియు దయాహృదయుఁడైన రాముని మనస్సున సేవించుచున్నాను.

శ్లో. ఏకేనబాణ మపరేణ కరేణ చాపం
హస్తాద్వహంత మనమానజటాశిరస్కమ్
సీతాసహాయ మనుజేన సమంచరంతం
శ్రీరామచంద్ర మనిశం కలయామి చిత్తే. 48

చ. కరయుగళ ప్రదీప్తశర•కార్ముకుఁడై రిపునాశకారుఁడై
స్ఫురితజటాశిరస్కుఁడయి • భూమిసుతాయుతుఁడై శ్రితార్తిసం
హరుఁడయి తారహారధరుఁ•డై సహలక్ష్మణుఁడై చరించును
స్థిరు రఘురాము సంస్మరణఁ • జేసి యభీష్టముఁ జెందు చిత్తమా.

తా. ఒకచేత బాణమును మఱియొకచేత ధనుస్సును సంతోషమువలన వహించుచున్నట్టియు గొప్పజటలు శిరస్సునఁ గలిగినట్టియు సీతకు సహాయుఁడైనట్టియుఁ దమ్మునితో సంచరించుచున్నట్టి శ్రీరామచంద్రు నెల్లపుడు చిత్తమందుఁ దలఁచుచున్నాను.

శ్లో. ఆమీలయన్ దశశిరోవదనాంబుజాత
మున్మీలయన్ జనకజానయనోత్పలేచ
ఆనందయన్ సకలజీవచకోరరాశిం
శ్రీరామచంద్రవిభు రస్తు మదీయచిత్తే. 49

చ. ఘనబలబాహుశౌర్యదశకంఠముఖాంబుజముల్ మొగుడ్ప భూ
తనయవిశాలనేత్ర కుముదద్వయముల్ వికసింప సర్వస
జ్జనపరచాతకావళికి సంభ్రమ మొప్ప సముల్లసింపఁజే
సినరఘురామచంద్రునుతిచే సఫలత్వము నొందు చిత్తమా.

తా. రావణ ముఖపద్మమును ముకుళింపఁజేయుచు సీతానేత్రపద్మములను వికసింపఁజేయుచు సమస్తప్రాణులనెడు చకోరపక్షులసమూహమును ఆనందింపఁజేయుచున్న శ్రీరామచంద్రప్రభువు నామనస్సునం దుండుఁ గాక.

శ్లో. రామం పురాణపురుషం రమణీయవేషం
రాజాధిరాజమకుటార్చితపాదపీఠమ్
సీతాపతిం సునయనం జగదేకవీరం
శ్రీరామచంద్ర మనిశం కలయామి చిత్తే. 50

ఉ. రాముఁ బురాణపూరుషుని రాజలలామకిరీటసన్మణి
స్తోమవిరాజమానపదతోయరుహద్వయు రమ్యవేషునిన్
భామరసాత్మజాపతిని తారమణిన్ జగదేకవీరు శ్రీ
రాము గుణాభిరాముని నిరంతరమున్ స్మరియింపు చిత్తమా.

తా. పూర్వపురుషుఁడైనట్టియు మనోహరవేషము గలిగినట్టియు రాజులకు రాజులైనవారికిరీటములచేఁ బూజింపఁబడినపాదపీఠము గలిగినట్టియు సీతకుఁ బెనిమిటి యైనట్టియు మంచినేత్రములు గలిగినట్టియు జగత్తులయందు ముఖ్యవీరుఁడైన రామచంద్రు నెల్లపుడు చిత్తమందుఁ దలఁచుచున్నాను.

శ్లో. సింహాసనస్థం సురసేవితవ్యం, రత్నాంకితాలంకృతపాదపద్మమ్
సీతాసమేతం శశిసూర్యనేత్రం, రామం భజే రాఘవరామచంద్రమ్.

మ. ఘనసింహాసనసంస్థితుఁ దివిజసంఘాతార్చితుఁ రత్నకాం
చనసందీపితపాదుకాంఘ్రికములుఁ క్ష్మాపుత్రికాసంయుతుఁ
వనజాతాప్తశశాంకనేత్రుఁ గరుణావర్ధిష్ణు రాముఁ సనా
తను దాసాంగణకల్పకద్రుమము సద్భక్తిఁ బ్రశంసించెదన్.

తా. సింహాసనమందున్నట్టియు దేవతలకు సేవించఁదగినట్టియు రత్నములచేత నలంకరింపఁబడిన పాదపద్మములుగలిగినట్టియు సీతతోఁగూడినట్టియు చంద్రసూర్యులు నేత్రములు గలిగినట్టియు రఘువంశరాజులను సంతోషింపఁజేయు చంద్రుఁడైనరాముని సేవించుచున్నాను.

శ్లో. సుగ్రీవమిత్రం సుజనానురూపం
లంకాహరం రాక్షసవంశనాశమ్
వేదాశ్రయాంగం విపులాయతాక్షం
రామం భజే రాఘవరామచంద్రమ్. 52

మ. సుజనానందకరుఁ విశాలనయనుఁ సుగ్రీవసన్మిత్రునిఁ
రజనీసంచరవంశవంశదహనుఁ రాజేంద్రు లంకాహరుఁ
విజయశ్రీలసితాంగు రామవిభు పృథ్వీపుత్రికానాయకుఁ
భజియింతుఁ నిరతంబు రాఘవపరబ్రహ్మంబు నిష్టాప్తికిన్.

తా. సుగ్రీవునికి స్నేహితుఁడైనట్టియు యోగ్యులకనుకూలుఁడైనట్టియు లంకను సంహరించినట్టియు రాక్షసవంశమును నశింపఁజేసినట్టియు వేదములకాధారమైన దేహముగలిగినట్టియు రాఘవరామచంద్రుఁడైనరాముని సేవించుచున్నాను.

శ్లో. అనంతకీర్తిం వరదం ప్రసన్నం, పద్మాననం సేవకపారిజాతమ్
రాజాధిరాజం రఘువీరకేతుం, రామం భజే రాఘవరామచంద్రమ్.

చ. అనుపమకీర్తిసాంద్రు నిరతాశ్రితసద్వరమహీజంబు విశ్వమో
హనుని సహస్రపత్రకముఖాననుఁ రాజలలాము రాఘవుఁ
ఘను రఘువీరకేతువఘుఘస్మరునిఁ వరదుఁ బరాత్పరుఁ
జననుతు రామభూవిభుఁ బ్రసన్నునిగా భజియింతు నెమ్మదిన్.

తా. అంతములేనికీర్తి గలిగినట్టియు వరములనిచ్చునట్టియు శాంతుఁడైనట్టియు పద్మమువంటి మొగముగలిగినట్టియు భక్తులకుఁ బారిజాతవృక్షమైనట్టియు రాజులకురాజైనట్టియు రఘువంశరాజులకుఁ బ్రధానుఁడైనట్టి రాఘవరామచంద్రుఁడైనరాముని సేవించుచున్నాను.

శ్లో. పద్మాసనస్థం సురసేవితవ్యం, పద్మాలయానందకటాక్షవీక్ష్యం
గాంధర్వవిద్యాధరగీయమానం, రామంభజే రాఘవరామచంద్రమ్.

మ. అసురస్తోమనతాంఘ్రిపద్మయుగసాహస్రారమధ్యస్థితున్
గమలానందకటాక్షవీక్షణపరున్ గంధర్వగానప్రియున్
విమలున్ రాఘవరామచంద్రు వరదున్ విశ్వాత్ము విశ్వంభరున్
సుమకాండాయుతసుందరున్ గొలిచెదన్ శుద్ధాంతరంగంబునన్.

తా. పద్మాసనమందున్నట్టియు దేవతలకు సేవింపఁదగినట్టియు లక్ష్మియొక్క ఆనందముతోఁ గూడిన క్రీఁగంటిచేఁ జూడఁదగినట్టియు గంధర్వులచే విద్యాధరులచే గానము చేయఁబడుచున్నట్టియు రాఘవరామచంద్రుఁడైనరాముని సేవించుచున్నాను.

శ్లో. అచింత్య మవ్యక్త మనంతరూప
మద్వైత మానంద మనాదిగమ్యమ్
పుణ్యస్వరూపం పురుషోత్తమాఖ్యం
రామం భజే రాఘవ రామచంద్రమ్. 55

చ. అనఘు నచింత్యు నవ్యయు ననంతు నమేయు ననాదిగమ్యు పా
వనసుచరిత్రు నద్వయు నవాఙ్మయు నచ్యుతు బుణ్యరూపునిన్
ఘను బురుషోత్తము న్వరము కారుణికున్ రఘురామచంద్రు స
జ్జననుతు రాఘవున్ వరదు సంతత మెంతు హృదంతరంబునన్.

తా. ఊహింప శక్యము గానట్టియు స్ఫుటము గానట్టియు అంతములేని రూపము గలిగినట్టియు రెండవవస్తువు లేనట్టియు నానందస్వరూపుఁడైనట్టియు మొదటినుండియుఁ బొంద శక్యము గానట్టియు పుణ్యరూపము గలిగినట్టియుఁ బురుషోత్తముఁడను పేరుగల రాఘవరామచంద్రుఁడగు రాముని సేవించుచున్నాను.

శ్లో. మందస్మితం కుండలగండభాగం
పీతాంబరం భూషణభూషితాంగమ్
నీలోత్పలాంగం భువనైకమిత్రం
రామం భజే రాఘవరామచంద్రమ్. 56

చ. దరహసితాననాంబురుహుఁ దప్తసువర్ణవినూత్నరత్నవి
స్ఫురితకిరీటకుండలవిభూషణభూషితు భవ్యకాంచనాం
బరుఁ గుముదాభగాత్రు మునివందితునిన్ భువనైకమిత్రు సు
స్థిరసుచరిత్రు రామవిభుఁ జిన్మయు రాఘవు నాశ్రయించెదన్.

తా. చిఱునవ్వు గలిగినట్టియు కుండలములు గండస్థలములయందుఁ గలిగినట్టియు పచ్చనిబట్ట గలిగినట్టియు అలంకారములచే నలంకరింపఁబడిన దేహము గలిగినట్టియు నల్లకలువలవంటిశరీరము గలిగినట్టియు లోకములకు ముఖ్యస్నేహితుఁడైన రాఘవరామచంద్రుఁ డగురాముని సేవించుచున్నాను.

శ్లో. డిండీరహాసమణికుండలచారుకర్ణ
దోర్దండశౌర్యజితభండనశౌర్యధీర
కోదండకాండపరిమండితపార్థివేంద్ర
వేదండయానజయ రాఘవరామచంద్ర. 57

చ. ఘనమణికుండలోల్లసిత • కర్ణ శరాసనకాండమండితుఁ
జనవరు గుంభిరాడ్గమను • శారదఫేనపటీరహాసు దు
ర్జనమదగర్వనిర్హరణ • చారుభుజాబలశౌర్యధుర్యు స
జ్జనసుతచర్యు రాము ననిశంబు నుతించెద నిష్టసిద్ధికిన్.

తా. నురుగువంటి నవ్వుగలవాఁడా! మాణిక్యకుండలములచే సుందరమయిన కర్ణములుగలవాఁడా! భుజపరాక్రమముచే జయింపఁబడిన యుద్ధముగలవాఁడా! శౌర్యముచేత ధైర్యముగలవాఁడా! ధనుర్దండముచే నలంకరింపఁబడినవాఁడా! రాజశ్రేష్ఠుఁడా! ఏనుఁగు నడకగలవాఁడా! రాఘవరామచంద్రా! సర్వోత్కృష్టుఁడవగుము.

శ్లో. లోకాన్ సప్తనినాదయన్ హరిహయస్యాంతర్భయం వర్ధయన్
సప్తానాంచ భువాం ప్రకంప ముదయన్ సప్తార్ణవాన్ ఘూర్ణయన్
ఉన్మీలాని రసాతలాని జనయన్ సప్తాపి పృథ్వీధరాన్
సుశ్రీరాఘవ బాహుదండవిదళత్కోదండచండధ్వనిః. 58

మ. తతసప్తాంబుధులున్ ధరిత్రీధరసంతానంబులున్ ఘూర్ణిలెన్
శతమన్యుం డతిభీతిఁజెందె బ్రబలెన్ • సప్తోర్ధ్వలోకంబు లా
యతవిభ్రాంతి నధోజగంబు జనము • ల్వ్యాలోలతం జెందె భూ
పతిరామాధిపబాహుదర్పదళన • ప్రధ్వంసచాపధ్వనిన్.

తా. రామునిభుజాదండముచే బద్ధమైన ధనుస్సుయొక్క తీక్ష్ణమైనధ్వని యేడులోకములను ధ్వనింపఁజేయుచు నింద్రునిచిత్తమందు భయమును వృద్ధిఁజేయుచు సప్తభూములకు వణఁకును బుట్టించుచు నేడుసముద్రములను గలఁచుచు పాతాళలోకములను సంహరించుచు సప్తకులపర్వతములను గదల్చుచు వ్యాపించెను.

శ్లో. బ్రహ్మాండం దళయన్ వియద్విదళయన్ భోగీశభోగస్థలే
సంత్రాసంజనయన్ సముద్రపటలీతోయం సముద్వేలయన్
దిక్పాలానపి క్షోభయన్ కులగిరౌ దీర్ణత్వమాపాదయన్
నక్షత్రాణిచ పాతయ న్విలసతే శౌరేర్ధనుర్జ్యారవః. 59

మ. తనకోదండగుణధ్వని న్నగిలె ఖస్థానంబు బ్రహ్మాండమున్
వనధుల్ పొర్లె దిగీశపజ్క్తి వణఁకెన్ వ్యాళేంద్రభోగంబు లె
ల్లను సంత్రాసము నొందె బర్వతములల్లాడె న్మహిం డుల్లె గ్ర
క్కున నక్షత్రము లట్టిరామవిభు గాఢోత్సుకత్వం బ్రశంసించెదన్.

తా. శ్రీరాముని వింటినారియొక్క ధ్వని బ్రహ్మాండమును బ్రద్దలుచేయుచు నాకాశమున బగులించుచు శేషునిపడగలయందు భయమును బుట్టించుచు సముద్రములనీటి ని ఒడ్డు దాటునట్లుగాఁజేయుచు దిక్పతులను క్షోభపెట్టుచు కులపర్వతములయందు బ్రద్దలగుటను సంపాదించుచుఁ జుక్కలను బడఁగొట్టుచుఁ బ్రకాశించుచున్నది.

శ్లో. యశ్చండగాంభీర్యధనుర్విజేతా, భూమండలీపుణ్యకృతావతారః
అఖండలాద్యై రమరై రుపేతః, కోదండపాణిః కులదైవతం నః. 60

ఉ. ఎవ్వఁడు ధాత్రిమండలి నహీనమహాసుకృతావతారకుం
డెవ్వఁడు విల్లు చేగొని జయించువిరోధుల నిమ్నమానసుం
డెవ్వఁడు బ్రహ్మరుద్రదిగీశేంద్రముఖామరదేవవేష్టితుం
డెవ్వఁడు చాపపాణియుతుఁ డెంచఁగ మత్కులదైవతం బగున్.

తా. ఏరాముఁడు తీక్ష్ణమగు గాంభీర్యముగల ధనుస్సుచే జయించువాఁడో భూమండలముయొక్క పుణ్యముచేతఁ జేయఁబడిన యవతారము గలవాఁడో ఇంద్రుఁడు మొదలగు దేవతలతోఁ గూడుకొన్నవాఁడో అట్టిధనుస్సు హస్తమందుఁ గలరాముఁడు మాకుఁ గులదైవము.

శ్లో. వైదేహ్యాసహ మేత్యరాజ్య మనిశం సౌవర్ణసింహాసనే
మందారద్రుమవాటికాంతరమహాశ్రీచంద్రకాంతాలయే
కైకేయీతనయాంజనాతనయసత్సౌమిత్రిసంసేవితం
మేఘశ్యామ ముదారహాసవదనం శ్రీరామచంద్రం భజే. 61

మ. స్థిరకల్పస్థలచంద్రకాంతవసతిన్ సింహాసనాసీనుఁడై
నిరతంబున్ ధరణీసుతాసహితుఁడై నీలోత్పలశ్యాముఁడై

దరహాసాననుఁ డై మరుత్సుతసుముత్రా పుత్రకై కేయిస
ద్వరపుత్రార్చితుఁ డై నరామజపనాథస్వామిఁ బ్రార్థించెదన్.

తా. సీతతో రాజ్యము బొంది మందారవృక్షములతోఁటలో గొప్పచంద్ర కాంతగృహమందు బంగారుపీఠమందు భరతాంజనేయలక్ష్మణశత్రుఘ్నులచే సేవింపఁబడుచున్నట్టియు మేఘమువలె నల్లనైనట్టియు మందహాసముతోఁగూడిన మొగముగలిగిన శ్రీరామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. వై దేహ్యాఃపులకాంకురార్చితతను ర్వ్యాలంబహస్తాంబుజో
హస్తేమోదితరత్నకంకణరవః కల్పద్రుమారామవ సే
పాదాభ్యాం మణిపాదుకాద్యుతికరస్రేంఖన్నఖాభ్యాం చర
న్నిష్టాలాపసుధారసం దిశతు మే శ్రీరామచంద్రో హరిః. 62

మ. తతమందారవనాంతరంబున లసద్రత్నావళీపాదుకా
ద్యుతి జెల్వొందునఖోజ్జ్వలాంఘ్రియుతుఁడై యోషాసమాశ్లేషరం
జితరోమాంచితగాత్రుఁడై యలరు నా శ్రీరామచంద్రుండు హా
కతికారుణ్యత నిచ్చు సత్సరససల్లాపామృతం బెప్పుడున్.

తా. కల్పవృక్షములతోఁటయందు సీతయొక్క పులకాంకురములచే నొప్పుచున్న దేహమందు వ్రేలుచున్నహస్తపద్మముఁ గలిగినట్టియు చేతియందు సంతోషకరమై రత్నకంకణములధ్వని గలిగినట్టియు మాణిక్యముల పావుకోళ్లకుఁ గాంతినిజేయు వ్యాపించుచున్న గోళ్లుగల పాదములచే సంచరించుచున్న శ్రీరామచంద్రరూపుఁడైన విష్ణువు నాకు మంచిమాటలనెడు నమృతరసము నిచ్చుఁగాక.

శ్లో. వామాంకస్థితజానకీకుచయుగే విన్యస్తహస్తాంబుజం
ప్రోజ్జృంభాననపంకజోపరిలసద్విస్పష్టబింబాధరమ్
సత్తారేణవిశిష్టకంకణరవేచోంకారశబ్దాశ్రయే
భాంతం శారదచంద్రహాస మనిశం వందే సదా రాఘవమ్. 63

ఉ. దాపలిపార్శ్వమం దలరు ధాత్రిసుతాకుచకుంభయుగ్మసం
దీపితహస్తపంకజు వినిర్మలశారదచంద్రహాసునిన్
శ్రీపతివిద్రుమాధరు హరిన్ బ్రణవోజ్జ్వలకంకణస్వనున్
క్ష్మాపతివిస్ఫుటాబ్జముఖు జానకిరాము భజింతు నెప్పుడున్.

తా. ఎడమతొడయందు సీతయొక్క కుచద్వంద్వమందు వ్యాపించిన హస్తపద్మములు గలవాఁడును అవులించుచున్న ముఖపద్మముపైఁ బ్రకాశించుచున్న స్పష్టమగు

దొండపండువంటి యధరముగలిగినట్టియు ఓంకారమున కాధారమైన తారకమంత్రములతోఁగూడిన కంకణధ్వనియందుఁ బ్రకాశించుచున్నట్టియు శరత్కాలచంద్రుని వంటి నవ్వుగలరాము నెల్లప్పుడు నమస్కరించుచున్నాను.

శ్లో. వైదేహీసహితంచ లక్ష్మణయుతం కైకేయీపుత్రాన్వితం
సుగ్రీవంచ విభీషణానిలసుతౌ నీలం నలం సాంగదమ్
విశ్వామిత్రవసిష్ఠగౌతమభరద్వాజాదికాన్ మానయన్
రామో మారుతిసేవితః స్మరతు మాం సామ్రాజ్యసింహాసనే. 64

మ. జనకాత్మోద్భవలక్ష్మణాఖ్యయుతుఁడై సామ్రాజ్యపీఠస్థుఁడై
దనుజేశార్కజవాయుజాంగదభరద్వాజాత్రిబ్రహ్మాత్మజం
దనగాధేయశరోభిఘాతిభరతుల్ నానాప్రకారంబులన్
దనరన్ గొల్వఁ జెలంగురామవిభు నర్థిం గొల్తు నిష్టాప్తికిన్.

తా. సీతతోఁగూడినవాఁడై లక్ష్మణునితోఁగూడినట్టి శత్రుఘ్నునితోఁగూడినట్టి భరతుని సుగ్రీవాదులను విశ్వామిత్రాదులను గౌరవించుచు ఆంజనేయునిచేత సేవించఁబడుచున్న రాముఁడు సామ్రాజ్యపీఠమందుండి నన్నుఁ దలఁచుగాక (అట్టిసమయమున నేను రామునితలంపునకు వచ్చినట్లైనఁ గృతార్థుఁడనగుదు నని తాత్పర్యము).

శ్లో. రామః ప్రాంజలి మగ్రతోనిలసుతం సౌహార్ద మాదర్శయన్
ప్రాంచచ్చామరయుగ్మభాసితకరాన్ పశ్చాత్ స్థలే పార్శ్వయోః
వామాంకే వనిజాం పిభీషణముఖాన్ సంభావయన్ బోధయన్
ధీముద్రాకరతత్త్వరూప మవతాత్ సామ్రాజ్యసింహాసనే. 65

మ. వరభద్రాసనుఁడై సతీసహితుఁడై భ్రాతల్ సితచ్ఛత్రచా
మరముల్ బశ్చిమపార్శ్వభాగమునఁ బ్రేమన్ దాల్ప సామీరిముం
దర కేల్మోడ్చ విభీషణాదులకు బోధల్ దెల్పుచున్ భవ్యసు
స్థిరముద్రాకరతత్త్వరూపి యగునా శ్రీరాము సేవించెదన్.

తా. ఎదుటదోసిలిగల అంజనేయుని గొడుగుచేతను ఉన్నతమైన వింజామర జోటిచేతఁ బ్రకాశించుచున్న హస్తములుగలవారై వెనకను పార్శ్వములయందున్న విభీషణాదులను ఎడమతొడపై సీతను గౌరవించుచు స్నేహమును జూపుచు జ్ఞానముద్రచేతఁగల పరతత్త్వమును (అనఁగా జ్ఞానముద్రగల హస్తముచేఁ దెలుపఁదగిన తత్త్వమును) బోధించుచు సామ్రాజ్యపీఠమందున్న రాముఁడు రక్షించుఁగాక.

శ్లో. పౌగండేహితబాలకైః పరివృతః పూర్ణేందుకాంతాననః
శ్రీత్యాబద్ధవిచిత్రహేమవసనే సంసక్తకాంచీగుణః
ఆజానుప్రవిలంబబాహుయుగళశ్శ్యామాంబుభృద్విగ్రహో
భ్రాతృస్వానుచరశ్చరాచరగురుః పాయాత్సదా రాఘవః. 66

మ. పటుపౌగండవయస్కుఁ డర్భకనిజభ్రాతృవ్యయుక్తుండు స
త్కటిబద్ధాంచితహేమవస్త్రవిలసత్కాంచీగుణోల్లాసివి
స్ఫుటనీలాంబుదవర్ణవిగ్రహుఁడు సంపూర్ణేందువక్త్రుండు దు
ర్ఘటశౌర్యుండు విలంబబాహుఁ డగు శ్రీరాముండు నన్ బ్రోవుతన్.

తా. పౌగండవయస్సునందు ఇష్టులైన బాలురతోఁ గూడినవాఁడై పూర్ణచంద్రునివంటి మొగము గలిగినట్టియు సంతోషముచే ధరింపఁబడిన బంగారుబట్టయందుఁ దగులుకొన్న మొలత్రాడుగలిగినట్టియు మోఁకాళ్లపర్యంతము వ్రేలుచున్న భుజద్వంద్వముగలిగినట్టియు నల్లమేఘమువంటి దేహముగలిగినట్టియు తమ్ములే తనభృత్యులుగలిగినట్టియు జంగమస్థావరములకు గురువైనరాముఁ డెల్లప్పుడు రక్షించుఁగాక.

శ్లో. వైదేహీరమణీయవక్త్రవనజప్రద్యోతఖద్యోతనం
కేళీసద్మనిరత్నదీపకళికాకాంతే వసంతం హరిమ్
సౌరభ్యప్రసవప్రయుక్తవిలసచ్ఛయ్యాంతరే శాయినం
శ్రీమంతం రఘువంశదీపకమణిం శ్రీరామచంద్రం భజే. 67

మ. స్థిరకేళీభవనాంతరాంతరవితర్దిప్రావృతం బైనభా
సురసౌరభ్యప్రసూనతల్పమున నాక్షోణీసుతావక్త్రతా
మరసాహస్కరుఁడై రహించుహరి శ్రీమంతుఁ గకుత్స్థాన్వయ
స్ఫురరత్నం బగు రామచంద్రుఁ దలఁతున్ బూర్ణానుకంపానిధిన్.

తా. సీతయొక్క సొగసైన ముఖపద్మమునకుఁ బ్రకాశించుచున్న సూర్యుఁడైనట్టియు రత్నదీపములచే మనోహరమైన కేళీగృహమందున్నట్టియు విష్ణురూపుఁడైనట్టియు పరిమళముగల పుష్పములతోఁ గూడినశయ్యయందు శయనించినట్టి శోభగలిగినట్టియు రఘువంశమును బ్రకాశింపఁజేయు రత్నమైన రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. రామో బద్ధపయోనిధి ర్గుణనిధి ర్గత్వా సమం వానరైః
లంకాం ప్రాప్య సకుంభకర్ణదనుజం హత్వా రణే రావణమ్
తత్ర స్థాప్య విభీషణం పునరగా త్సీతాపతిః పుష్పకం
చారూఢః పునరాగత స్సభ్రాతృకో నాథ ధాత్రీ మజః పాతునః. 68

మ. బలముల్ గొల్వఁగ వార్ధి గట్టి రిపుప్రోల్ ♦ బ్రాపించి పౌలస్త్యము
ఖ్యుల మర్దించి కృపన్ విభీషణున కా♦యూరేలఁగా నిచ్చి చె
న్నలరన్ మైథిలితోడఁ బుష్పకవిమా♦నారూఢుఁడై వచ్చి ని
ర్మలసాకేతపురాభిషిక్తుఁ డగు రామస్వామి నన్ బ్రోవుతన్.

తా. రాముఁడు, కట్టఁబడినసముద్రము గలవాఁడై గుణములను స్థానమగుచు చారులతోఁ గూడి వెళ్ళి లంకాపట్టణమును బొంది కుంభకర్ణునితో రాక్షసులతోఁ గూడిన రావణుని యుద్ధమందుఁ గొట్టి యాలంకయందు విభీషణుని నిలిపి సీతతోఁ గూడినవాఁడగుచుఁ బుష్పకమునెక్కి తిరిగివచ్చెను. అట్లు తిరిగివచ్చినవాఁడగుచు భూమిని భరించినట్టి పుట్టుక లేని రాముఁడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో. రత్నోల్లసజ్జ్వలితకుండలగండభాగం
కస్తూరికాతిలకశోభితఫాలభాగమ్
కర్ణాంతదీర్ఘనయనం కరుణాకటాక్షం
శ్రీరామచంద్రముఖ మాత్మని సన్నిధత్తామ్. 69

శా. కస్తూరీతిలకాననుండు మహితా♦కర్ణాంతనేత్రుండు దే
వస్తోత్రాంఘ్రిసరోరుహుండు కరుణా♦పాంగేక్షణుం డంచిత
భ్యస్తోదస్తకళాకలాపుఁడు మణి♦ప్రస్ఫీతసత్కుండలుం
డస్తోకోజ్జ్వలకీర్తిరాముఁడు మదీ♦యాత్మన్ బ్రసన్నుం డగున్.

తా. మణులచేఁ బ్రకాశించుచున్న ప్రజ్వలించుచున్న కుండలములుగల గండస్థలములు గలిగినట్టియుఁ గస్తూరిబొట్టుచేఁ బ్రకాశింపఁజేయఁబడు నుదురు గలిగినట్టియు చెవులసమీపమునకుఁ బొడవైన నేత్రములు గలిగినట్టియు దయతోఁ గూడిన క్రేఁగంటి చూపు గలిగినట్టియు రాముని మొగము హృదయమందు సమీపించుఁగాక.

శ్లో. హేలాభగ్నశశాంకశేఖరధనుర్భ్రూమండలాఖండల
శ్రేణీమౌళిలసద్వినూత్నమణిభిర్దీప్తాంఘ్రిపంకేరుహః
కల్యాణం జనయత్వఖండవిభవః కల్యాణలీలోత్సవే
మార్తాండాన్వయమండనశ్చ భవతాం రామస్సరామస్సదా. 70

మ. ధరణీపాలకిరీటరత్నవిలస♦త్పాదాంబుజాతుండు శం
కరకాండాసనఖండనుండు ధరణీ♦కన్యాసమేతుండు భా
స్కరవంశోద్భవమండనుండు నిజసత్కల్యాణలీలోత్సవా
కరుఁడౌ రాముఁ డొసంగు మా కతిదయ♦న్గల్యాణ మెల్లప్పుడున్.

తా. విలాసముచే గొట్టఁబడిన యీశ్వరధనుస్సు గలిగినట్టియు రాజులపఙ్క్తులయొక్క కిరీటములయందుఁ బ్రకాశించుచున్న శ్రోత్రమణులచే బ్రకాశించుచున్న పాదపద్మములు గలిగినట్టియు గొప్పవైభవము గలిగినట్టియు సూర్యవంశమున కలంకారమైనట్టియు సీతతోఁగూడినరాముఁ డెల్లప్పుడును గళ్యాణవిలాసోత్సవమం దున్నవాఁడై మీకు శుభమును బుట్టించుఁగాక.

శ్లో. విద్యుత్ స్ఫురన్మకరకుండలదీప్తచారు
గండస్థలం మణికిరీటవిరాజమానమ్
పీతాంబరం జలదనీలముదారకాంతిం
శ్రీరామచంద్ర మనిశం కలయామి చిత్తే. 71

మ. పరవిద్యుద్ద్యుతిరత్నకుండలవిభాస్వద్గండభాగు న్పయో
ధరనీలాభు న్మణిదగద్ధగితసత్కల్యాణకోటీరుభా
స్కరచామీకరవిస్తృతాంబరు మునిస్తవ్యు న్ధరాపుత్రికా
వరు శ్రీరాము నిరంతరంబు మనసా వాంఛ న్విలోకింపుమా.

తా. మెఱపువలెఁ బ్రకాశించుచున్న మకరాకృతిగల కుండలములచేఁ బ్రకాశించుచున్న సుందరగండస్థలములు గలిగినట్టియు రత్నకిరీటముచేఁ బ్రకాశించుచునట్టియుఁ బచ్చనిబట్టగలిగినట్టియు మేఘమువలె నల్లనైనట్టియు గొప్పకాంతిగలరాము నెల్లపుడు చిత్తమందుఁ దలఁచుచున్నాను.

శ్లో. కరతలధృతచాపం కాలమేఘస్వరూపం
సరసిజదళనేత్రం చారుహాసం సుగాత్రమ్
విబినుతవనవాసం విక్రమోదగ్రవేషం
ప్రణమత రఘునాథం జానకీప్రాణనాథమ్. 72

మ. ఘనకాలాంబుదసన్నిభాంగునకు భూకన్యామణీప్రాణనా
థునకు న్సారసపత్రనేత్రునకు సద్బోధ్యాస్వరకి న్జాసుహా
సునకు న్గార్ముకపాణికి న్బ్రకటతేజోరాశికి న్శౌర్యధు
ర్యునకు న్రామునకు న్వనేచరున కేనుత్కంఠతో మ్రొక్కెదన్.

తా. హస్తమందు ధరింపఁబడిన ధనుస్సు గలిగినట్టియు నల్లని మేఘమువంటి రూపముగలిగినట్టియు పద్మదళములవంటి కన్నులు గలిగినట్టియు సుందరమగు నవ్వుగలిగినట్టియు మంచిదేహము గలిగినట్టియు వనమందు నివాసముగలిగినట్టియు పరాక్రమముచే నున్నతమగు వేషముగల సీతాప్రాణనాథుఁడైన రాముని నమస్కరింపుఁడు.

శ్లో. యఃపృథ్వీభరవారణాయదివిజైః సంప్రార్థిత శ్చిన్మయః
సంజాతః పృథివీతలే రవికులే మాయామనుష్యోవ్యయః
నిశ్చక్రం హతరాక్షసః పునరగా ద్బ్రహ్మత్వ మాద్యం స్థిరాం
కీర్తిం పాపహరాం విధాయ జగతాం తంజానకీశం భజే. 73

మ. అవనీభారనివారణార్థమున మర్త్యశ్రేణిప్రార్థింపఁగా
రవివంశంబున మర్త్యరూపతనుఁడై రక్షస్సులన్ దుంచి త్రై
భువనవ్యాప్తయశస్కుఁడై నిజపదంబున్ జేరి యవ్యక్తుఁడై
శివుఁడై యక్షరుఁడై యచింత్యుఁడగునాసీతేశుఁ బ్రార్థించెదన్.

తా. జ్ఞానరూపుఁడైన యేరాముఁడు భూభారము మాన్పుటకు దేవతలచేఁ బ్రార్థింపఁబడినవాఁడై భూప్రదేశమందు సూర్యవంశమందు మాయామనుష్యరూపుఁడై పుట్టినవాఁడగుచు నాశనరహితుఁడైనవాఁడగుచు రాష్ట్రములేకుండునట్టుగా సంహరింపఁబడిన రాక్షసులుగలవాఁడగుచు జగత్తులకుఁ బాపమును హరించునట్టి స్థిరమైనకీర్తినిజేసి మొదటిదైన బ్రహ్మస్వరూపమును బొందెనో యట్టిసీతాభర్త యగురాముని సేవించుచున్నాను.

శ్లో. విశ్వోద్భవస్థితిలయాదిషు హేతుమేకం
మాయాశ్రయం విగతమాయ మచింత్యమూర్తిమ్
ఆనందసాంద్ర మమలం నిజబోధరూపం
సీతాపతిం విదితతత్త్వ మహం నమామి. 74

మ. భువనోత్పత్తిసమృద్ధినాశనకరున్ బోధస్వరూపున్ బ్రధా
నవిహీనున్ విమలున్ బ్రధానయుతు నానందున్ ధరాపుత్రికా
ధవు నద్వంద్వు నచింత్యుఁ దత్త్వవిదు భక్తత్రాణపారీణు మా
నవనాథార్చితు రామచంద్రుని జగన్నాథున్ బ్రశంసించెదన్.

తా. ప్రపంచముయొక్క పుట్టువు, ఉనికి, సంహరించుట మొదలగువానియందుఁ గారణమైనట్టియు నద్వితీయుఁడైనట్టియు మాయ కాధారమైనట్టియుఁ బోయినమాయ గలిగినట్టియు నూహించ శక్యముగాని స్వరూపము గలిగినట్టియు నానందముచే దట్టమైనట్టియు నిర్మలుఁడైనట్టియు స్వకీయజ్ఞానస్వరూపుఁడైనట్టియుఁ దెలియఁబడినతత్త్వము గలరాముని నేను నమస్కరించుచున్నాను.

శ్లో. శ్రీరామం నవరత్నకుండలధరం శ్రీరామరక్షామణిం
శ్రీరామంచ సహస్రభానుసదృశం శ్రీరామచంద్రోదయమ్

శ్రీరామం శ్రుతకీర్తి మాకరమహం శ్రీరామముక్తిప్రదం
శ్రీరామం రఘునందనం భయహరం శ్రీరామచంద్రం భజే. 75

శా. శ్రీరాముణ్ నవరత్నకుండలధరుణ్ శ్రీరాము రఘూమణిన్
శ్రీరాముణ్ శతకోటిభానుసదృశుణ్ శ్రీరాముఁ జంద్రాననుణ్
శ్రీరాముణ్ శ్రుతకీర్తిమాకరుఁ బరుణ్ శ్రీరాము ముక్తిప్రదుణ్
శ్రీరాముణ్ రఘునందనుణ్ భయహరుణ్ శ్రీరాము సేవించెదన్.

తా. నూతనరత్నకుండలములు గలిగినట్టియు వేయిసూర్యులతోఁ దుల్యుఁడైనట్టియుఁ బ్రసిద్ధకీర్తిలక్ష్మికి స్థానమైనట్టియు ముక్తినిచ్చునట్టియు రఘువంశస్థులను సంతోషింపఁజేయునట్టియు భయమును హరించునట్టియు శ్రీరామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. శ్రీరామచంద్రశరణారవిందయో, రంతరంగచరభృంగలీలయా
తత్ర సంతిచరసాశ్చతుర్విధా, మాకరందరసపానపంకజే. 76

ఉ. శ్రీరఘురామపాదసరసీజములందలిమాడ్కిఁ గాంతుఁ బెం
పారఁగ భక్తియుక్తి ననయంబుఁ జరింపుచు నుండు చిత్తమా
యారయఁగాఁ జతుర్విధఫలాప్తికరంబులు సంతతంబు పం
కేరుహపాళియందుఁ బరికింప రసం బొకటై ప్రవర్తిలున్.

తా. ఓమనస్సా శ్రీరామపాదపద్మములయందుఁ దుమ్మెదరీతి సంచరించుమా, ఆపాదపద్మములయందు చతుర్విధపురుషార్థరూపములైన రసములుగలవు పద్మమందైతే మకరందరస మొక్కటియే కలదు.

శ్లో. రామః పాతు సదైవమామరిభయాద్రామం సదాభావయే
రామేణైవ హృతం మహత్తరతమో రామాయ నిత్యం నమః
రామాన్నాస్తి పరంపదం సులలితౌ రామస్యపాదౌ భజే
రామే ప్రీతి రచంచలాస్తు మమ హే శ్రీరామ మాం పాలయ. 77

ఉ. రాముఁడు బ్రోచు శత్రునికరంబులచే భయ మందకుండ, శ్రీ
రాముని సన్నుతింతు, రఘురామునిచే లయమొందుఁ బాపముల్
రాముని కేను మ్రొక్కెదను రామునికంటెఁ బరంబు లేదు, శ్రీ
రాముని కేను దాసుఁడను రామునిపై గురి నిల్పి యుండెదన్.

తా. రాముఁడే నన్నెల్లపుడు శత్రుభయమువలన రక్షించుఁ గాక. రామునెల్లపుడు ధ్యానించుచున్నాను. రామునిచేతనే గొప్పదియజ్ఞానము హరింపఁబడినది. రాముని

కోటి కెల్లఁ బుడుపునమస్కారము. రామునికంటె వేఱుగ గమ్యస్థానము లేదు. సుందరము లైన రాముని పాదములను సేవించుచున్నాను. రామునియందు నాకు నిశ్చలమైనభక్తి యుగుఁగాక. ఓరామా నన్నేలుము. (ఈశ్లోకమందు రామశబ్దమున కెనిమిదివిభక్తులును జెప్పఁబడినవి).

శ్లో. రామ మిందీవరశ్యామం, రాజీవాయతలోచనమ్
జ్యాఘోషనిర్జితారాతిం, జానకీరమణం భజే. 78

మ. ఘననీలోత్పలపత్రగాత్రు విలసత్కంజాతనేత్రుఁ ధరా
తనయాముఖ్యకళత్రుఁ గార్ముకమహాధ్వానాపహృద్వైరిఁ గాం
చనచేలుం గరుణాలవాలు వినుతక్ష్మాపాలు సద్భక్తపా
వనసంశీలు యశోవిశాలుని రఘుస్వామిం బ్రశంసించెదన్.

తా. నల్లగలువవలెనే నల్లనైనట్టియు పద్మమువలెవిస్తారమైన నేత్రములుం గలిగిట్టియు నారియొక్కధ్వనిచేత జయింపఁబడినశత్రువులు గలిగినట్టియు సీతకుఁ బెనిమిటియైన రాముని సేవించుచున్నాను

శ్లో. నానాదివ్యాస్త్రతేజస్స్ఫురదమితభుజశ్శత్రుసంహారధీరః
కోటిల్యోద్యోతమానభ్రుకుటియుతముఖం ధారయ న్నంబుదాభః
తూణీరప్రోత్థవేగోల్లసితశరవరం తాడయిత్వా దశాస్యం
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. 79

మ. కుటిలభ్రూకుటితాస్యుఁడై కరలసత్కోదండదివ్యాస్త్రుఁడై
చటులారిందముఁడై బిడౌజసుతుఁడై శ్యామాంగుఁడై ధీరుఁడై
పటుతూణీరవిముక్తకాండపవినిర్భగ్నాసురేంద్రాద్రియై
కటువృత్తిం జయలక్ష్మిఁ గొన్నధరణీకాంతుండు నన్ బ్రోవుతన్.

తా. బహువిధములైన దివ్యాస్త్రములతేజస్సుచేతఁ బ్రకాశించుచున్న గొప్ప భుజములు గలిగినట్టియు శత్రువులయొక్కసంహారించుటయందు ధైర్యవంతుఁడైనట్టియు వంపుచేతఁ బ్రకాశించుచున్న భ్రూభంగముతోఁగూడిన ముఖమును ధరించినట్టియు మేఘశోభగలిగినట్టియు నంబులపొందినుండి లేచినవేగముచేతఁ బ్రకాశించుచున్నబాణశ్రేష్ఠములుగల రావణునిఁగొట్టి వీరలక్ష్మిచే మనోహరమైనశరీరము గలిగినట్టియు నింద్రునిచే స్తోత్రముచేయఁబడిన వీరుఁడైన రాముఁడు నన్ను రక్షించుగాక.

శ్లో. హత్వా యుద్ధే దశాస్యం త్రిభువనవిషమం వామహస్తేనచాపం
భూమా వారోప్య తిష్ఠ న్నితరకరధృతం భ్రామయ న్బాణమేకమ్

ఆరక్తోపాంతనేత్రశ్శరదళితవపుః కోటిసూర్యప్రకాశో
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. 80

మ. అరుణాంభోరుహనేత్రుఁడై శతసహస్రాదిత్యసంకాశుఁడై
సురయోగీంద్రమునీంద్రకంటకు దశాస్యుం ద్రుంచి భిద్రాంగుఁడై
ధరణిం గార్ముకమూని బాణ మొకచేతం ద్రిప్పుచుం సన్నుతా
మరనాథుండు జయాభిరాముఁ డగు రామస్వామి నన్ బ్రోచుతన్.

తా. ముల్లోకములకు విరోధియగు రావణుని యుద్ధమందుఁ గొట్టి యెడమచేతిచే ధనుస్సు భూమియందు నిలిపి తాను నిలువఁబడి కుడిచేతఁ బూనినయొక బాణమును ద్రిప్పుచున్నట్టియు, నించుకయెఱ్ఱనైన ప్రాంతములు గలకన్నులు గలిగినట్టియు బాణములచే గాయములు పడ్డదేహము గలిగినట్టియు కోటిసూర్యులవంటి కాంతి గలిగినట్టియు వీరలక్ష్మిచే సొగసైనశరీరము గలిగినట్టియు నింద్రునిచే స్తోత్రముచేయఁబడిన వీరుఁడైన రాముఁడు నన్ను రక్షించు గాక.

శ్లో. యుద్ధే సన్నద్ధశస్త్రం కపివరభయదం కుంభకర్ణం సురారిం
బాణే నైకేన సద్యః ప్రకటితహుతభుగ్విశ్వరోషారుణాక్షమ్
హత్వా కృత్వా ప్రమోదం సురకపివితతే ర్జ్ఞానిబృందైకసేవ్యో
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. 81

చ. హరిపరులెల్ల భీతిల లయాంతకురీతి ధృతాస్త్రహస్తము
ప్కరుఁ డరుణాక్షుఁడై నఘటకర్ణు వధించి జయాభిరాముఁడై
సురపతి వానరుల్ ముదము సొంపు వహింప మునుల్ భజింపఁగా
సురపతి సన్నుతింప రణశూరుఁడు రాముఁడు నన్నుఁ బ్రోచుతన్.

తా. యుద్ధమందు సన్నాహ మొందిన యాయుధము గలిగినట్టి వానరులకు భయముఁజేయునట్టి తత్కాలమందుఁ బ్రకటింపఁబడిన యగ్నివంటి యెల్లవారియందలి కోపముచేత నెఱ్ఱనైన కన్నులుగల కుంభకర్ణుఁడను రాక్షసు నొకబాణముచేతఁ గొట్టి దేవతలయొక్కయు వానరులయొక్కయు సమూహములకు సంతోషముఁజేసి మునిసమూహమునకు ముఖ్యముగా సేవింపఁదగినట్టి; (వీరశ్రీత్యాదికము పూర్వశ్లోకమువలె నర్థముఁ జూడవలయును.)

శ్లో. దైతేయోదగ్రసేవ్యం పటుతరవిశిఖం భీషణం ఘోరనాదం
దేవేంద్రస్తూయమానస్ఫురదరినికరానంధకారాంశ్చ హత్వా

దిక్పాలాన్ పార్థివభోగాన్మణిరుచిసుభగాన్ దిక్షుతాన్ స్థాపయిత్వా
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. 82

మ. భయదం బైనసుహోర్భటిన్ ధృతధనుర్బాణాస్త్రుఁడై గర్వదు
ర్నయుఁడై త్యావళివంచకాదిచటులారాతి ప్రక్రియన్ ద్రుంచి తా
జయలక్ష్మిన్ గొనిజంభవైరినుతుఁడై స్థానంబులన్ భోగముల్
దయ దిక్పాలుర కిచ్చినట్టిరఘునాథస్వామి నన్ బ్రోవుతన్.

తా. రాక్షసులలోనున్నతుఁడై సేవించఁదగినట్టితీక్ష్ణబాణములుగలిగినట్టి భయంకరుఁడైనట్టి ఘోరధ్వనిగల రావణుని ప్రకాశించు శత్రుసమూహముల నెడు చీకటులనున్నగొట్టి యింద్రునిచే నుతింపఁబడినవాఁడగుచు దిక్పతులను బొందఁబడిన భోగములుగలవారినిగాను రత్నశోభలచే మనోహరులను గాను దిక్కులయందు నిలిపి; (వీర శ్రీబంధురాంగ ఇత్యాదికము పూర్వముటువలె.)

శ్లో. కౌసల్యావీరగర్భాంబుధిఘనవిలసత్పూర్ణచంద్రప్రకాశో
మాసీంద్రస్వాంతపద్మప్రవిమలతరణిర్ధర్మనైపుణ్యరూఢః
మారీచం రాక్షసేంద్రం నిజశరదహనాహూయాహుతిం కల్పయిత్వా
వీరశ్రీబంధురాంగ స్త్రిదశపతినుతః పాతు మాం వీరరామః. 83

శా. కౌసల్యాజఠరాబ్ధిచంద్రు మునిహృత్కంజాతకంజాప్తు వి
ద్యాసంపన్నుని దాటకేయవనదావాగ్న్యంబకున్ వీరల
క్ష్మీసంప్రాప్తశరీరు ధర్మయుతసంశీలున్ బలారిస్తుతున్
రామున్ రఘువీరు దాశరథి శ్రీరామున్ బ్రశంసించెదన్.

తా. కౌసల్యయొక్క వీరగర్భమనెడు సముద్రమునకు గొప్పగాఁ బ్రకాశించుచున్న పూర్ణచంద్రునివంటికాంతి గలిగినట్టియు మునిశ్రేష్ఠుల చిత్తపద్మములకు నిర్మల సూర్యుఁడైనట్టియు ధర్మమందలి నేర్పునకుఁ బ్రసిద్ధుఁడైనట్టియు రాక్షసశ్రేష్ఠుఁడైన మారీచునిఁ దనబాణాగ్ని కాహుతి యొనర్చి; (వీరశ్రీబంధురాంగ ఇత్యాదికము పూర్వముటువలె).

శ్లో. యోదండకారణ్యనిశాచరేంద్రాన్, కోదండలీలావిషయాంశ్చకార
వేదండశుండాయితబాహుదండః, కోదండపాణిః కులదైవతం నః.

మ. తతజంభద్విషతుండితుండనిభదోర్దండాత్తకోదండమం
డితుఁడై శూరతదండకాటవిని దాడిన్ జేయుచున్ ఘోరదసం

గతి వర్తించునిశాటులన్ దునిమి వేఁడ్కన్ బాణబాణాసనాం
చితుఁడౌ రాముఁడు మాకుదైవమగుచున్ ♦ జెన్నొందునశ్రాంతమున్.

తా. శ్రీరాముఁడు దండకారణ్యమందలి రాక్షసులను ధనుర్విలాసమునకు గోచరులనుగాఁ జేసెనో అట్టియేనుఁగుతొండమైనభుజదండములుగల ధనుస్సు హస్తమందుఁ గలరాముఁడు మాకుఁ గులదైవము.

శ్లో. తరుణౌ రూపసంపన్నౌ, సుకుమారౌ మహాబలౌ
పుండరీకవిశాలాక్షౌ, చీరకృష్ణాజినాంబరౌ.
ఫలమూలాశినౌదాంతౌ, తాపసౌ ధర్మచారిణౌ
రక్షఃకులవిహంతారౌ, భ్రాతరౌ రామలక్ష్మణౌ. 85

చ. అనుపమరూపయౌవనబ♦లాఢ్యుల సజ్జనమిత్రులన్ లస
ద్వనరుహపత్రనేత్రులను ♦ శాంతుల దాపసధర్మచర్యులన్
వనఫలమూలభోజనుల ♦ వల్కలధారుల దైత్యబృందమ
ర్దను లగు రామలక్ష్మణుల ♦ దాసజనావనులన్ భజించెదన్.

తా. చిన్న వయసు గలిగినట్టియు సౌందర్యముతోఁగూడినట్టియు మృదువైనట్టియు గొప్పబలము గలిగినట్టియు పద్మములవలె విశాలములగుకన్నులు గలిగినట్టియు నారచీరలు కృష్ణాజినములు వస్త్రములు గలిగినట్టియు పండ్లు దుంపలు దినునట్టియు శాంతులు ధర్మమునందు సంచరించువారు రాక్షసవంశమును సంహరించువారు నన్నదమ్ములు నగు రామలక్ష్మణులు విజయము నగుదురు గాక.

శ్లో. కల్యాణానాం నిదానం కలిమలదహనం పావనం పావనానాం
పాథేయం మోక్షసిద్ధిప్రథితసుపదవీప్రాప్తయే ప్రస్థితస్య
విశ్రామస్థానమేకం కవివరవచసాం జీవనం జీవితానాం
బీజం ధర్మద్రుమస్య ప్రభవతి భవతాం భూతయే రామనామ. 86

చ. పరమపవిత్రమున్ గుశల♦పద్ధతి కాదిమకారణంబు ని
ర్దరకలికల్మషాపహము ♦ ధర్మకుజంబున కాదిబీజమున్
బరమపదానువర్తి యగు ♦ పాంథున కిమ్మగునట్టివిశ్వాసు
స్థిరతరమౌనివేశమున ♦ జీవితజీవన మై సనస్సుశ్రీ
కర మగు రామనామము జ♦గంబు పవిత్రముఁ జేయుఁ గావుతన్.

తా. శుభములకాదికారణమును పాపమాలిన్యమునకగ్నియు పవిత్రమైనవానిలోఁ బవిత్రమైనదియు మోక్షసిద్ధికిఁ బ్రసిద్ధమగు మంచిత్రోవఁ బొందుటకు బయలు

వెడలినవానికి బత్తెమైనదియును గవీశ్వరులవాక్యములకు ముఖ్యమైనవిశ్రాంతిస్థానమును జీవనములకు జీవనమును ధర్మమను వృక్షమునకు గింజయు నగు రామనామము మీపవిత్రతకు సమర్థమగుచున్నది.

శ్లో. కౌసల్యానయనేందుం దశరథముఖారవిందమార్తాండమ్
సీతామానసహంసం రామం రాజీవలోచనం వందే.
దీర్ఘబాహు మరవిందలోచనం, దీనవత్సల మనాథరక్షణమ్
దీక్షితం సకలలోకరక్షణే, దైవతం దశరథాత్మజం భజే. 87

శా. కౌసల్యానయనేందువాజిముఖసత్కంజాప్తకంజాప్తు సీ
తాసాధ్వీమణిమానసాంబురుహకాసంబంబు యోగీంద్రహృ
ద్వాసుఁ దీర్ఘకరుఁ జగద్గురులసత్పంకేజపత్రాక్షునిఁ
దాసత్వవ్యసనాథరక్షణుఁ బరంధాముఁ మదిఁ గొల్చెదన్.

తా. కౌసల్యయొక్క నేత్రములకుఁ జంద్రుఁడును దశరథుని ముఖపద్మమునకు సూర్యుఁడును సీతయొక్క చిత్తమనెడు మానససరస్సునకు హంసయుఁ బద్మములవంటి నేత్రములుగలవాఁడు నగురాముని నమస్కరించుచున్నాను. పొడవైనచేతులు గలవాఁడును పద్మములవంటి కన్నులుగలవాఁడును దీనులయందుఁ బ్రేమగలవాఁడును దిక్కులేనివారికి రక్షకుఁడును ఎల్లలోకముల సంరక్షణమందు దీక్షగలవాఁడును దశరథపుత్రుఁడు నగు దైవమును సేవించుచున్నాను.

శ్లో. సత్యేన లోకాఞ్జయతి, దీనాన్ దానేనరాఘవః
గురుం శుశ్రూషయా వీరో, ధనుషాయుధ్ధశాత్రవాన్.
భర్జనం భవబీజానాం, మార్జనం సుఖసంపదామ్
తర్జనం యమదూతానాం, రామరామేతి కీర్తనమ్. 88

చ. అరయఁగ సత్యవాక్యమున నన్నిజగంబుల దాస్యవైఖరిఁ
గురువుల బాణకోటిరిపుకోటుల దీనుల దానవైఖరిఁ
సరవి జయించినట్టిరఘుసత్తముఁ నిర్మలరామనామముఁ
వరసుఖదంబు యామ్యభటవర్జితము న్గలుషాపహంబగున్.

తా. వీరుఁడగు రాముఁడు సత్యముచేత లోకములను దానముచేత దీనులను సేవచేత గురువును ధనుస్సుచేత యుద్ధమందలి శత్రువులను జయించుచున్నాఁడు. రామరామ యని కీర్తించుట సంసారమనుగింజలకు వేపుడు, సౌఖ్యసంపదలకుఁ బరిశుద్ధిఁజేయునది, యమదూతలకుఁ దర్జనఁ జేయునది.

శ్లో. సకృత్ప్రణతరక్షాయాం, సాక్షీ యస్య విభీషణః
సాపరాధప్రతీకారః, సర్వేశ్వరో రామో గతిర్మమ.
నజానే జానకీజానే, రామ త్వన్నామవైభవమ్
సర్వేశో భగవాన్ శంభు, ర్వాల్మీకి ర్వేత్తి వా నవా. 89

మ. అపరాధం బొనరించి యైన శరణం ♦ బన్న న్మహత్ప్రోతు వీ
కృపచేఁ సాక్షి విభీషణుం డగుట యింతే నీవు నీనామ మె
ల్లపుడున్ భర్గుఁడు వాల్మికీయుఁ గనుఁ గోల్లం బందు జింతించి త
ద్విపులార్థంబు నెఱింగిరో యెఱుఁగరో ♦ వేద్యంబె మాబోటికిన్.

తా. శ్రీరామునియొక్క ఒక్కపర్యాయము నమస్కరించినవారిని రక్షించుట విషయమై విభీషణుఁడు సాక్షియో అట్టి అపరాధముతోఁగూడినవారికిం బ్రతిక్రియఁ జేయురాముఁడు నాయగతి, ఓ రామమూర్తీ నీపేరుయొక్క సామర్థ్యమును నేనెఱుంగను. సర్వేశ్వరుఁడును భగవంతుఁడునగు శివుఁడును వాల్మీకియు నెఱుఁగునో లేదో.

శ్లో. కృత్యాకృత్యవివేకహీనమనసాం హత్యాదిభి ర్జీవినా
మత్యంతం బహుతారకం తనుభృతాం మత్యాంతశోకాపహమ్
సత్యానందమయం సమస్తనిగమస్తోత్రాస్పదం సంపదాం
స్థానం శ్రీరఘురామనామ విమలం నిత్యం స్మరన్ ముచ్యతే. 90

శా. కృత్యాకృత్యవివేకవర్జితులకున్ ♦ కించిద్జ్ఞులై నట్టిగో
హత్యాబ్రహ్మహతులకు న్మనుష్యులకు నత్యంతార్థంబు వేదాంతసం
స్తుత్యం బీప్సితసంపదాస్పదము నిత్యశ్లోకంబు నైర్మల్యమున్
సత్యానందము రామసంస్మృతమహా ♦ సౌఖ్యంబు మోక్షం బగున్.

తా. ఇది చేయఁదగినది యిది చేయఁదగనిది యను వివేకములేనిమనస్సు గలిగి నట్టి బ్రహ్మహత్యాది మహాపాపములచే జీవించుచున్న మనుష్యులకు మిక్కిలి తరింపఁ జేయునదియును నత్యంతదుఃఖములఁ బోఁగొట్టునదియును సత్యానందరూపమైనదియు సర్వవేదములచే స్తోత్రముఁ జేయఁదగినదియును సంపదలను స్థానమైనదియును నిర్మలమైనదియు నగు రామనామమును నిత్యమును దలఁచువాఁడు మోక్షము నొందుచున్నాఁడు.

శ్లో. సాకేతే స్వనికేతనే సురతరో ర్మూలే లసద్వేదికే
పద్మం రత్నమయం దధాన మపరం హస్తాంబుజం జానుని
సీతాం పార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం పరిపూర్ణచంద్రవదనం భాస్వత్కిరీటం భజే. 91

మ. ప్రకటాయోధ్యను చందనాంతికమునన్ రత్నోజ్జ్వలద్భేమమం
దకలంకం బగువేదికన్ మణికిరీటాలంకృతుం డై సము
త్సుకతన్ జానువుమీఁద హస్త మిడి విద్యున్ముద్రావిలసత్కరాంభోరుహుం
తకరన్ మైథిలిఁ బార్శ్వమందుగను సీతారాము భావించెదన్.

తా. అయోధ్యయందుఁ దనయింటియందుఁ బ్రకాశించుచున్న అరుగుగల కల్ప వృక్షముయొక్క మొదటనుండి రత్నవికారముగుపద్మము నొకచేతను మత్తియొకచేయి మోకాలునందును ధరించినట్టియుఁ బార్శ్వమును బొందినదియుఁ బద్మమువంటి హస్తములు గలిగినట్టిదియు మెఱపుతో సమానుశాలగుసీతను జూచుచున్నట్టియుఁ బూర్ణ చంద్రునివంటి మొగము గలిగినట్టియుఁ బ్రకాశించుచున్న కిరీటముగల రాముని సేవించుచున్నాను.

శ్లో. విద్యుద్వర్ణోపమాంగీం వికచవరముఖీం విద్రుమాభాధరోష్ఠీం
వేదంష్ట్రోద్ధత్యకుంభప్రతికుచయుగళాం వేదిమధ్యావతంసామ్
శ్యామాంసఫుల్లపద్మచ్ఛదనిభనయనాం చారుహాసాం సునాసాం
సీతాం శ్రీరామదేవీం శ్రితజనవరదాం చింతయేనంతమూర్తిమ్. 92

మ. తతసంఫుల్లసరోజనేత్ర హరివేదండాభకుంభస్తనిన్
శ్రితచింతామణివిద్రుమోష్ఠినవరాజీవాననన్ జంచల
ద్యుతగాత్రిన్ హరిరాజమధ్యనిగమస్తోత్రాద్భుతాకారభా
సితసుశ్యామసునాసికన్ గొలిచెదన్ శ్రీరామదేవిన్ మదిన్.

తా. మెఱుపుయొక్క రంగు సామ్యముగలశరీరము గలిగినట్టిదియు వికసించిన శ్రేష్ఠమైన మొగము గలిగినదియు పగడముయొక్క శోభగల పెదవి గలిగినదియు ఏను గుయొక్క గర్వయుక్తమైన కుంభస్థలముల నెదిరించు స్తనద్వంద్వము గలిగినట్టిదియు యజ్ఞవేదికవంటి నడుముగల స్త్రీలకు శిరోభూషణమైనదియు యౌవనమధ్యస్థురాలును వికసించినపద్మపు రేకులతోఁ దుల్యములగు నేత్రములు గలదియు సుందరమగు నవ్వుగల దియు మంచిముక్కుగలదియు నాశ్రయించినజనులకు వరముల నిచ్చునదియు నను నంతము లేనిస్వరూపముగల రామునిభార్య యగు సీతను ధ్యానించుచున్నాను.

శ్లో. మాణిక్యమంజీరపదారవిందాం, రామార్కసంఫుల్లముఖారవిందామ్
భక్తాభయప్రాపికరారవిందాం, దేవీం భజే రాఘువవల్లభాం తామ్.

చ. అనుపమరామభానువికచాననపంకజనూత్నరత్నకాం
చనవనూపురాంఘ్రినవసారసయుగ్మనిజాశ్రితేష్టదా

యినవకరాంబుజాతమిధిలేశ్వరపుత్రిసి రాముదేవి నె
మ్మనమున నిష్టసిద్ధికి సమాహితబుద్ధిఁ దలంతు నెంతయున్.

తా. మణివికారములైన యందెలు పాదపద్మములయందుఁ గలదియు రాముఁ డనెడు సూర్యునిచే వికసించినముఖపద్మము గలదియు భక్తులకు నిగితోఁగూడిన హస్తపద్మము గలదియు రామునిభార్యయు నగు ప్రసిద్ధురాలైన సీతాదేవిని సేవించుచున్నాను.

శ్లో. జయతువిజయకారీ జానకీమోదకారీ
తపనకులవిహారీ దండకారణ్యచారీ
దశవదనకుఠారీ దైత్యవిచ్ఛేదకారీ
మణిముకుటకధారీ చండకోదండధారీ. 94

ఉ. ధారణిజాసుతోషకరుఁ డామరసాక్షకులప్రదీపకుఁ
ఘోరనిశాచరాంబురుహకుంజరు నచ్యుతు దండకాటవీ
చారతరప్రచారు ధృతచాపుదశాననమర్దను న్మణి
స్ఫారకిరీటధారి రఘుసత్తము నుర్వి జయంబు పొందెడున్.

తా. జయమును గలిగించునట్టియు సీతకు సంతోషముఁ జేయునట్టియు సూర్య వంశమందు విహరించునట్టియు దండకార్యణమునందు సంచరించునట్టియు రావణునికి గొడ్డటిని ధరించువాఁడైనట్టియు రాక్షససంహారముఁ జేయునట్టి రత్నకిరీటమును ధరించినట్టియుఁ దీక్ష్ణమగు ధనుస్సును ధరించినరాముఁడు జయించుగాక.

శ్లో. చేతస్థితం చింతకచింతనీయం, చింతాహరం చింతితపారిజాతమ్
అచింతనీయం బహుచింతయేహం, శమేనరామం భువనాభిరామమ్.

మ. సకలాత్మస్థితు సర్వచింతితుసి దానప్రాంగణప్రాంతక
ల్పకముఁ శౌరి నచింత్యు నచ్యుతుఁ బరబ్రహ్మంబుఁ జింతాహరుఁ
బ్రకటానందకరుఁ బరాత్పరుఁ బరుఁ రాముఁ ఘనశ్యాము దా
రకనాముఁ రవికోటిధాము మది నశ్రాంతంబుఁ జింతించెదన్. 95

తా. చిత్తమందున్నట్టియు భక్తులచేధ్యానింపఁదగినవాఁడును విచారము హరించువాఁడును గోరఁబడినవస్తువులకుఁ గల్పవృక్షమైనవాఁడును ఊహింప శక్యముఁగానట్టియు లోకములకు మనోహరుఁడైనవాఁడు నగు రాముని నేను విస్తారముగా ధ్యానించెదను.

శ్లో. సాకేతే శరదిందుకుందధవళే సౌధే మహామంటపే
పర్యస్తాగరుధూపధూమపటలే కర్పూరదీపోజ్జ్వలే
సుగ్రీవాంగదవాయుపుత్రసహితం సౌమిత్రిణా సేవితం
లీలామానుషవిగ్రహం రఘుపతిం రామం భజే శ్యామలమ్. 96

మ. ఘనసాకేతమునందుఁ గుందశరదాకాశచంద్రదీప్తంబు వా
సనలన్ జెన్నగుధూపధూమపటలీసంచ్ఛాదితంబు కర్పూరదీ
పనిరూఢం బగుసౌధమంటపమునన్ భ్రాతల్ కపుల్ గొల్వ మిం
చినలీలామనుజాకృతిన్ బరగు నా శ్రీరామునిన్ జింతించెదన్.

తా. అయోధ్యాపురమందు శరత్కాలచంద్రునివలెను మల్లెపువ్వులవలెను తెల్లనైన మేడయందు వ్యాప్తమైన అగరుధూపపు పొగలనుధూమము గలిగినట్టియుఁ గర్పూరదీపములచేఁ బ్రకాశించుచున్న గొప్పమంటపమందుండి సుగ్రీవునితో అంగదునితో నాంజనేయునితోఁ గూడినట్టియు లక్ష్మణునిచే సేవింపఁబడుచున్నట్టియు లీలామనుష్యరూపుఁ డైనట్టియు రఘుపతియైనట్టి శ్యామలవర్ణముగల రాముని సేవించుచున్నాను.

శ్లో. రామః పితా రాఘవఏవమాతా
రామోనుబంధుశ్చ సఖాహితశ్చ
రామోగురుర్మే పరమంచ దైవం
రామం వినా నాన్యమహం స్మరామి. 97

ఉ. రాముఁడు తండ్రి మజ్జనని రాముఁడె బంధుఁడు రామచంద్రుఁడే
రాముఁడు మిత్రుఁడున్ గురుఁడు రాఘవుఁడే పరదైవతం బగున్
రాముఁడె మాకు దిక్కుప్రభుఁడు రాముని గొల్చెద సంతసంబు శ్రీ
రామునిఁ దప్ప నన్యుల నిరంతర మెంచి దలంచ నెన్నఁడున్.

తా. నాకు రాముఁడే తండ్రి, రాముఁడే తల్లి, రాముఁడే చుట్టము, రాముఁడే యిష్టమిత్రుఁడు, రాముఁడే గురువు, రాముఁడే గొప్పదైవము, రామునిఁ దక్క నితరుని నేఁ దలంపను.

శ్లో. యాకృపా మునిసంత్రాణే, యాకృపాశపినాయకే
యావిభీషణరక్షాయాం, సా రామ మయిదీయతామ్. 98

ఉ. ఏదయచేతఁ దాపసుల నేలితొ వానరశేఖరాళిపై
నేదయ గల్గి యుండునో రహిన్ దశకంధరసోదరావనం

బేదయవేల నయ్యె నను • నిప్పుడు నాదయఁ బ్రోవు మయ్య దా
మోదర రామ రాఘవ స • ముజ్జ్వలభూషణ భక్తపోషణా.

తా. ఓ రామా! హనుమంతుని రక్షించుటయం దేదయగలదో సుగ్రీవునియం దేదయగలదో విభీషణుని రక్షించుటయం దేదయగలదో అదయ నో రామా నాయందుంచుము.

శ్లో. దయస్వ నాథే కరుణాకర రామచంద్ర
నిరస్య పాపాని మమాఖిలాని
త్వయ్యస్తు భక్తిం సుదృఢాం ప్రయచ్ఛ
సైవ ప్రసూతే హ్యఖిలా నభీష్టాన్. 99

చ. ప్రకటదయానిధీ వరద • రాఘవ రామ మదీయకల్మష
ప్రకరము లెల్లఁ బాపి తవ • పాదసరోజములందు భక్తినా
మకరమ్ము నీవు సంతసిలి నను • మానము లేక యొసంగుమయ్య నే
సకల కోర్కులు వడయుఁ దలఁచి • వారిగ సంభవ మందు నెప్పుడున్.

తా. దయాస్వరూపుఁడవైన యో రామచంద్రా నా యెల్ల పాపములను ద్రోసివేసి నీయందే మిక్కిలి దృఢమైన భక్తినిమ్ము. అదియే యెల్లకోరికలను బుట్టించుచున్నది.

శ్లో. అక్షీణబాణతూణీర, సమారోపితకార్ముకః
దశగ్రీవశిరోహంతా, శ్రీరామ శ్శరణం మమ.
శ్రీరామ ఏవ త్వం హి పితా చ మాతా
శ్రీరామ ఏవ త్వం హి సుహృచ్చ బంధుః
శ్రీరామ ఏవ త్వం హి గురుశ్చ గోష్ఠీ
శ్రీరామ ఏవ త్వం హి సమస్తమేవ. 100

ఉ. అక్షయబాణతూణధరుఁ • డై గుణరావము పిక్కటిల్లఁగా
రాక్షసరాజశీర్షములు గ • గ్రక్కున ద్రుంచిన నీవె దిక్కు సం
రక్షకుఁడు స్మరింపుము ప • రప్రదుఁ డంబయు తండ్రి తాతయుం
బక్షము భ్రాతయు న్సఖుఁడు • బంధుఁడు సర్వము నీవె రాఘవా.

తా. నాశనములేని బాణములుగల యంబులపొదియును ఎక్కుబెట్టఁబడిన ధనుస్సును గలవాఁడును రావణునిశిరస్సు గొట్టివేసిన రాముఁడు నాకు దిక్కు. ఓ రామా! నాకు నీవే తండ్రియును తల్లియును, ఓ రామా! నాకు నీవే స్నేహితుఁడును జుట్టమును, ఓ రామా! నాకు నీవే గురువును బ్రసంగమును, ఓ రామా! నాకు నీవే సమస్తమును.

శ్లో. పటుతరజలవాహధ్వాన మాదాయ చాపం
పవనజవనమేకం బాణ మాకృష్య తూణాత్
అభయవచనదాయీ సానుజ స్సర్వతో మే
రణహతదనుజేంద్రో రామచంద్ర స్సహాయః. 101

మ. జలధిధ్వానసమానఘోరనినదజ్యాయుక్తచాపంబునన్
జ్వలనాప్తోజ్జ్వలవేగ బాణమువడిన్ సంధించి దృష్టించి దో
ర్బలుఁ బౌలస్త్యు వధించి నిర్భయునిఁగా భక్తాళిఁ గావించి దా
పల సౌమిత్రి చెలంగఁ జెన్నగు రఘుస్వామే సహాయుం డగున్.

తా. మిక్కిలి పటుత్వముగల మేఘముయొక్క ధ్వనివంటి ధ్వనిగలధనుస్సును బట్టుకొని వాయువేగముగలయొక బాణము నంబులపొదినుండితీసి యుద్ధమందుఁ గొట్టఁబడిన రాక్షసశ్రేష్ఠులు గలిగినట్టియు నభయవాక్యము నిచ్చునట్టియుఁ దమ్మునితోఁగూడినరామచంద్రుఁడు నాకు సహాయుఁడు.

శ్లో. కౌసల్యాలసదాలవాలజనిత స్సీతాలతాలింగిత
స్సిక్తః పఙ్క్తిరథేన సోదరమహాశాఖాభి రత్యున్నతః
రక్షస్తీక్ష్ణనిదాఘపాటనపటుచ్ఛాయాభిరానందయ
న్నస్మద్వాంఛితసత్ఫలాని ఫలతు శ్రీరామకల్పద్రుమః. 102

శా. కౌసల్యాలసదాలవాలము ధరాకన్యాలతాయుక్తమున్
దాసాసక్తము నాజిపోషితము సోదర్యప్రశాఖంబు ర
క్షస్సుతీవ్రనిదాఘతప్తజనరక్షాదక్షిణాక్షీణఛా
యాసంపన్నము రామకల్పతరు విస్పష్టార్థంబు మా కీవుతన్.

తా. కౌసల్యయనెడు ప్రకాశించుచున్న పాదులనందు బుట్టినట్టియుఁ సీతయనెడు తీఁగచేఁ గౌఁగిలించఁబడినట్టియు దశరథునిచేఁ దడుపఁబడినట్టియుఁ దమ్ములనెడు గొప్పకొమ్మలచే మిక్కిలి పొడవైనట్టియు రాక్షసులనెడు గొప్ప వేఁడిని బోఁగొట్టుటయందు సమర్థమైననీడలచే నానందింపఁ జేయుచున్నట్టియు రాముఁడనెడు కల్పవృక్షము మాచేఁ గోరఁబడినమంచిఫలములను బంపుఁగాక.

శ్లో. నిగమశిఖరరత్నం నిత్యమాశాస్యరత్నం
జనమతనృపరత్నం జానకీరూపరత్నమ్
భువనవలయరత్నం భూభుజామేకరత్నం
రఘుకులవరరత్నం పాతు మాం రామరత్నమ్. 103

మ. నిగమాంతోజ్జ్వలరత్నమార్యనుతమాణిక్యంబు సీతాసతీ
సుగుణప్రాంచితరత్నమర్కకులభాస్వద్దివ్యసద్రత్నముల్
జగదత్యద్భుతరత్నముల్ సకలరాజస్థానరత్నంబు స
ద్యుగతం బౌ రఘురామరత్నము ననున్ రక్షించు నశ్రాంతమున్.

తా. వేదాంతములకు రత్నమైనట్టియు నిత్యముఁ గొనియాడఁదగినవారిలో శ్రేష్ఠమైనట్టియు మనుష్యులచేఁ బొగడఁబడినరాజులలో నుత్కృష్టమైనట్టియు సీతయొక్క రూపమునకు మాణిక్యమైనట్టియు లోకసమూహములలో శ్రేష్ఠమైనట్టియు రాజులలో ముఖ్యమైనట్టియు రవికులశ్రేష్ఠులలో శ్రేష్ఠమైన రామరూపరత్నము నన్ను రక్షించుఁగాక.

శ్లో. విశాలనేత్రం పరిపూర్ణగాత్రం, సీతాకళత్రం సురవైరిజైత్రమ్
కారుణ్యపాత్రం జగతఃపవిత్రం, శ్రీరామరత్నం ప్రణతోఽస్మి నిత్యమ్.

చ. వికసితపుండరీకదళవిశ్రుతనేత్రు సురారిజైత్రు సే
వకనుతిపాత్రు నీలఘనభాసనరత్నవిరాజిగాత్రుఁ దా
రకుఁ గమలాకళత్రుఁ ద్రిపురప్రకటాసుగజైత్రమిత్రునిన్
సకలజగత్పవిత్రు రఘుసత్తమరత్నము నాశ్రయించెదన్.

తా. విశాలములైనకన్నులుగలిగినట్టియు నిండైనదేహము గలిగినట్టియు సీతాదేవి భార్యగలిగినట్టియు రాక్షసులను జయించునట్టియు దయకు స్థానమైనట్టియు జగత్తునుఁ బవిత్రముఁ జేయునట్టి శ్రీరామరత్నము నెల్లపుడు నమస్కరించుచున్నాను.

శ్లో. శ్రీరామచంద్ర శ్శ్రితపారిజాత, స్సమస్తకల్యాణగుణాభిరామః
సీతాముఖాంభోరుహచంచరీకో, నిరంతరం మంగళ మాతనోతు.
ఇందీవరదళశ్యామః, పుండరీకనిభేక్షణః
ధృతకోదండతూణీరో, రామ ఏవ గతి ర్మమ. 105

మ. శ్రితమందారుఁడు సర్వశోభనగుణశ్రీరాముఁ డానందుఁ డం
చితసీతావదనాబ్జషట్పదము రాజీవాయతాక్షుండు మా
నితతూణీరధనుర్ధరుండు వరుఁడున్ నీలోత్పలాంభోదరా
భితుఁ డౌ రాముఁడు మాకు దిక్కయి శుభంబుల్ సేసి యిచ్చుం గృపన్.

తా. ఆశ్రితులకుఁ బారిజాతవృక్షమైనవాఁడు ఎల్లశుభగుణములచే మనోహరుఁడును సీతయొక్క ముఖపద్మమునకుఁ దుమ్మెదయైనవాఁడును అగు శ్రీరామచంద్రుఁ డెడతెగనిశుభమును జేయుఁగాక. నల్లకలువరేకులవలె నల్లనైనవాఁడును దెల్లతామరల

నాథేతి నాగశయనేతి సదాస్తువంతం
మాం పాహి భీత మనిశం కృపణం కృపాళో. 108

చ. హరి రఘురామచంద్రుఁడు ద॰యాపరుఁ డాశ్రితవత్సలుండు దు
స్తరభవబంధమోచనుఁడు ॰ సర్వశయానుఁడు విశ్వనాథుఁ డం
చరసి నిరంతరంబు హృద॰యంబున నెంచఁగ నెంతవాఁడ ము
ష్కరుఁడను లుబ్ధుఁడం దురిత॰కర్ముఁడఁ బ్రోవుము రామరాఘవా.

తా. శ్రీరామచంద్రాయని, దయాసక్తుఁడాయని, భక్తులిష్టులుగలవాఁడాయని, సంసారబంధమువిడిపించువాఁడాయని, నాథాయని, శేషశయనుఁడాయని, యెల్లపుడు స్తోత్రిముఁజేయుచున్నట్టి భయపడుచున్నట్టి దీనుఁడనైన నన్ను ఓదయాస్వభావుఁడా రక్షింపుము.

శ్లో. రామచంద్రచరితామృతపానం, సోమపానశతకోటిసమానమ్
సోమపానశతకోటిభిరీయా, జ్జన్మనైతి రఘునాయకనామ్నా. 109

చ. అరయఁగ రామచంద్రచరి॰తామృతపానసమానమై తగుఁ
గురుతరసోమపానశత॰కోటులు తద్వ్యధసోమపానని
ర్భరులకు జన్మముల్ గలవు ॰ రామసమాఖ్యనిరంతరంబు సు
స్థిరత జపించువారలకుఁ ॰ జేకురనేరవు జన్మకర్మముల్.

తా. రామచంద్రునిచరితామృతమును ద్రాగుట బహుసోమపానములతో సమానము. మనుష్యుఁడు బహుసోమపానములచే జన్మమును బొందును. శ్రీరామ నామముచే జన్మమును బొందఁడు.

శ్లో. రామరామదయాసింధో, రావణారే జగత్పతే
త్వత్పాదకమలాసక్తిః, ర్భవే జ్జన్మనిజన్మని. 110

చ. హరిహరి రామరామ కరు॰ణాంబునిధీ జగదేకనాథదా
శరథి దశాననాద్రికులి॰శాయుధ నా దగువిన్నపంబు సా
దరమునఁ జిత్తగింపు క్రమ॰తఁ భువి జన్మము లెన్ని గల్గినఁ
సరసభవత్పదాంబుజర॰జఃకణసేవ యొనర్చునట్లుగాన్.

తా. ఓరామా రామా! దయాసముద్రుఁడా! నీపాదపద్మములయందు దాసక్తి ప్రతిజన్మమందు నగుఁగాక.

శ్లో. శ్రీరాఘవం రామచంద్రం, రావణారిం రమాపతిమ్
రాజీవలోచనం రామం, తం వందే రఘునాయకమ్. 111

ఉ. శ్రీరఘురామచంద్రునకు • శ్రీకరమూర్తికి రావణారికిన్
శ్రీరమణీమణీపతికి • సేవితయోగిహృదబ్జవాసికిన్
సారసపత్త్రనేత్రునకు • సన్నుతమానిసుపర్వకోటికిన్
శౌరికి రాఘవేంద్రునకు • సంతత మేను నమస్కరించెదన్.

తా. శ్రీరాఘవుని, రామచంద్రుని, రావణశత్రుని, లక్ష్మీనాథుని, పద్మముల వంటి నేత్రములు గలవానిని, రఘునాయకుని, ఆరాముని నమస్కరించుచున్నాను.

శ్లో. యత్పాదపంకజరజశ్శ్రుతిభి ర్విమృగ్యం
యన్నాభిపంకజభవః కమలాసనస్స్యాత్
యన్నామసారరసికో భగవాన్ పురారి
స్తంరామచంద్ర మనిశం హృది భావయామి. 112

ఉ. ఎవ్వనిపాదపద్మరజ • మెల్ల శ్రుతుల్ వెదకంగ నేరకుం
డెవ్వనినాభికంజమున • నేర్పడ సంభవమొందె గీర్వరుం
డెవ్వనినామసారము భ•జించి బుధాగ్రణి యయ్యె శంకరుం
డవ్విభు రామభూధవు న•హర్నిశమున్ మది సంస్మరించెదన్.

తా. ఏరాముని పాదపద్మములయందలిధూళి వేదములచేఁ దెలియ శక్యము గాదో బ్రహ్మ యెవ్వని నాభిపద్మమందుఁబుట్టెనో భగవంతుఁడైనశివుఁ డెవ్వనినామ సారరసము నెఱిఁగినవాఁడో యట్టిరామచంద్రు నెల్లపుడు హృదయమందు ధ్యానించు చున్నాను.

శ్లో. యస్యావతారచరితాని విరించిలోకే
గాయంతి నారదముఖా భవపద్మజాద్యాః
ఆనందజాశ్రుపరిషిక్తకుచాగ్రసీమా
వాగీశ్వరీచతమహం శరణం ప్రపద్యే. 113

మ. ప్రకటంబైనవిరించిలోకమున నే•భవ్యాత్ము దివ్యావతా
రకథల్ కీర్తనఁ జేతు రబ్జభవశ•ర్వాణీశముఖ్యామర
ప్రకరం బార్యులు నారదాదులును గీ•ర్వాభామామహానందబా
ష్పకణార్ద్రిస్తనయై స్మరించు నెపు డా•త్మ్మేశు సేవించెదన్.

తా. ఏరామునియవతారచరిత్రములను బ్రహ్మలోకమందు నారదుఁడు మొదలగువారును, శివుఁడు బ్రహ్మ మొదలగువారును, ఆనందబాష్పములచేఁ దడుపఁబడిన నాగ్రప్రదేశముగల సరస్వతియు గానముఁ జేయుదురో అట్టిరాముని నేను శరణుఁ బొందుచున్నాను.

శ్లో॥ జాతిభ్రష్టోతిపాపీ పరధనపరదారేషు సక్తోథవా స్తేయీ బ్రహ్మఘ్నమాతాపితృవధనిరతో యోగిబృందాపకారీ
ధ్యేయం కర్ణామృతం యః పఠతిహి సతతం రామచంద్రస్య భక్త్యా
యోగీంద్రై రప్యలభ్యం పదమపి లభతే సర్వదేవైశ్చ సేవ్యమ్. 114

మ. పరభామాపరవిత్తసంగ్రహులును విప్రఘ్నులుం దుశ్చరిత్రులు దు
స్తరపాపాత్ములు మాతృపితృవధలున్ వంశభ్రష్టులుం జోరులున్ త్తమో
త్కరనిందాస్పదులైన బోనియతులై కర్ణామృతంబుం బఠిం
ప రహిన్ యోగుల కందరానిపదముం బ్రాపించు గాఢంబుగాన్.

తా. కులభ్రష్టుఁడైనను పాపాత్ముఁడైనను ఇతరులసొమ్మునం దితరులభార్యయం దాసక్తుఁడైనను దొంగయైనను బ్రహ్మహత్యఁజేసినవాఁడుఁ దల్లిదండ్రులను గొట్టుటయం దాసక్తుఁడైనను మునిసమూహమున కపకారముఁ జేయువాఁడైనను ఏభక్తుఁడు ధ్యానింపఁదగిన రాముని కర్ణామృతమును ఎల్లపుడుఁ జదువుచున్నాఁడో అట్టివాఁడు యోగీశ్వరులకునైతము బొంద శక్యముగానట్టి యెల్లదేవతలచే సేవింపఁదగినస్థానమును బొందుచున్నాఁడు.

మ. శివసామ్యం బగునాడిశంకరుఁడు మున్ శ్రీరామకర్ణామృతం
బవనిన్ సంస్కృతఁ జేర్చరించె నిది యోగానీకముం జేకూర్చు పం
శివరాశిం దుప్రసిద్ధసిద్ధకవి నే శ్రద్ధం దెనింగించి రా
ఘవ! పూదండఁగ నిచ్చినాఁడఁ గొనుమా కల్పంబుగా సత్కృపన్.

మాలిని. వనదనిభశరీరా నర్మితామర్త్యవారా
కనకశిఖరిధీరా కంధిగర్వాపహారా
దనుజఘనసమీరా ధాత్రిజాచిత్తచోరా
మునిజనసువిచారా మోక్షలక్ష్మీవిహారా.

మ. ఇది శ్రీరామపదారవిందమకరందేచ్ఛాతిసన్నత్రపా
ట్పదవిజ్ఞానపదాబ్జరేణుపటలప్రాప్తోత్తమాంగోల్లస
త్సదితాంతరగకరణుండు సిద్ధకవిమాన్యుం డైనరామావనీ
శదయాలోకనఁ జెప్పె మూడవగునాశ్వాసం బభీష్టాప్తికిన్.

# చతుర్థాశ్వాసము.

---

శ్లో. శ్రీరామం జనకాత్మజాకుచతటీశ్రీగంధసంగోల్లస
ద్వక్షోవీధియుదార మాశ్రితమునిప్రాదుర్భవత్కల్పకమ్
బ్రహ్మేశానముఖామరస్తుతమజం బ్రహ్మాండభాండాధిపం
వందే కోసలకన్యకాసుతమహం వారాశిగర్వాపహమ్. 1

శా. శ్రీసీతాకుచకుంభచర్చితలసచ్ఛ్రీచందనాలంకృతుఁ
కౌసల్యాత్మజు మౌనికల్పకము శ్రీకంఠాబ్జభూముఖ్యగో
దాసస్తోత్రు సముద్రగర్వహనుఁ బ్రహ్మాండభాండాధిపుఁ
రాసూనుఁ సువితీర్ణ జన్మరహితుఁ రామప్రభుఁ గొల్చెదన్.

తా. సీతయొక్క స్తనప్రదేశమందలి గంధపుబురదచేఁ బ్రకాశించుచున్న వక్షస్థలము గలిగినట్టియుఁ దాతయైనట్టియు నాశ్రితులైన మునులకుఁ బ్రత్యక్షమైన కల్పవృక్షమైనట్టియు బ్రహ్మ శివుఁడు మొదలగు దేవతలచే స్తోత్రము చేయఁబడినట్టియుఁ బుట్టువులేనట్టి బ్రహ్మాండముల కధిపతియైనట్టియు కౌసల్యకుఁ గొమారుఁడైనట్టియు సముద్రగర్వమును హరించినరాముని నమస్కరించుచున్నాను.

శ్లో. సాకేతే మణినిర్మితే ప్రవిలసత్సౌధాయుతానాంశతే
అంతర్గేహ మతీతభానునిలయే చంచత్పతాకోజ్జ్వలే
హార్మ్యే భర్మమయేఘనాఘనరవైర్ఘంటాశతైరావృతే
డోలాకల్పవిహారిణం రఘుపతిం సీతాసమేతం భజే. 2

మ. తతప్రత్యగ్రమణీశతాయుతలసత్సౌధప్రతానోపశో
భితసాకేతమునఁ బతాకయుతమై బెంపొందు నంతర్గృహ
స్థితచామీకరఘంటికారవయుతశ్రీడోలికాశయ్యపై
క్షితిపుత్రీయుతకేళిఁ జెన్నలరు నాశ్రీరాము సేవించెదన్.

తా. అయోధ్యయందు రత్నములచేత నిర్మింపఁబడిన ప్రకాశించుచున్న మేడలవందయందు గృహమధ్యమందుఁ బ్రకాశించుచున్న జెండాలచేతఁ బ్రకాశించుచున్నది

గనుక నే సూర్యకిరణ ప్రసారము లేనట్టియు బంగారువికారము లైనఘణఘణధ్వనిచేయు చున్నబహుఘంటలచే నావరింపఁబడినట్టి మేడయందు ఉయ్యాలతుందలి శయ్యయందు విహరించుచున్నట్టి సీతతోఁగూడినరాముని సేవించుచున్నాను.

శ్లో. సాకే తే సౌధబద్ధధ్వజశతమహితే రాజమార్గే విశాలే
ఘంటారావై రుపేతే కనకకుథయుతే గంధనాగే వసంతమ్
దివ్యాకల్పోజ్వలాంగం రథగజతురగై రావృతం సుప్రసన్నం
రామం శ్వేతాతపత్రావృతముఖకమలం చింతయామ్యంతరంగే.   3

మ. సరసంబై శతకోటికేతనలసత్సౌధాళిసాకేతస
త్స్ఫురిఘంటాపథమార్గమందున మణీభూషాంచితుండై యలం
కరణేభేంద్రము నెక్కినై జనతురంగంబుల్ ప్రవేష్టింప వి
స్ఫురితచ్ఛత్రసముజ్జ్వలుం డయినరాముం గొల్తు నాత్మస్థితున్.

తా. అయోధ్యయందు మేడలయందుఁ గట్టఁబడిన పెక్కుజెండాలచేఁబ్రకాశించుచున్న విశాలమైన రాజమార్గమందు ఘంటలధ్వనులతోఁగూడినట్టి బంగారపుఆస్తరణములతోఁ గూడిన మదపుటేనుఁగునం దున్నట్టియుఁ బ్రశస్తములైనట్టియలంకారములచేఁ బ్రకాశించుచున్నదేహము గలిగినట్టి రథములచేత ఏనుఁగులచేత గుఱ్ఱములచేత నావరించఁబడినట్టియు మిక్కిలి నిర్మలుఁడైనట్టియుఁ దెల్లగొడుగుచే నావరింపఁబడిన మొగము గల రామునిఁ జిత్తమందు దలఁచుచున్నాను.

శ్లో. సాకే తే మణికోటిభి స్సుఖచితే దివ్యాంబరాలంకృతే
హేమస్తంభసహస్రకోటిఘటితే తారాపథాత్యున్నతే
రమ్యస్వర్ణమయే విచిత్రభవనే దివ్యంతరిక్షే ముదా
రామం స్మేరముఖాంబుజం రఘుపతిం సీతాసమేతం భజే.   4

మ. ప్రకటాయోధ్యను నూత్నరత్నమయమై రమ్యంబునై తారకా
నికరాత్యున్నతమై సువర్ణమణిసందీప్తాయుతస్తంభస
త్ప్రకరంబై విమలాంబరోజ్జ్వలితమౌ చోద్యాలయావాసుఁడై
సకళత్రుండు దరస్మితాస్యుఁ డగునాత్మాజేశు సేవించెదన్.

తా. అయోధ్యయందు బహురత్నములచే స్థాపించఁబడినట్టి ప్రశస్తమైనబట్టలచేత నలంకరింపఁబడినట్టి యనేకములైన బంగారు స్తంభములచేఁగూర్చఁబడినట్టి

నక్షత్రమార్గముకంటెఁ బొడవైనట్టి సుందరమైన బంగారువికారమైన చిత్రమైన గృహమందు భూమియందు నంతరిక్షమందు సంతోషముతోఁ గూడినట్టి నవ్వుచున్న ముఖపద్మము గలిగినట్టియుఁ సీతతోఁగూడినరాముని సేవించుచున్నాను.

శ్లో. సాకేతే మణితోరణాంచితలసద్వీథీశతప్రాంగణే
సానందం భరతాదిభిస్సహచరై రత్యంతమోదాకరైః
క్రీడంతం మణికందుకైః కరగతై రన్యోన్యమత్యుజ్జ్వలైః
పౌరస్త్రీనయనోత్సవైః ప్రతిదినం పూజ్యం భజే రాఘవమ్. 5

మ. తతసాకేతపురంబునందు మణిసంతానస్ఫురత్తోరణాం
చితవీథీశతచత్వరంబున మణిశ్రేష్ఠోజ్జ్వలత్కందుక
స్థితహస్తుండయి సోదరాదియుతుఁడై స్త్రీలోలనేత్రోత్సవా
ర్చితుఁడై నిత్యముఁ గ్రీడలన్మెలఁగు నా శ్రీరాము సేవించెదన్.

తా. అయోధ్యయందు మణిఖచితములైన బహిర్ద్వారములచేత నొప్పుచున్న ప్రకాశించుచున్న బహువీథులుగల ముంగిటియందు నత్యంతసంతోషమునకు స్థానభూతులైనభరతుఁడు మొదలగుస్నేహితులతోఁగూడ నొకదానిచేనొకటి ప్రకాశించుచున్న రత్నపుబంతులచే నాడుచున్నట్టి పట్టణమందలి స్త్రీలనేత్రములతోఁ గూడినట్టియుఁ (అనఁగా నేత్రోత్సవముఁ జేయునట్టి) బూజింపఁదగినరాముని బ్రతిదినమందును సేవించుచున్నాను.

శ్లో. సాకేతే కనకాద్రిశృంగఘటితే కల్పద్రుమైరావృతే
వైడూర్యాదిమణీంద్రకాంతిఘటితే దేవేంద్రనీలోజ్జ్వలే
కుర్వంతం మణినాయకౌ మణిగృహే మాణిక్యపీఠే భజే
పుత్రౌ మన్మథసుందరౌ కుశలవౌ సంసేవ్యపాదావిహా. 6

మ. ప్రకటాయోధ్యను మేరుశృంగనిభమై భవ్యామరానోకహ
ప్రకరప్రావృతమై మణిస్థగితమై రంజిల్లుసద్మంబునం
దకలంకం బగురత్నపీఠిసుమశస్త్రాకారులైనట్టిపు
త్రకయుగ్మార్చితపాదపద్ముఁ డగు శ్రీరామాధిపుం గొల్చెదన్.

తా. అయోధ్యయందు మేరుశిఖరముచేఁ గూర్పఁబడినట్టియుఁ గల్పవృక్షముల చేత నావరించఁబడినట్టియు వైడూర్యములు మొదలగు మణిశ్రేష్ఠములచేఁ గూర్పఁబడినట్టియు నింద్రనీలములచేఁ బ్రకాశించుచున్నట్టియు రత్నగృహమందు మణివికారమైన

సింహాసనమందు మన్మథునివలె సుందరులైనట్టి యితరులకు సేవింపఁదగిన పాదములు గలిగినట్టి కోమలములైన కుశలవులను రత్నఖచితములైన పదకములు గలవారినిఁగాఁ జేయు చున్న రాముని సేవించుచున్నాను.

శ్లో. సాకేతే జననీకరార్పితలసత్కస్తూరికాసుందరే
ఫాలేమౌక్తికజాలకం శశినిభం స్వర్ణాంకితం వర్తులమ్
చూడాలంబమనోజ్ఞహారకలితం బిభ్రాణ మత్యుజ్జ్వలం
రామం కోసలపుత్రికావరసుతం సీతాసమేతం భజే. 7

మ. నుదుటన్ కస్తురిబొట్టుతల్లియును సం◆న్యస్తాలలాంబు ప
ర్వదినేందూజ్జ్వలమై సువర్ణమయమై ◆ రంజిల్ల సాకేతస
త్సదనుండై రమణీయహారధృతుఁడై ◆ స్వస్థానుఁడై భక్తలో
కదయాళుం డగుకౌసలేయు గొలుతున్ ◆ లక్ష్మీశు రామప్రభున్.

తా. అయోధ్యయందుఁ దల్లిచేతితో నుంచఁబడిన కస్తూరిబొట్టుచే సుందరమైన నుదుటియందుఁ జంద్రునితో సమానమైనట్టి బంగారుచే నలంకరింపఁబడినట్టి గుండ్రనైనట్టి శిఖయందు వ్రేలుచున్న మనోహరమైన హారముచేఁ బ్రకాశించుచున్నట్టి ముత్తెపుఁ జేరులను ధరించుచున్నట్టియు మిక్కిలి ప్రకాశించుచున్నట్టియు కౌసల్యాదేవీ వరకుమారుఁడైనట్టియు సీతతోఁగూడినట్టి రాముని సేవించుచున్నాను.

శ్లో. సాకేతే సరయూజలేతివిమలేప్రోత్ఫుల్లపద్మాంకితే
దివ్యస్త్రీశతకోటినృత్యరుచిరే స్వర్గాపగాసుందరే
పశ్యంతీషు సురాంగనాసు శపథం క్రీడంత ముర్వీసుతాం
బాహుభ్యాం విపులోదకేన రుచిరం సీతాసమేతం భజే. 8

మ. అమలంబై వికచాబ్జమై దివిజక◆న్యాజాలలీలార్హమై
యమరద్వీపవతీసమానసరయూ◆ హ్రాదిన్ సురస్త్రీసమూ
హములున్ గాంచ సభార్యుఁడై కరములం ◆ దంభోవిహారంబు చి
త్రము రంజిల్లఁగఁ జేయు రాఘవు నయో◆ధ్యానాథు సేవించెదన్.

తా. అయోధ్యయందు మిక్కిలి నిర్మలమైనట్టి వికసించినపద్మములచే నలంకరింపఁబడినట్టి బహుదేవతాస్త్రీలయొక్క నాట్యముచేత సుందరమైనట్టి గంగవలె సుందరమైనట్టి సరయూనదియొక్క నీటియందు దేవతాస్త్రీలు చూచుచుండఁగా పంతము

సేవకోని చేతులచే నిర్మలోదకముచే సీతను గ్రీడించుచున్నట్టియు (అనఁగా జల్లుపోరా టము సీతతోఁ జేయుచున్న) సీతతోఁ గూడిన రాముని సేవించుచున్నాను.

శ్లో. కదాసురతరుస్థలే కనకమంటపే పుష్పకే
వరాసన ముపేయుషం వసుదళారవిందోజ్జ్వలే
కరేణ హృదయస్పృశా కలితముద్రచిన్ముద్రికా
మమస్ఫురతు వాసనామనసిబద్ధవీరాసనా. 9

మ. ఒకకాలంబునఁ గల్పశాఖికడఁ జె•న్నొప్పారుసౌవర్ణర
త్నకసన్మందిరమధ్యహేమదళప•ద్మభ్రాజితం బైనపు
ష్పకమధ్యంబున రత్నపీఠినిజవ•క్షస్స్థహస్తుండు తా
రకచిన్ముద్రకరాంబుజుండు విబుధా•రాధ్యుండు వీరాసనుం
డకలంకుం డగురామచంద్రుఁడు మదీ•యాత్మస్థలిన్ భాసిలున్.

తా. కల్పవృక్షప్రదేశమందు బంగారుమంటపముగల అష్టదళపద్మముచే శోభించు పుష్పకమందు శ్రేష్ఠమైనపీఠమును బొందినట్టియు గుండెకుఁ దగులుచున్న హస్తముచేత ధరించఁబడినజ్ఞానముద్ర గలిగినట్టియుఁ గట్టఁబడినవీరాసనము గలిగి నట్టియు (రామరూప) సంస్కారము నాకెప్పుడు స్ఫురించుచు.

శ్లో. నదీరమణబంధనం మతిమతా ముదారం ధనం
జగద్ధతతరంధనం సకలకామనిష్యందనమ్
విలిప్తహరిచందనం వినుతయాతసంక్రందనం
భజామి రఘునందనం పవననందనస్యందనమ్. 10

ఉ. చందనచర్చితుండు రఘు•సత్తముఁ డంబుధిబంధనుండు సం
క్రందనవందితుండు శ్రిత•రాజియుదారధనుండు సంతతా
నందుఁడు గంధవాహప్రియ•నందనవాహనుఁ డిష్టదాయిపా
రంజరనీలవర్ణుఁ డగు•రాముపదాబ్జము లాశ్రయించెదన్.

తా. సముద్రుని బంధించినట్టియు యోగ్యులకు గొప్పధనమైనట్టియు జగత్తుల యొక్క కొట్టఁబడినతాపము గలిగినట్టియు నెల్లకోరికలను బ్రవహించునట్టియుఁ బూ సికొనఁబడినగంధము గలిగినట్టియు స్తోత్రముచేయుచున్న యింద్రుఁడు గలిగినట్టియు నాంజనేయుఁడు వాహనము గలిగినట్టియు రాముని సేవించుచున్నాను.

శ్లో. రక్తాంభోరుహలోచనం కువలయశ్యామం కపోలం ధనుః
కోటిన్యస్తకరాంబుజం ధృతతనుత్రాణం జటామండితమ్

జేతారం ఖరదూషణత్రిశిరసా మాంబద్ధగోధాంగుళీ
త్రాణం మార్గణపూర్ణతూణయుగళం కోదండరామం భజే. 11

సీ. శరసంపూర్ణనిషంగియై కవచియై • శ్యామాంగుఁడై విశ్వసృ
ద్ధరుఁడై శోణసరోజనేత్రయుగుఁడై • గోధాంగుళిత్రాణుఁడై
ఖరముఖ్యాసురయూథసంహరణుఁడై • కాండాసనాగ్రస్ఫుర
ద్గురుహస్తుం డగునాజటిం గొలిచెదం • గోదండరామప్రభున్.

తా. ఎఱ్ఱదామరవంటి నేత్రములు గలిగినట్టియు నల్లకలువవలె నల్లనైనట్టియు బ్రహ్మను పరిపాలించునట్టియు ధనుస్సుయొక్క అగ్రమం దుంచఁబడినహస్తపద్మము గలిగినట్టియు ధరించఁబడినకవచము గలిగినట్టియు జటలచేత నలంకరించఁబడినట్టియు ఖరదూషణత్రిశిరులను జయించినట్టియుఁ గట్టఁబడిన ఉడుముతోలుత్రేళ్లతొడుగు గలిగినట్టియు బాణములచే నిండినయంబులపొదులజోడు గలిగినట్టియు ధనుర్ధారియు నగు రాముని సేవించుచున్నాను.

శ్లో. శ్రీమత్కల్పద్రుమూలే సకలమణిమయే మండపేపుష్పకాఖ్యే
తన్మధ్యేసూర్యబింబద్యుతిసరసిరుహేశోభమానాష్టపత్రే
పశ్యన్నిష్టాంగదీప్త్యా జనకతనయయా వామభోగోపసేవ్యః
సౌమిత్రిం భానుపుత్రం పవనసుతయుతం పాతు మాం రామచన్ద్రః.

చ. సురతరుమూలనూత్నమణి•శోభితమండపమధ్యపుష్పకాం
తరరవిదీపితాష్టదళ•తామరసాంతరవాసియై ధరా
వరసుతవామభాగమున • భాసిల లక్ష్మణవాయుజాదిస
త్పురుషసమర్చితుం డయిన•భూపతిరాముఁడు నన్నుఁ బ్రోవుతన్.

తా. శోభగల కల్పవృక్షములయెదుట నవరత్నవికారమైనట్టి పుష్పకమనునట్టి మండపమందు దానినడుమఁ బ్రకాశించుచున్న యెనిమిదిరేకులుగల సూర్యబింబకాంతి గలపద్మమందున్నట్టియు, నిష్టమైన శరీరశోభగల సీతాదేవిచే నెడమవైపున సేవించఁ బడినట్టియు నాంజనేయునితోఁ గూడిన లక్ష్మణు సుగ్రీవునిఁ జూచుచున్నట్టియు, రామచంద్రమూర్తి నన్నురక్షించుఁగాక.

శ్లో. వినీలజలదోపమం విమలచంద్రబింబాననం
వినిద్రమణికుండలం వికచపుండరీకేక్షణమ్
విభిన్నదనుజాధిపం విధృతబాణబాణాసనం
విభీషణవరప్రదం విజయరామమీడే నిశమ్. 13

మ. హరినీలాంబుదగాత్రుఁ దామరసపత్త్రాక్షుఁ శరచ్చంద్రభా
సురవక్త్రుఁ మణికుండలాంచితు ధనుస్తూణీరబాణోజ్జ్వలుఁ
సురవిద్వేషణపోషణాంతకు మునిస్తుత్యుఁ దశగ్రీవసో
దరసమ్మోదవిధాయకు న్వరదు సీతారాముఁ జింతించెదన్.

తా. నల్లనిమేఘముతో సామ్యముగలిగినట్టియు నిర్మలమైన చంద్రబింబము వంటి మొగము గలిగినట్టియు ప్రకాశించుచున్న మాణిక్యకుండలములు గలిగినట్టియు వికసించిన పద్మమువంటి నేత్రము గలిగినట్టియుఁ గొట్టఁబడిన రావణుఁడు గలిగినట్టియు ధరించఁబడిన ధనుర్బాణములు గలిగినట్టియు విభీషణునకు వరమునిచ్చినట్టియు జయమునొందినరాముని సేవించుచున్నాను.

శ్లో. రాజద్రాజీవనేత్రం రఘుకులతిలకం రంజితాశేషలోకం
వామాంకారూఢసీతం వరశరధనుషం కుండలోద్దీప్తగండమ్
శ్యామం శాంతం ప్రసన్నం దరహసితముఖం వజ్రసింహాసనస్థం
రామం రాజత్కిరీటం రవిశతవిశదం రాజరాజేశమీడే. 14

చ. సరసిజనేత్రుఁ జాపధరు శాంతుఁ బ్రసన్ను దరస్మితాస్య భా
స్కరకులులోకరంజితుఁ బ్రకాశకిరీటు సువర్ణకుండలుఁ
ధరణిసుతావలోకను బతంగళతోజ్జ్వలు వజ్రపీఠుఁ గం
ధరనిభనీలు రాజవరుదాశరథిన్ శరణంబు వేఁడెదన్.

తా. ప్రకాశించుచున్న పద్మమువంటి నేత్రములు గలిగినట్టియు రఘువంశశ్రేష్ఠుఁడైనట్టియుఁ బ్రకాశింపఁ జేయఁబడు నెల్లలోకములు గలిగినట్టియు ఎడమతొడయందుఁ జూపునందు సీతగలిగినట్టియు శ్రేష్ఠమైనధనుర్బాణములు గలిగినట్టియుఁ గుండలములచే బ్రకాశించుచున్న గండస్థలములు గలిగినట్టియు నల్లనైనట్టియు శాంతుఁడైనట్టియుఁ బ్రసన్నుఁడైనట్టియు మందహాసముఖము గలిగినట్టియు వజ్రసింహాసనమందున్నట్టియుఁ బ్రకాశించుచున్నకిరీటము గలిగినట్టియు సూర్యశతమువలె నిర్మలుఁడైనట్టియుఁ రాజరాజుల కధిపతి యగురాముని స్తుతించుచున్నాను.

శ్లో. భద్రవ్యాఖ్యానముద్రాంకరసరసిరుహేదక్షిణే ధారయంతం
సవ్యేజానున్యుదారం కరమపిచముదా ధారయంతం స్ఫురంతమ్
పశ్యంతం వామభాగే కరధృతకమలాం చిత్రభూషావిశేషాం
వైదేహీంకాంచనాభ్యాం స్తనభరనమితాంభావయే రామచంద్రమ్.

మ. ఒకహస్తాబ్జము జానువం దునిచి వేఱొక్కంట వ్యాఖ్యానము
ద్రకరం బూని సువర్ణ వర్ణధృతపద్మిన్ జిత్రభూషాన్వితన్

ప్రకటోరస్థలజాతనవ్యప్రియగుభార్యం దాపలం గాంచుతా
రకనామున్ రవికోటిధాముఁ డగు శ్రీరామున్ బ్రశంసించెదన్. 15

తా. కుడిచేతియందు మంగళమగు నుపదేశముద్రను ధరించుచున్నట్టియు నెడమ మోకాలియందు గొప్పదియగు హస్తమును సంతోషముచే ధరించుచున్నట్టియుఁ బ్రకాశించుచున్నట్టియుఁ జేత ధరించఁబడినపద్మము గలిగినట్టియుఁ జిత్రములైన యలంకారవిశేషములు గలిగినట్టియు బంగారుచేత నొప్పుచున్నట్టియు స్తనభారముచేత నంగినట్టియు సీతను జూచుచున్న రామచంద్రుని ధ్యానించుచున్నాను.

శ్లో. విబుధవిటపిమూలే జానకీలక్ష్మణాభ్యాం
సహిత మనిలవేగం బాణ మాదాయ చాపమ్
బహుళశరపటుతూణం రమ్యపుష్పోపహారం
విబుధభరణచిత్తం చింతయే రామచంద్రమ్. 16

మ. అమరాగస్థలిధారణీతనయతో హార్దంబునన్ గూడి స
త్సుమదామాంచితుఁడై యనేకశరసంశోభానిషంగాఢ్యుఁడై
యమరత్రాణధురీణుఁడై పవనవేగాజిహ్మగోగ్రాస్త్రుఁడై
కమనీయాకృతి యైనరామధరణీకాంతున్ మదిన్ గొల్చెదన్.

తా. కల్పవృక్షముయొక్క మొదట సీతాలక్ష్మణులతోఁ గూడినట్టియు వాయువేగముగలబాణమును ధరించి విస్తారమైన బాణములచేత సమర్థమైన యంబులపొది గలిగినట్టియు సుందరమైన పువ్వులకానుక గలిగినట్టియు విద్వాంసులయొక్క ధరించుట యందుఁ జిత్తము గలిగినట్టియు రామచంద్రుని ధ్యానించుచున్నాను.

శ్లో. జానాతి రామతవతత్త్వగతిం హనూమాన్
జానాతి రామతవసఖ్యగతిం కపీశః
జానాతి రామతవయుద్ధగతిం దశాస్యో
జానాతి రామధనదానుజఏవ సత్యమ్. 17

ఉ. తావకమిత్రభావమును తానురసాప్తసుతుం డెఱుంగు మీ
పావనతత్త్వలక్షణము పావకమిత్రసుతుం డెఱుంగు ధా
త్రీవర నీదుసంగరగతిం దశకంఠుఁ డెఱుంగు భక్తలో
కావన నీదుసత్యము దశాస్యసితమ్ముఁ డెఱుంగు రాఘవా.

తా. ఓరామా! నీతత్త్వమార్గమును హనుమంతుఁ డెఱుఁగును. ఓరామా! నీస్నేహమార్గమును సుగ్రీవుఁ డెఱుఁగును. ఓరామా! నీయుద్ధమార్గమును రావణుఁ డెఱుఁగును. ఓరామా! నీసత్యమును విభీషణుఁ డెఱుఁగును.

శ్లో. హేరామ హేరమణ హేజగదేకవీర
హేనాథ హేరఘుపతే కరుణాలవాల
హేజానకీరమణ హేజగదేకబంధో
మాం పాహి దీన మనిశం కృపణం కృతఘ్నమ్. 18

శా. ఓరామా జగదేకవీరరమణా ♦ యోజానకీనాయకా
యోరాజేంద్ర కృపాలవాలవరదా ♦ యోవిశ్వవిశ్వావనా
యోరాజీవదళాక్ష యోరఘుపతే ♦ యోనాథ మన్నింపు నా
నేరం బేను కృతఘ్నుఁడన్ కృపణుఁడన్ ♦ నిన్నే మది న్నమ్మితిన్.

తా. ఓరామా! ఓమనోహరుఁడా! ఓజగత్తులయందు ముఖ్యవీరుఁడా! ఓరఘుపతీ! ఓదయాకరుఁడా! ఓసీతాపతీ! ఓజగత్తులకు ముఖ్యబంధుఁడా! దీనుఁడనైనట్టియుఁ గృతఘ్నుఁడ నైనట్టియు నన్ను నెల్లపుడు రక్షించు.

శ్లో. అయోధ్యానాథ రాజేంద్ర, సీతాకాంతజగత్పతే
శ్రీరామపుండరీకాక్ష రామచంద్రనమోస్తుతే. 19

మ. శిరసా కేతపురాధినాథునకు ధా♦త్రీపుత్రికాభర్తకున్
ధరణీజేంద్రునకున్ జగత్పతికి దై♦త్యధ్వంసికి స్నవ్యవి
స్ఫురితామ్భోరుహపత్రనేత్రునకు దే♦జోరాశికి న్పావని
స్తరికిన్ శ్రీరఘురామచంద్రునకు న♦శ్రాంతంబు నే మ్రొక్కెదన్.

తా. ఓయయోధ్యాధిపతీ! ఓరాజశ్రేష్ఠా! ఓసీతాపతీ! ఓజగదీశ్వరా! ఓశ్రీరామా! ఓపద్మనేత్రుఁడా! ఓరామచంద్రా! నీకు నమస్కారమగుఁగాక.

శ్లో. దక్షిణే లక్ష్మణో ధన్వీ, వామతో జానకీశుభా
పురతో మారుతి ర్యస్య, తన్నమామి రఘూత్తమమ్. 20

ఉ. దాపట జానకీపతి ము♦దంబున నుండఁగ దక్షిణంబునన్
చాపము దాల్చి లక్ష్మణుఁడు ♦ సన్నుతిఁ జేయ పురోపకంఠమం
దాపవనాత్మజుండు విన♦యంబునఁ గొల్వ వెలంగునట్టిధా
త్రీపరిపాలశీలునకు ♦ శ్రీరఘురామున కేను మ్రొక్కెదన్.

తా. ఏరామునికిఁ గుడివైపున ధనుర్ధారియగు లక్ష్మణుఁడును ఎడమవైపున మంగళస్వరూపురాలగు సీతయును ముందు హనుమంతుఁడును గలరో అట్టిరాముని నమస్కరించుచున్నాను.

శ్లో. రామం రాక్షసమర్దనం రఘుపతిం శక్రారివిధ్వంసినం
సుగ్రీవేప్సితరాజ్యదం సురపతేః పుత్రాంతకం శార్ఙ్గిణమ్
భక్తానా మభయప్రదం భయహరం పాపౌఘవిధ్వంసినం
సీతాసేవితపాదపద్మయుగళం రామం భజే శ్యామలమ్. 21

శా. రాము న్రాక్షసమర్దనుఁ రఘుపతి న్రాజేంద్రుఁ బాపాపహు
న్శ్యామాంగుఁ రవిజేప్సితుఁ వరదుభక్తార్తిఘ్ను శార్ఙ్గిఁ పరం
ధాముఁ వాలివిమర్దనుఁ ధరణిజాతాసేవితాంఘ్రిద్వయుఁ
శ్రీమంతుఁ భయసంహరుఁ గొలిచెదఁ శ్రీరామచంద్రప్రభున్.

తా. రాక్షసమర్దనుఁడును, రఘునాథుఁడును, రావణుని సంహరించినవాఁడును, సుగ్రీవుని కిష్టరాజ్యము నిచ్చినవాఁడును, వాలిని సంహరించినవాఁడును, శార్ఙ్గధనుస్సుగలిగినట్టివాఁడు నయినట్టియును భక్తుల కభయ మిచ్చునట్టియును భయమును హరించునట్టియుఁ బాపసమూహమును బోఁగొట్టునట్టియు సీతచేత సేవించఁబడు పాదపద్మములు గలిగినట్టియు నల్లనైనట్టియు రాముని సేవించుచున్నాను.

శ్లో. భవభయహరమేకం భానుకోటిప్రకాశం
కరధృతశరచాపం కాలమేఘావభాసమ్
కనకరుచిరవస్త్రం రత్నవత్కుండలాఢ్యం
కమలవిశదనేత్రం సానుజం రామమీడే. 22

చ. భవభయమోచను న్వికచపంకజలోచను గాంచనాంబరుఁ
రవిశతకోటితుల్యు మణిరంజితకుండలకర్ణయుగ్ము రా
జవరలలాము హస్తధృతచాపశిలీముఖుఁ గాలమేఘభా
సివిమలు సానుజు న్వరదు శ్రీరఘురాము సమాశ్రయించెదన్.

తా. సంసారభయమును హరించునట్టియు ముఖ్యుఁడైనట్టి కోటిసూర్యులకాంతి గలిగినట్టియుఁ జేతఁ ధరించఁబడిన ధనుర్బాణములు గలిగినట్టియు నల్ల మేఘమువలెఁ బ్రకాశించుచున్నట్టియు బంగారముచే సొగసైనవస్త్రములు గలిగినట్టియు రత్నములు గల కుండలములతోఁ గూడినట్టి పద్మములవలె నిర్మలములగు కన్నులుంగల తమ్మునితోఁ గూడినరాముని స్తుతించుచున్నాను.

శ్లో. రామం శ్యామపయోదనీల మమలం రాజీవనేత్రం సదా
హల్యాశాపనివారణప్రణయపాదాంభోజ మూర్వీశ్వరమ్

విద్యుత్కోటిసహస్రదీధితిలసత్కోటీరమస్తోజ్జ్వలం
ధ్యాయే తారకనామ మీశ్వరసఖం దైతేయవంశాపహమ్. 23

మ. మునికాంతాగతశాపమోచనపదాంభోజాతుఁ బ్రావృడ్ఘనా
ఘనగాత్రుఁ వికచాబ్జనేత్రు గిరిజాకాంతాప్తుఁ దైత్యారి పా
వనవిద్యుచ్ఛతకోటిదీప్తమకుటభ్రాజోత్తమాంగుఁ జనా
ర్దనునిఁ దారకనాము రాముని యతిధ్యానింతు నశ్రాంతమున్.

తా. నల్లమేఘమువలె నల్లనైనట్టి నిర్మలుఁడైనట్టి పద్మములవంటి నేత్రములు గలిగినట్టి అహల్యాశాపమును మాన్పుటయందుఁ బ్రేమగల పాదపద్మము గలిగినట్టియు భూమి కధిపతియైనట్టియు అమితములైన మెఱుపులవలెఁ బ్రకాశించుచున్న కిరీటముగల శిరస్సుచేఁ బ్రకాశించుచున్నట్టియు సంసారమును తరింపఁజేయు పేరుగలిగినట్టి శివునికి మిత్రుఁడైనట్టియు రాక్షసవంశము నపహరించినట్టి రాముని ధ్యానించుచున్నాను.

శ్లో. దశరథసుతమీశం దండకారణ్యవాసం
శతమఖమణినీలం జానకీప్రాణలోలమ్
సకలభువనమోహం సన్నుతాంభోదదేహం
బహుళనుతసముద్రం భావయే రామభద్రమ్. 24

చ. శతమఖరత్ననీలఘనసన్నిభగాత్రుని దండకాటవీ
స్థితు జనకాత్మజాధిపు నదీపతిసన్నుతు విశ్వమోహనున్
క్షితిపతినీశ్వరేశ్వరునిఁ జన్మయు దాశరథిన్ దయానిధిన్
వితతచరిత్రు సత్యు రఘువీరుని సంతత మాశ్రయించెదన్.

తా. దశరథునికొమారుఁడైనట్టి ఆధిపతియైనట్టి దండకారణ్యమం దునికిగలిగినట్టి యింద్రనీలములవలె నల్లనైనట్టి సీతయొక్క ప్రాణనాథుఁడైనట్టియు నన్నిలోకములను మోహపెట్టునట్టి నుతింపఁబడు మేఘమువంటిదేహముగలిగినట్టియు మిగుల సముద్రునిచే స్తుతింపఁబడుచున్నట్టియు రామభద్రుని ధ్యానించుచున్నాను.

శ్లో. సరయూతీరవనే లతానివసనే సద్రత్నవేదీతటే
సుమపర్యంకతలే విదేహసుతయా సార్ధం పరిక్రీడతే
కస్తూరీఘనసారచందనమిళద్గంధోల్లసత్పావనీ
పాయాన్నస్తారకనామయా రఘుపతే ర్భద్రాత్మకానోనిశమ్. 25

మ. సరయూతీరవనిన్ లతాగృహమునన్ సద్రత్నవేదీస్థలిన్
విరిశయ్యన్ జనకాత్మజాసహితుఁడై వేడ్కన్ లసచ్చంద్రక

స్తురిసంయుక్తసుగంధలేపనమునన్ • శోభిల్లి క్రీడించు సుం
దరసన్మూర్తి యనామయుండు రఘునా • థస్వామి నన్ బ్రోవుతన్.

తా. సరయూనదీతీరమందలి వనమందలి లతాగృహమందు రత్నపుటరుగు నందుఁ బువ్వులశయ్యయందు సీతతోఁ గ్రీడించుచున్నట్టియుఁ గస్తూరి కర్పూరము గంధము వీటితోఁ గూడిన పరిమళముచేఁ బ్రకాశించుచున్నట్టి పవిత్రమైనట్టి బాధలేనట్టి మంగళరూపమైనట్టి రామునిరూపము మమ్ము నెల్లపుడు రక్షించుఁగాక.

శ్లో. వైదేహీప్రియవల్లభం విజయినం వాతాత్మజాధీశ్వరం
వాణీవారిధివానరాదివినుతం వందారుమందారకమ్
విశ్వామిత్రవసిష్ఠవాసవశివావాణీశశశ్వన్నుతం
దేవేశం వినతాత్మజాభివినుతం వందే సదా రాఘవమ్. 26

మ. ధరణీజాప్రియవల్లభు న్జయకరున్ • దాసామరానోకహున్
గరుడాంభోధిసరస్వతీప్లవగసం • ఘస్తోత్రు బ్రహ్మేశని
ర్జరనాథాత్రివసిష్ఠగార్గ్యమునివి • శ్వామిత్రసంసేవితు
న్వరదు న్రాఘవు వాయుపుత్రవిభు గీ • ర్వాణేశ్వరున్ గొల్చెదన్.

తా. సీతకు నిష్టవల్లభుఁడైనట్టి జయముగలిగినట్టియు నాంజనేయునికధిపతియైన ట్టియు సరస్వతి, సముద్రుఁడు, వానరులు మొదలగువారిచే నుతింపఁబడినట్టియు నమస్కరించువారికిఁ గల్పవృక్షమైనట్టియు విశ్వామిత్రునిచే వసిష్ఠునిచే నింద్రునిచే శివబ్రహ్మలచే నెల్లపుడు నుతింపఁబడుచున్నట్టియు దేవతల కధిపతియైనట్టియు గరుడునిచే నుతింపఁబడు రాము నెల్లపుడు నమస్కరించుచున్నాను.

శ్లో. విశాలనేత్రం పరిపూర్ణగాత్రం, సీతాకళత్రం సురవైరిజైత్రమ్
జగత్పవిత్రం పరమాత్మతంత్రం, శ్రీరామచంద్రం ప్రణమామి చిత్తే.

చ. వికసితపుండరీకదళ • విస్తృతనేత్రు జగత్పవిత్రు సే
వకనుతిపాత్రు నీలఘన • వర్ణసుగాత్రు సురారిజైత్రుఁ దా
రకుఁ బరమాత్మతంత్రు రఘు • రాము ధరాధిపతిన్ విదేహభూ
పకతనయాకళత్రుఁ బద • పంకజసేవ యొనర్పు చిత్తమా. 27

తా. గొప్పకన్నులు గలిగినట్టియు నిండైనదేహము గలిగినట్టియు సీత భార్యగా గలిగినట్టియు రాక్షసులను జయించునట్టియు జగత్తులయందుఁ బవిత్రుఁడైనట్టియు పరబ్రహ్మస్వరూపుఁడైనట్టియు రామమూర్తిని జిత్తమందుఁ నమస్కరించుచున్నాను.

శ్లో. సౌమిత్రిమానార్ణవపూర్ణచంద్ర, సీతాలసల్లోచనపూర్ణచంద్ర
సురారివక్త్రాంబుజపూర్ణచంద్ర, సంరక్షమాం రాఘవరామచంద్ర.

చ. ధరణికుమారికాక్షికుము•దప్రమదప్రదపూర్ణచంద్రుఁ డా
సురవిసరాననాంబురుహ•సోముఁడు లక్ష్మణభవ్యమానసా
గరపరిపూర్ణచంద్రుఁడు జ•గత్పరిపూరితకీర్తిసాంద్రుఁ డం
బరమణివంశచంద్రుఁ డన•మానుఁడు రాముఁడు నన్నుఁ బ్రోవుతన్.

తా. లక్ష్మణునియభిమాన మనెడుసముద్రమునకుఁ బూర్ణచంద్రుఁడైనట్టియు సీతయొక్క ప్రకాశించుచున్న నేత్రములకుఁ బూర్ణచంద్రుఁడైనట్టియు రాక్షసుల నేత్రపద్మములకుఁ బూర్ణచంద్రుఁడైనట్టియు రఘువంశమందుఁబుట్టినయో రామచంద్రా! నన్ను రక్షింపుము.

శ్లో. యస్యకించిదపి నో హరణీయం, కర్మకించిదపి నో చరణీయమ్
రామనామచ సదా స్మరణీయం, లీలయాభవజలం తరణీయమ్. 29

ఉ. ధారుణి నేమహాత్మునవ•తారసుకర్మలు బోవిడంగరా
దేరికి నన్యకర్మముల • నించుక నేయుట పాడిగాదు దు
ర్వారదురంతపాపజల•రాశిఁ దరింపఁగ హేతు వైనయా
శ్రీరఘురామనామము స్మ•రింపఁదగుఁ బరమాత్మసిద్ధికిన్.

తా. ఎవనికొంచెపుపనియైనను మరలించ శక్యము గాదో ఎవనియొక్క పూజాది కర్మ చేయ శక్యము గాదో అట్టిరాముని నామ మెల్లప్పుడు స్మరించఁదగినది. సంసారజలము దాఁటఁదగినది.

శ్లో. రంగమాణ మభితో గృహాంగణే, భృంగనీల మలకావృతాననమ్
మంగళప్రద మమంగళాపహం, సంగృణేదశరథాత్మజంహృది. 30

చ. అళిసముదాయనీలచికు•రావృతవక్త్రసరోజుఁడై సము
జ్జ్వలభవనాంగణప్రకట•సంతతసంచరణాఢ్యుఁడై యమం
గళపరిహారుఁడై లలిత•కాంచనభూషణభూషితాంగుఁడై
యలరినరాఘవుఁ దశర•థాత్మజుఁ జిత్తమునందు నిల్పెదన్.

తా. ఇంటిముంగిటియందు సంచరించుచున్నట్టియుఁ దుమ్మెదలవలె నల్లనైనట్టియు ముంగురులచే నావరించఁబడిన మోముగలిగినట్టియు శుభములనిచ్చునట్టియు నశుభములను హరించునట్టియు దశరథపుత్రుఁడైనరాముని మనస్సునందుఁ దలఁచుచున్నాను.

శ్లో. దనుజతిమిరభానుం తాపసైశ్చింత్యమానం
శమితకలుషవారం సేవకేదుష్టదూరమ్
దళితవిషమపాలం దండితారాతిజాలం
ప్రణుతశిఖరిశత్రుం భవ్యపాథోదగాత్రమ్. 31

మ. దనుజధ్వాంతసరోజమిత్త్రు సురనాథస్తోత్త్రు యోగీంద్రస
న్మనిసంభావితు సత్త్రతాశ్రితరుని  శ్లోకాస్త్రవిద్వేషిత
ర్జనుసీలాంబుదగాత్త్రుఁ గల్మషగిరీంద్రచ్ఛేదదంభోళిదు
ర్జనసంహారుఁ గృపాసముద్రుఁ డగు శ్రీరామప్రభుం గొల్చెదన్.

తా. రాక్షసు లనెడుచీఁకటికి సూర్యుఁడైనట్టియు మునులచే ధ్యానించఁబడు చున్నట్టియు భక్తునియందలి శాంతింపఁజేయఁబడిన పాపసమూహము గలిగినట్టియు దుర్మార్గులకు దూరస్థుఁడైనట్టియు, బ్రద్దలుచేయఁబడిన యేడుతాటిచెట్లు గలిగినట్టియు శిక్షింపఁబడిన శత్త్రుసమూహము గలిగినట్టియు నమస్కరించుచున్న యింద్రుఁడుగలిగి నట్టియు మనోహరమైన మేఘమువంటి దేహముగల రాముని దలఁచుచున్నాను.

శ్లో. హేగోపాలక హేదయాజలనిధే హేసద్గుణాంభోనిధే
హేదైత్యాంతక హేవిభీషణదయాపారీణ హేభూపతే
హేవైదేహసుతామనోజవిహృతే హేకోటిమారాకృతే
హేనవ్యాంబుజనేత్త్ర పాలయపరం జానామి నత్వాం వినా. 32

శా. ఓదైత్యాంతక యోదయాకరనిధీ యోధారుణీపాల యో
వైదేహీపతి యోవిభీషణకృపాపారీణగోపాలకా
యోదానస్తుతశమ్భుచాపదళనా యోమన్మథాకార యో
శ్రీదైతా నినుదక్క నన్యులను నేఁ జింతింపఁ బోవంగదే.

తా. ఓభూపరిపాలనముఁజేయువాఁడా! ఓదయాసముద్రుఁడా! ఓసద్గుణములుగలవాఁడా! ఓరాక్షసనాశకుఁడా! ఓవిభీషణునియందు దయయొక్కఅవధిని బొందినవాఁడా! ఓభూపతీ! ఓసీతామనోమన్మథా! ఓకోటిమన్మథులవంటి రూపుగలవాఁడా! ఓక్రొత్తపద్మమువంటి నేత్త్రములుగలవాఁడా! నన్నుఁబాలించు నిన్నుఁగాక యితరు నెఱుఁగను.

శ్లో. సాకేతేప్రణవాబ్జరత్నఖచితే సింహాసనేసంస్థితం
విశ్వామిత్త్రవసిష్ఠగాలవముఖై రాశీర్భిరంచజ్జటైః
పూజ్యం పార్శ్వగతాబ్జచారునయనం విద్యుచ్చలచ్చామరం
వందే కోమలసంస్మితాననమిలారత్నావతీర్ణం హరిమ్. 33

మ. తనప్రోల్ బ్రణవాబ్జపీఠిఁ జెలువొందన్ నవ్యపంకేరుహా
నన లిర్వంకల చామరద్వయ మహుందప్రాఘిపీవ న్గటీ

జను లాశీర్వచనంబు లియ్య ధరణీచక్రావనాసక్తుఁడై
యనిశంబుఁ దరహాసవక్త్రుఁ డగు రామూర్తిని సేవించెదన్.

తా. అయోధ్యయందుఁ బ్రణవమనెడు పద్మరాగమణులచే స్థాపింపఁబడిన సింహాసనమం దున్నట్టియుఁ బ్రకాశించుజటలుగల విశ్వామిత్రాదిమునులచేత నాశీర్వచనములచేఁ బూజింపఁబడుచున్నట్టియు బ్రక్కలయందున్న పద్మములవంటికన్నులు గల స్త్రీలయొక్క మెఱుపులవలెఁ జలించుచున్న వింజామరలు గలిగినట్టియుఁ గోమలమైనచిర్నవ్వుగల మొగము గలిగినట్టి భూసంరక్షణకై యవతరించిన విష్ణురూపుఁడగు రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. నిత్యం నిర్జితపంకసంభవమహానేత్రశ్రియం రాఘవం
రామం పర్వణిచంద్రచారువదనం దిక్పాలకైస్సేవితమ్
కర్పూరాగరుచందనార్ద్రహృదయం మందారమాలాంకితం
విద్యుత్పుంజనిభాంబరావృతతనుం రామం భజే శ్యామలమ్. 34

చ. విమలనవాంబుజాతదళవిస్తృతనేత్రు దిగీశవందితున్
సుమహితపూర్ణచంద్రనిభసుందరవక్త్రు లసత్తటిల్లతా
సమవసనున్ హృదార్ద్రసితవాసితచందనచంద్రకర్దమున్
రమణసుపర్వభూజసుమరాజితధాముని రాము నెన్నెదన్.

తా. జయింపఁబడిన పద్మములుగల గొప్పనేత్రశోభగలిగినట్టియు రఘువంశమందుఁ బుట్టినట్టియు మనోహరుఁడైనట్టియుఁ బూర్ణచంద్రునివలె సుందరమైనమొగము గలిగినట్టియు దిక్పతులచే సేవింపఁబడుచున్నట్టియుఁ గర్పూరాదులచేఁ దడిసిన హృదయముగలిగినట్టియు మందారమాలికచే నలంకరింపఁబడినట్టియు మెఱపుగుంపులతో సమానమైన వస్త్రముచేఁ గప్పఁబడినశరీరము గలిగినట్టియు నల్లనైనట్టిరాము నెల్లపుడు సేవించుచున్నాను.

శ్లో. శ్రీరామః కుశికాత్మజస్యవచనే నాకృష్య బాణాసనం
మారీచంచ సుబాహుకం శరయుగే నైవాహవేలీలయా
క్రామన్ సుందరకాకపక్షరుచిర స్సౌమిత్రిణాసంస్తుతః
పాయాన్నః కమలానన స్సకరుణః కాలాంబుదశ్యామలః. 35

మ. కడకన్ గాధితనూజువాక్యమున నాకర్ణాంతకోదండుఁడై
వడి మారీచసుబాహులం దెగడి భావంబందు రంజిల్లు ర

మ్యుఁడు కాలాంబుదగాత్రుఁ డంబుజనిభా♦స్యుం డుజ్జ్వలత్కాకప
క్షుఁడు సౌమిత్రిసుతుండు రాఘవుఁడు కా♦కుత్స్థుండు నన్ బ్రోవుతన్.

తా. విశ్వామిత్రుని మాటచేత ధనుస్సు నెక్కుబెట్టి మారీచుని సుబాహుని రెండు బాణములచేతనే యుద్ధమందు విలాసముచే నాక్రమించుచున్నట్టియు సొగసైన పిల్లజుట్లచే మనోహరుఁడైనట్టియు, లక్ష్మణునిచే స్తుతింపఁబడుచున్నట్టియుఁ బద్మమైన మొగమందు (అనఁగాఁ బద్మమువంటి మొగమందు) దయతోఁగూడినట్టియు నల్లమేఘము వలె నల్లనైనట్టి రాముఁడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో. ఆనందరూపం వరదం ప్రసన్నం
సింహేక్షణం సేవకపారిజాతమ్
నీలోత్పలాంగం భువనైకమిత్రం
రామం భజే రాఘవరామచంద్రమ్. 36

మ. శ్రితమందారము నుత్తరత్నవిలస♦త్సింహాసనాసీను భా
సితనీలోత్పలమేఘవర్ణుఁ గరుణా♦సింధున్ ప్రసన్నాననున్
నతపక్షున్ భువనైకమిత్రు నిరతా♦నందస్వరూపున్ సురా
ర్చితు శ్రీరామధరాధినాథు మది నే♦ సేవింతు నిష్టాప్తికిన్.

తా. ఆనందస్వరూపుఁడైనట్టియు, వరములనిచ్చునట్టియు, నిర్మలుఁడైనట్టియు, సింహాసనము గలిగినట్టియు, సేవించువారికిఁ గల్పవృక్షమైనట్టియు, నల్లకలువవంటి దేహము గలిగినట్టియు, లోకములకుఁ బ్రధానమిత్రుఁడైనట్టియు రాఘవరామచంద్రుఁ డగు రాముని సేవించుచున్నాను.

శ్లో. యుద్ధేవసన్న వృణదద్భుతబాణవర్షైః
రామః ప్రహారసమయే రజనీచరాణామ్
రక్షానుకూలసమయాయ విభీషణాయ
లంకాధిపత్య మదిశ ద్రఘురామచంద్రః. 37

చ. అసురకదంబజన్యమున ♦ నద్భుతవిద్యఁ గలంబవృష్టిఁ బెం
పెసఁగఁగ నించి రాక్షసుల ♦ నెల్లను గూలిచి రక్షణార్థుఁడై
వెస శరణాగతుం డగు వి♦భీషణు లంకకు రాజుఁ జేసి పొ
ల్పెసఁగినరామచంద్రునకు ♦ హెళికులాగ్రణి కేను మ్రొక్కెదన్.

తా. శ్రీరామమూర్తి రాక్షసులయుద్ధమందు ఉన్నవాఁడై ఆశ్చర్యమయిన బాణవర్షములచేతఁ గొట్టునట్టి సమయమందు నావరించెను. ఆరఘురామచంద్రుఁడు

రక్షించుట కనుకూలమగు శమయముగల విభీషణునికొఱకు లంకాధిపత్యము నిచ్చెను.

శ్లో. వేదాంతనాథం స్వకృతైకదానం
హృతాభిమానం త్రిదశప్రధానమ్
గజేంద్రయానం విగతావసానం
శ్రీరామచంద్రం సతతం నమామి. 38

చ. ప్రకటగజాధిరూఢునకు ♦ భవ్యునకుం సకలాగమాంతభ
ర్తకుఁ బరిమాణహీనునకు ♦ దానధురీణునకుం సురాగ్రనే
తకు నభిమానహారికిఁ బ♦తంగకులాంబుధికైరవాధినా
యకునకు రామభూభుజున ♦ కాజితనూజున కేను మ్రొక్కెదన్.

తా. ఉపనిషత్తుల కధిపతి యైనట్టియుఁ తనచేఁజేయఁబడిన ముఖ్యదానములు గలిగినట్టియుఁ కొట్టఁబడిన అభిమానము గలిగినట్టియు దేవతాప్రధానుఁ డైనట్టియు గజవాహనము గలిగినట్టియుఁ నాశనశూన్యుఁ డైనట్టియు శ్రీరామచంద్రు నెల్లపుడు నమస్కరించుచున్నాను.

శ్లో. శ్రీరామచన్ద్రం ధృతచాపసాయకం
నీలోత్పలాభం నలినాయతేక్షణమ్
సౌమిత్రిణా సేవితపాదపంకజం
సీతాసమేతం శరణం భజే శివమ్. 39

ఉ. శ్రీరఘురామచంద్రు సర♦సీరుహపత్రవిశాలనేత్రు సీ
తారమణీసమేతు జల♦దప్రవిభాసితనీలగాత్రు శృం
గారవిభూషు దివ్యశర♦కార్ముకదీప్తకరాబ్జు నూర్మిళా
చారుముఖీపతిప్రణత♦సత్పదపద్ము సమాశ్రయించెదన్.

తా. ధరించఁబడినధనుర్బాణములు గలిగినట్టియు నల్లగలువల కాంతి గలిగినట్టియు పద్మములవలె విశాలములైనకన్నులు గలిగినట్టియు లక్ష్మణునిచే సేవించఁబడుచున్న పాదపద్మములు గలిగినట్టియు సీతతోఁగూడినరాముని నేను శరణుఁ బొందుచున్నాను.

శ్లో. శ్రీరామచంద్ర కరుణాకరదీనబంధో
సీతాసమేతభరతాగ్రజరాఘవేశ
పాపార్తిభంజనభయాతురదీనబంధో
పాపాంబుధౌ పతితముద్ధర మామనాథమ్. 40

చ. హరిరఘురామచంద్ర భర•తాగ్రజసత్కరుణాపయోనిధీ
ధరణిసుతాభివాససహిత•ధార్మికపాతకదీనబాంధవా
దురితమహాంధకారహర•తోయజబాంధవ రాఘవేశ్వరా
తరణికులావతంస దురి•తాబ్ధినిమగ్నుని నన్నుఁ బ్రోవవే.

తా. దయకుస్థానమైనవాఁడా! దీనులకు బంధువైనవాఁడా! సీతతోఁగూడిన వాఁడా! భరతునకన్నయైనవాఁడా! రఘువంశపురాజుల కధిపతియైనవాఁడా! పాపాత్ములపీడను గొట్టివేయువాఁడా! భయముచేఁ బీడితులైనదీనులకుఁ జుట్టమైనవాఁడా! శ్రీరామచంద్రా! పాపసముద్రములోఁ బడినట్టి దిక్కులేని నన్ను లేవఁదీయుము.

శ్లో. ఇదంశరీరం శ్లథసంధిజర్జరం
పతత్యవశ్యం పరిణామపేశలమ్
కిమౌషధం పృచ్ఛసి మూఢదుర్మతే
నిరామయం రామకథామృతం పిబ. 41

చ. కడు శతసంధిజర్ఝరిత•గాత్ర మనిత్యము నాయు వల్ప మె
య్యెడఁ బడి పోవునో తెలియ • దందుకు దివ్యమహౌషధంబు నే
ర్పడిమె నిరామయం బయిన•రామకథామృత మెల్లకాలముఁ
జెడక విమూఢతం బడక • శీఘ్రము గ్రోలుచు నుండుచిత్తమా.

తా. ఈదేహము బహురంధ్రములుగలది. శిథిలమైనది, చెడిపోయినతరువాత మఱల దొరకనిది. ముఖ్యముగాఁ బడిపోవును. ఓ తెలివిలేనివాఁడా! బుద్ధిలేనివాఁడా! ఓమనుష్యుఁడా! దీనికి ఔషధమేల యడిగెదవు. రోగములు లేకుండఁజేయు రామకథ యనునమృతమును ద్రాగుము.

శ్లో. దశముఖగజసింహం దైత్యగర్వాతిరంహం
కదనభయదహస్తం తారకబ్రహ్మశస్తమ్
మణిఖచితకిరీటం మంజులాలాపవాటం
దశరథకులచంద్రం రామచంద్రం భజేహమ్. 42

చ. దశరథవంశసాగరసు•ధాకరుదానవగర్వభంజనుఁ
దశముఖదంతిసింహమును • తారకబ్రహ్మమరేంద్రభీతిదుఁ
శశిసరసీజమిత్రవిల•సన్మణిహేమకిరీటు మంజుభా
షిశరథితల్పు దాశరథి•శ్రీరఘురాము సమాశ్రయించెదన్,

తా. రావణుఁ డనెడు ఏనుఁగునకు సింహమైనట్టియు రాక్షసులగర్వమందు మిక్కిలి వేగముగలిగినట్టియు యుద్ధమందు భయమునొసఁగు చేతులుగలిగినట్టియు ప్రశస్తమైన తారకబ్రహ్మస్వరూపుఁడైనట్టియు రత్నస్థాపిత కిరీటముగలిగినట్టియు మృదువాక్యములకు స్థానమైనట్టియు దశరథవంశమునకుఁ జంద్రుఁడైనట్టి రామచంద్రుని నేను సేవించుచున్నాను.

శ్లో. లంకావిరామం రణరంగభీమం
రాజీవనేత్రం రఘువంశమిత్రం
కారుణ్యమూర్తిం కరుణాప్రపూర్తిం
శ్రీరామచంద్రం శరణం ప్రపద్యే. 43

మ. అరవిందాయతపత్రనేత్రు రఘువంశాంబోధిపూర్ణాబ్జు సం
గరరంగోజ్జ్వలభీము భీమవినుతుఁ గారుణ్యసన్మూర్తిభా
సురలంకాప్రవిరాము రామధరణీశు న్సర్వసర్వంసహా
వరపుత్రీహృదయాంబుజాతతరణిఁ వాంఛించి సేవించెదన్.

తా. లంకను బాడుజేసినట్టియు యుద్ధమందు భయంకరుఁడైనట్టియు బద్మముల వంటి నేత్రములు గలిగినట్టియు రఘువంశమునకు మిత్రుఁడైనట్టియు దయాస్వరూపుఁడైనట్టియు దయాపూర్ణుఁడైనట్టియు శ్రీరామచంద్రుని నేను శరణుపొందుచున్నాను.

శ్లో. రామచంద్ర మనిశం హృదయస్థం
రామ మిందువదనం ప్రవిభాసమ్
భాసయామి నిగమాంతనివాసం
భారతీపతినుతం భవవంద్యమ్. 44

ఉ. శారదపూర్ణచంద్రవిలసద్వదను న్రవికోటిభాసితుఁ
సారసగర్భసన్నుతు బ్రశస్తచరిత్రుని నాగమాంతసం
చారు ధరాధరాధిపతి సన్నమితాంఘ్రిని మామకీనహృ
త్సారససంస్థితుఁ వరదుఁ దాశరథిఁ శరణంబు వేఁడెదన్.

తా. ఎల్లప్పుడు మనస్సునందున్నట్టియుఁ జంద్రునివంటి మొగము గలిగినట్టియుఁ బ్రకాశించుచున్నట్టి వేదాంతములయందు నివాసము గలిగినట్టియు బ్రహ్మచే నుతింపఁబడుచున్నట్టియు నీశ్వరునికి నమస్కరించఁదగిన రామచంద్రుని ధ్యానించుచున్నాను.

శ్లో. కామారో రామచంద్రః కమలమృదుపదాశోభయన్భూమిభాగం
మాతుశ్చానందకారీమరకతనికరాకారఇందీవరాక్షః

ఉత్సఙ్గే సన్నివిష్టః పితురమరవరైః స్తూయమానోపకారో
నానాలంకారభూషః స్ఫురతు మమ సదా మాయయా రామ ఈశః.

మ. జనకాంకస్థితుఁడై సురాళినుతుఁడై సర్వేశుఁడై మాయమై
జనయిత్రీపరితోషకృన్మరకత చ్ఛాయాంగుఁడై పద్మలో
చనుఁడై కంజమృదుత్వపాదవిలసత్ త్స్మాభాగుఁడై భవ్యయా
వనపూర్వం డగురాఘవుం డెపుడు మ త్స్వాంతంబునన్ భాసిలున్.

తా. కౌమారావస్థ గలిగినట్టియుఁ బద్మమువలె మృదువైన పాదముచేత భూతలమును శోభింపఁజేయుచున్నట్టియుఁ దల్లికి సంతోషముఁజేయునట్టియు మరకతమణి సమూహమువంటిరూపు గలిగినట్టియు నల్లగలువలవంటికన్నులు గలిగినట్టియుఁ దండ్రితోడఁ బైఁగూర్చున్నట్టియు దేవతాశ్రేష్ఠులచే నుతింపఁబడుచున్న ఉపకారములు గలిగినట్టియు సమస్తాలంకారములచే నలంకరింపఁబడినట్టిమాయచే రాముఁడైన ఈశ్వరుఁడు నాకు పొడకట్టుఁగాక.

శ్లో. సన్నద్ధః కవచీ ఖడ్గీ, చాపబాణధరో యువా
గచ్ఛన్మమాగ్రతో నిత్యం, రామః పాతు సలక్ష్మణః. 46

చ. నిరతము త్రోవ నేగుతరి నెయ్యముతోడ మదగ్రచారివై
కర మనురక్తి నుద్ధతను కౌశల మొప్ప సలక్ష్మణుండవై
శరము శరాసనంబు కవచంబును ఖడ్గముఁ దాల్చి కావవే
తరణికులాబ్ధిసోమనర తారకనామ శ్రితావనాచ్యుతా.

తా. యుద్ధసన్నాహము గలిగినట్టియుఁ గవచము గలిగినట్టియుఁ గత్తి గలిగినట్టియు ధనుర్బాణములను ధరించినట్టియు చిన్నవాఁడైనట్టియు లక్ష్మణునితోఁ గూడినట్టియు రాముఁడు నిత్యము నా యెదుట నడచుచు రక్షించుఁగాక.

శ్లో. సుగ్రీవమిత్రం పరమంపవిత్రం, సీతాకళత్రం నవహేమసూత్రమ్
కారుణ్యపాత్రం శతపత్రనేత్రం, శ్రీరామచంద్రం శిరసానమామి. 47

చ. పరమపవిత్రుఁ దామరస పత్త్రవిభాసితనేత్రు ధారణీ
వరతనయాకళత్రుని వి భాకరసంభవమిత్త్రు నవ్యక
ర్బురకటిసూత్రుసిక్ భువన మోహనగాత్రుఁ బతత్త్రిపత్త్రు ను
స్థిరకగుణాసముద్రు ముని సేవితు శ్రీరఘురాముఁ గొల్చెదన్.

తా. సుగ్రీవునికిఁ జెలికాఁడైనట్టియు మిక్కిలి పవిత్రుఁడైనట్టియు సీత భార్య గలిగినట్టియుఁ గ్రొత్తదియైన బంగారుమొలత్రాడుగలిగినట్టియు, దయాస్థానమైన

ట్టియుఁ బద్మములవంటి కన్నులుగలిగినట్టియు రామచంద్రుని శిరస్సుచే నమస్కరించుచున్నాను.

శ్లో. శ్రీరాఘవేతి రమణేతి రఘూద్వహేతి
రామేతి రావణహరేతి రమాధవేతి
సాకేతనాథసుముఖేతి చ సువ్రతేతి
వాణీసదావదతు రామహరే హరేతి. 48

చ. హరిహరిరామరామ పర♦మాత్మరఘూద్వహదివ్యవిగ్రహా
శరనిధికన్యకారమణ ♦ శౌరి యయోధ్యపురాధినాయకా
వరద దశాననాదిశిత♦వత్సల రాఘవ సువ్రతప్రభా
కరశతకోటి తేజసుము♦ఖా యనుచుఁ రసనా స్మరింపుమా.

తా. శ్రీరాఘవా అని, మనోహరుఁడా అని, రఘూద్వహా అని, రామా యని, రావణుని సంహరించినవాఁడా యని, లక్ష్మీనాథా యని, అయోధ్యానాయకా యని, మంచి మొగముగలవాఁడా యని, గొప్పనియమముగలవాఁడా యని, రామా యని, హరీ యని, పాపసంహరా యని నా వాక్కెల్లపుడు పలుకుఁగాక.

శ్లో. జయతు జయతు రామో జానకీవల్లభోఽయం
జయతు జయతు రామశ్చన్ద్రచూడార్చితాంఘ్రిః
జయతు జయతు వాణీనాథనాథః పరాత్మా
జయతు జయతు రామో నాథనాథః కృపాళుః. 49

చ. జయజయ రామభద్ర పుర♦శాసనవందితపాదపంకజా
జయజయ రామచంద్ర గుణ♦సాంద్ర ధరాతనయాధినాయకా
జయజయ రాఘవేన్ద్ర జల♦జాసనపుత్త్రి చరాచరాత్మకా
జయజయ సత్కృపాభరణ♦శాశ్వతదీనజనావనాచ్యుతా.

తా. సీతాభర్తయైనరాముఁడు విజయమొందుఁగాక. ఈశ్వరునిచేఁ బూజింపఁబడు పాదములుగలరాముఁడు జయమొందుఁగాక. బ్రహ్మకు నాథుఁడైనరాముఁడు జయమొందుఁగాక. రాజులకు రాజైన దయావంతుఁడైనరాముఁడు జయమొందుఁగాక.

శ్లో. వరం నయాచే రఘునాథయుష్మత్పాదాబ్జభక్తిస్సతతం మమాస్తు
ఇదంప్రియం నాథవరం ప్రయచ్ఛ పునఃపునస్త్వామిదమేవ యాచే.

ఉ. శ్రీరఘునాథ మీపదసు♦సేవయు భక్తి నిరంతరంబు మా
కారయ నిష్టమైనవర ♦ మంతియె చాలును మాటిమాటికిన్

గోరెద నీవరంబు నిను ♦ గూరిచి యన్యవరంబు లెవ్వియుం
గోరను నాయభీష్ట మొనఁ♦గూర్పఁగ దే కరుణించి మక్కువన్.

తా. ఓరామమూర్తీ! నీపాదపద్మభక్తి నాకెల్లప్పుడు నగుఁగాక. ఇతరము నే గోరను. ఇష్టమైన యీవరమును నాకిమ్ము, మరలమరల నిన్నిదే కోరుచున్నాను.

శ్లో. అంభోధిరోషాదరుణాయమానే, నాథస్యదృష్ట్వానయనేరఘూణాం
మరుద్గణైస్తత్క్షణమాశశంకే, మందాకినీమంగళసూత్రభంగమ్.

మ. ఘనరోషప్రకటప్రతాపయుతుఁడై ♦ కందోయి కెంజాయఁ బెం
పనదీనాథునిఁ గాంచినప్పుడు సుప♦ర్వశ్రేణి శంకించె నీ
ఘనుచే భంగము నొందుసాగరము గం♦గాహేమసూత్రంబు నేఁ
డనుచుం దద్విధవిక్రమంబు గలరా♦మాధీశుఁ బ్రార్థించెదన్. 51

తా. సముద్రునియందలి కోపమువలన నెఱ్ఱనైన రఘునాథుఁడగు రాముని నేత్రములనుజూచి యప్పుడు దేవతలచేత గంగానదియొక్క మంగళసూత్రమునకు భంగమూహించఁబడెను. (అనఁగా రామమూర్తి సముద్రుని నేత్రాగ్నిచే దహించినచో సముద్రునిభార్యయైనగంగకు మంగళసూత్రభంగము కలుగునని యెంచిరి).

శ్లో. అంభోధిస్మయబంధనేన జగదానందేన భూపుత్రికా
స్వాంతాంభోభవబాంధవేన నతరక్షాయత్తచిత్తేన మే
కర్ణాలంబితకుండలేన దివిషత్త్రాణోద్యమేనాశ్రిత
శ్రేయఃకల్పనగేనమేమతిరియం రామేణసంవర్ధతామ్. 52

మ. శ్రితకల్పద్రుముఁడై నతార్తిహరుఁడై ♦ సీతాహృదంభోజరం
జితపంకేరుహమిత్రుఁడై దివిజరా♦జత్రాణుఁడై వాహినీ
పతిరాడ్బంధనశౌర్యుఁడై త్రిభువన♦ప్రహ్లాదుఁడై కుండలాం
చితుఁడౌ రాముఁడు మాకొసంగుకరుణా♦శ్రేయుం బమేయంబుగన్.

తా. సముద్రునిగర్వముఁ గట్టివేసినదియు లోకములు సంతసింపఁజేయునట్టియు సీతాచిత్తమనెడు పద్మమునకు నిష్టుఁడైనట్టియు నమస్కరించువారిసంరక్షణ కధీనచిత్తము గలిగినట్టియుఁ జెవులయందు నవలంబించినకుండలములు గలిగినట్టియు దేవతలను రక్షింపుటయం దుద్యుక్తుఁడైనట్టియు నాశ్రితులకు మేలుగలిగించుటకుఁ గల్పవృక్షమైన రామునిచేత నాయీబుద్ధి వృద్ధినొందుఁగాక.

శ్లో. ఆదౌరామజనిః కుమారగమనం యజ్ఞప్రతీపాలనం
శాపాదుద్ధరణం ధనుర్విదళనం సీతాంగనోద్వాహనమ్

లంకాయాదహనం సముద్రతరణం సౌమిత్రిసమ్మోహనం
రక్షస్సంహరణం స్వరాజ్యగమనం చైతద్ధి రామాయణమ్. 53

మ. మొదలన్ రామునముద్భవంబు సవనంబున్ గాచుటన్ మౌనిప
త్నిదయం బ్రోచుట చాపభంగము ధరిత్రీపుత్రియుద్వాహమున్
పిదపన్ తొల్కరి దహించుటన్ జలనిధిన్ వేదాటుటన్ భ్రాతృమూ
ర్ఛదశాస్యాదిమృతిన్ ధరావహనమే రామాయణం బై తగన్.

తా. ముందుగా రాముని పుట్టుక, బాల్యము వెళ్లుట, విశ్వామిత్రు యజ్ఞముం బా లించుట, అహల్యాశాపమోచనము, శివధనుస్సు విరచుట, సీతావివాహము, హనుమంతుఁడు లంకం గాల్చుట, సముద్రము దాఁటుట, లక్ష్మణుని మూర్ఛ, రాక్షసులను సంహరించుట, తమ రాజ్యమునకు వెళ్లుట అనునది రామాయణము.

శ్లో. జన్మాదౌ క్రతురక్షణం మునిపతేః స్థాణోర్ధనుర్భంజనం
వైదేహీగ్రహణం పితుశ్చ వచనాద్ఘోరాటవీగాహనమ్
కోదండగ్రహణం ఖరాదిమథనం మాయామృగచ్ఛేదనం
బద్ధాబ్ధిక్రమణం దశాస్యనిధనం చైతద్ధి రామాయణమ్. 54

మ. ధర జన్మించి సవంబుఁ గాచి శిల కాంతం జేసి విల్ ద్రుంచి భూ
వరపుత్రిన్ గొని తండ్రి బంప నటవీవాసంబు గావించి విల్
శరముల్ దాల్చి ఖరాదులన్ దునిమి వే సారంగమున్ గూల్చి వా
ర్ధి రహిన్ గట్టి దశాస్యుఁ ద్రుంచినదియే శ్రీరామచారిత్రమౌన్.

తా. ముందుగా రాముని జన్మము, విశ్వామిత్రుని యజ్ఞసంరక్షణము, ఈశ్వర ధనుర్భంగము, సీతను వివాహమగుట, తండ్రిమాటవలన భయంకర మగునడవిం బ్రవేశించుట, యుద్ధమునకు ధనుస్సుఁ బట్టుట, ఖరాదులసంహరించుట, మాయలేడిం జంపుట, సేతువుగట్టి సముద్రము దాఁటుట, రావణుని జంపుట అను నిది రామాయణము.

శ్లో. పూర్వం రామతపోవనానుగమనం హత్వా మృగం కాంచనం
వైదేహీహరణం జటాయుమరణం సుగ్రీవసంభాషణమ్
వాలేర్నిగ్రహణం సముద్రతరణం లంకాపురీదాహనం
పశ్చాద్రావణకుంభకర్ణవధనం చైతద్ధి రామాయణమ్. 55

మ. మును రాముండు వనిం జరించి హరిణంబున్ ద్రుంచి భూపుత్రి యే
గినమార్గంబు జటాయుచావు గని సుగ్రీవాప్తుఁడై వాలిను

ర్ధనుఁడై వారిధి దాఁటి లంకను వెసన్ ♦ దగ్ధంబు గావించి పో
రి నిశాటాధిపులన్ వధించినదియే ♦ రామాయణంబై తగెన్.

తా. ముందుగా రాముఁడు తపోవనమునకు వెళ్లుట, బంగారు లేడిం గొట్టుట, సీతను రావణుఁడెత్తుకొనిపోవుట, జటాయువు చచ్చుట, సుగ్రీవునితో రాముడుమాటలాడుట, వాలినిజంపుట, సముద్రముదాఁటుట, లంకఁ గాల్చుట, తరువాత రావణకుంభకర్ణులచావు అనునిది రామాయణము.

శ్లో. శాంతం శారదచంద్రకోటిసదృశం చంద్రాభిరామాననం
చంద్రార్కాగ్నివికాసికుండలధరం చంద్రావతంసస్తుతమ్
వీణాపుస్తకసాక్షసూత్రవిలసద్వ్యాఖ్యానముద్రాకరం
దేవేశం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. 56

మ. శరదబ్జారిసహస్రకోటిసదృశున్ ♦ చంద్రాభిరామాననున్
హరసంస్తుత్యు సరోజబాంధవశశాం♦కాగ్నిప్రభాకుండలున్
వరదున్ గోశిపిపంచకాక్షువిలస♦ద్వ్యాఖ్యానముద్రాకరున్
భరతాద్యావృతు శాంతు మేఘనిభు సం♦భావింతు రామప్రభున్.

తా. శాంతుఁడైనట్టియు, బహుశరత్కాలచంద్రులతోఁ దుల్యుఁడైనట్టియు, చంద్రునివలె మనోహరమైన మొగము గలిగినట్టియు, చంద్రసూర్యాగ్నులవలెఁ బ్రకాశించుకుండలములు ధరించినట్టియు, శివునిచే నుతింపఁబడుచున్నట్టియు, వీణాపుస్తకములు జపమాలతోఁ గూడికొనినదై ప్రకాశించుచున్న జ్ఞానముద్ర చేతులయందుఁ గలిగినట్టియు, దేవతల కధిపతియైనట్టియు, భరతాదులచేఁ జుట్టుకోఁబడినట్టియు నల్లనైనరాముని సేవించుచున్నాను.

శ్లో. కృష్టం భీమధనుః కఠోరనినదం బ్రహ్మాదిసంవిస్మయం
భాస్వద్వాజిగతేరమార్గ మనిశం శంభోశ్శిరఃకంపనమ్
దిగ్దంతిస్ఖలనం కులాద్రిచలనం సప్తార్ణవోన్మీలనం
వైదేహీమదనం మదాంధదమనం త్రైలోక్యసమ్మోహనమ్. 57

మ. హరచాపధ్వని కబ్జజాదులును చో♦ద్యంబందె రంభోనిధుల్
మొరసెన్ సీత ముదంబునొందె జగముల్ ♦ మోహంబుఁ జెందెన్ ధరా
ధరముల్ దిక్కరులుం జలించెను మదాం♦ధవ్రాతముల్ గూలె భా
స్కరవాజుల్ గతి దప్పె శంభుఁడు శిరః♦కంపంబుఁ జేసెన్ వెసన్.

తా. రామునిచే లాగఁబడిన శివధనుస్సు కఠినమగుచప్పుడును, బ్రహ్మాదులకాశ్చర్యమును, సూర్యునిగుఱ్ఱములనడకకు నెల్లపుడు తప్పుతోవను, ఈశ్వరునికి శిరఃకంపనమును, దిగ్గజములకుఁదొట్రుపాటును,సప్తకులపర్వతము చలించుటను, సప్తసముద్రములారిపోవుటను, సీతకు సంతోషమును, మదముచేఁ గన్నెఱుఁగనివారిసంహారమును, మూఁడులోకములకు మూర్ఛను గలిగించెను.

శ్లో.కంజాతపత్రాయతలోచనాయ
కర్ణావతంసోజ్జ్వలకుండలాయ
కారుణ్యపాత్రాయ సువంశజాయ
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ. 58

ఉ. శ్రీరమణీయసూర్యకుల♦సింధుసుధాంశుసమానమూర్తికిఁ
సారసపత్రనేత్రునకు ♦ సన్మణికుండలభాసమానశృం
గారకపోలయుగ్మునకుఁ ♦ గారుణికాగ్రణికాశ్రితార్తిసం
హారికి లక్ష్మణాన్వితున ♦ కారఘురామున కేను మ్రొక్కెదన్.

తా. పద్మపురేకులవలె విస్తారమైనకన్నులు గలిగినట్టియు, చెవుల కలంకారములై ప్రకాశించుచున్న కుండలములు గలిగినట్టియు, దయాపాత్రుఁడైనట్టియు, మంచి కులమందుఁ బుట్టినట్టియు, లక్ష్మణునితోఁగూడినరామునికొఱకు నమస్కారము.

శ్లో.విద్యున్నిభాంభోదసువిగ్రహాయ
విద్యాధరైస్సంస్తుతసద్గుణాయ
వీరావతారాయవిరోధిహంత్రే
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ. 59

మ. ఘనవిద్యుత్ప్రవిభాసితాంగునకు వి♦ఖ్యాతోగ్రవీరావతా
రునకుఁ శ్రీరఘురామచంద్రునకు ని♦ర్ధూతారికిఁ సిద్ధదే
వనికాయస్తుతసద్గుణాదరునకుఁ ♦ భక్తామరానోకహం
బునకుఁ శ్రీపతికిఁ సలక్ష్మణునకుఁ ♦ మోదంబునఁ మ్రొక్కెదన్.

తా. తళుకుచే మెఱుపుతోఁ దుల్యమును నలుపుచే మేఘమువంటిదియునగు దేహము గలిగినట్టియు, విద్యాధరులచే నుతింపఁబడు యోగ్యగుణములు గలిగినట్టియు, వీరావతారుఁడైనట్టియు శత్రువులను సంహరించునట్టియు, లక్ష్మణునితోఁగూడినరామునికొఱకు నమస్కారమగుఁగాక.

శ్లో.సంసక్తదివ్యాయుధకార్ముకాయ
సముద్రగర్వాపహారాయుధాయ

సుగ్రీవమిత్రాయ సురారిహంత్రే
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ. 60

మ. వరదివ్యాస్త్రశరాసనోజ్జ్వలునకున్ ♦ వారాశిదుర్వారద
ర్పరగర్వాపహదీప్తకాండునకు దై♦త్యధ్వంసికిన్ వాలిసో
దరసన్మిత్రునకున్ సలక్ష్మణునకున్ ♦ దాసార్తినిస్తారికిన్
హారికిన్ శ్రీరఘురామచంద్రునకు నే♦నశ్రాంతమున్ మ్రొక్కెదన్.

తా. గొప్పబాణములంగలసిన ధనుస్సుగలిగినట్టియు, సముద్రునిగర్వ మపహరించిన యాయుధముగలిగినట్టియు, సుగ్రీవునికి మిత్రుఁడైనట్టియు, రాక్షసులను హరించునట్టియు, లక్ష్మణునితోఁ గూడినరామునికొఱకు నమస్కారమగుఁగాక.

శ్లో. పీతాంబరాలంకృతమధ్యకాయ పీతామహేంద్రామరవందితాయ
పిత్రే స్వభక్తస్యజనస్యమాత్రే, నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ.

మ. అరవిందాసనశైలనిర్ధళనముఖ్యాదిత్యపూజ్యాంఘ్రిపం
కరుహద్వంద్వునకున్ సలక్ష్మణునకున్ ♦ క్ష్మాభర్తకున్ గాంచనాం
బరసందీప్తకటిప్రదేశునకు రామస్వామికిన్ సేవకో
త్కరమాతాపితృసన్నిభాత్మునకు న♦ద్భక్తిన్ వెసన్ మ్రొక్కెదన్. 61

తా. పచ్చనిబట్టచే నలంకరింపఁబడిన నడుముగలిగినట్టియు, బ్రహ్మేంద్రాదిదేవతలచే నమస్కారముఁజేయఁబడినట్టియుఁ, దనభక్తజనమునకుఁ దల్లియుఁ దండ్రియునైన లక్ష్మణునితోఁగూడిన రామునికొఱకు నమస్కార మగుఁగాక.

శ్లో. నమోనమస్తేఖిలపూజితాయ, నమోనమశ్చంద్రనిభాననాయ
నమోనమస్తే రఘువంశజాయ, నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ.

చ. సకలజగజ్జనార్చితల♦సత్పదపద్మునకున్ బయోరుహా
ప్తకులసముద్రచంద్రునకు ♦ బంకజనేత్రునకున్ ధరాధినా
యకునకు లక్ష్మణాన్వితున ♦ కాస్యతిరస్కృతపద్మవైరికిన్
ప్రకటయశోవిశాలునకు ♦ రామున కేను నమస్కరించెదన్. 62

తా. ఎల్లవారిచేఁ బూజింపఁబడు నీకొఱకు నమస్కారము. చంద్రునితో సమానమైన మొగముగల నీకొఱకు నమస్కారము. రఘువంశమందుఁబుట్టిన నీకొఱకు నమస్కారము. లక్ష్మణునితోఁగూడిన రామునికొఱకు నమస్కారము.

శ్లో. ఇమానిపంచరత్నాని, త్రిసంధ్యం యఃపఠేన్నరః
సర్వపాపవినిర్ముక్త, స్సయాతి పరమాంగతిమ్. 63

చ. అనుదినముం ద్రికాలముల • యం దతిభక్తిని పంచరత్నముల్
జనులు పఠించిరేని దురిత • జాలవిమోచనులై యిహంబునం
దనయము సౌఖ్యసంపదల • నంది ముదంబును జెంది యంతమం
దనుపమమోక్షముం గరత • లామలకంబుగఁ గాంతు రెంతయున్.

తా. ఈపంచరత్నముల నేమనుష్యుఁడేని మూఁడుసంధ్యలయందుఁ జదివెనేని వాఁడు ఎల్లపాపములచే విడువఁబడినవాఁడై యుత్తమగతినిఁ బొందుచున్నాఁడు.

శ్లో. శ్రీరామః కల్పవృక్షో మే, విరామ స్సకలాపదః
అభిరామ స్త్రిలోకానాం, రామః క్షేమం కరోతు నః. 64

చ. సరసిజమిత్రధాముఁడు ని • శాచరభీముఁడు రాఘవుండు స
ద్వరభువనాభిరాముఁడు సు • పర్వమహీరుహమై మదీయదు
స్తరవిపదుత్కరంబులహ • తిం బొనరించి నిరంతరంబు సు
స్థిరతరసౌఖ్యసంపదలు • క్షేమ మొసర్చి కృతార్థుఁ జేయుతన్.

తా. శ్రీరామమూర్తి నాకుఁ కల్పవృక్షము. ఎల్లయాపదలను మాన్పువాఁడు. మూఁడులోకములకు మనోహరుఁడు. అట్టిరాముఁడు మాకు క్షేమముఁజేయుఁగాక.

శ్లో. హృదయసదయచిత్తం చిత్తనాథంగుణానా
ముదధిమురుగుణాఢ్యం నిమ్నగాలంకృతాంఘ్రిమ్
జనకపతితనూజాస్వాంతకాంతోత్పలస్య
స్ఫురణకిరణచంద్రం రామచన్ద్రం భజస్వమ్. 65

ఉ. క్ష్మారమణీసుతాహృదయ • కైరవకైరవమిత్రు భవ్యబృం
దారకవాహినీజనన • నవ్యపదాంబుజుఁ జిత్తనాథు గం
భీరగుణామృతోదధియ • మేయగుణాకరు భక్తవత్సలుం
శ్రీరఘురామభూభుజు భ • జింతు నిరంతర మిష్టసిద్ధికిన్.

తా. ఓచిత్తమా! దయతోఁగూడినమనస్సు గలిగినట్టియు చిత్తముల కధిపతియైనట్టియు గుణములకు సముద్రుఁడైనట్టియు గొప్పగుణములతోఁ గూడినట్టియు గంగచే నలంకరించఁబడిన పాదము గలిగినట్టియు సీతయొక్క చిత్తమను కలువను వికసింపఁ జేయుటకుఁ జంద్రుఁడైన రామచంద్రుని సేవించుమా.

శ్లో. వదతు వదతు వాణీ రామరామేతి నిత్యం
జపతు జపతు చిత్తం రామపాదారవిందమ్

నమతు నమతు దేహం సంతతం రామచంద్రం
నభవతు మమ పాపం జన్మజన్మాంతరేషు. 66

చ. సతతము రామరామ యని ♦ సంస్మరియింపుచు నుండుఁగాక సం
తతమును రామపాదనలి♦నద్వయముఁ జపియించుఁగాక స
మ్మతి రఘురామచింతనము ♦ మాన కొనర్పునుగాక మద్వచః
ప్రతతిటు లైనజన్మకృత♦పాపసమాజము నన్నుఁ బొందునే.

తా. నావాక్య మెల్లప్పుడు రామరామయని పలుకుఁగాక. మనస్సు రాముని పాదారవిందమును జపించుఁగాక. దేహ మెల్లప్పుడు రాముని నమస్కరించుఁగాక. నాకు బహుజన్మాంతరములయందైనను బాపము లేకుండును.

శ్లో. చాపబాణధర స్సీతా, కామదః కాంతిమా న్నరః
సీతాలక్ష్మణసంయుక్తః, పాతు మాం రాఘవేశ్వరః. 67

మ. జనకాపత్యమనోరథప్రసుఁడు భా♦స్వన్మర్త్యసద్విగ్రహుం
డనఘుం డస్త్రశరాసనాంచితమహా♦హ నుండు సౌమిత్రిభూ
తనయాశోభితపార్శ్వభాగుఁడు నను♦స్తుత్యోణిపారాధ్యప
ద్వనజద్వంద్వుఁడు రామభూధవుఁడు ని♦త్యంబుఁ ననుం బ్రోవుతన్.

తా. ధనుర్బాణములను ధరించునట్టియు సీత కిష్టమునిచ్చునట్టియుఁ గాంతిగలిగినట్టియు మనుష్యాకృతిగలిగినట్టియు సీతాలక్ష్మణులతోఁగూడినట్టియు శ్రీరామమూర్తి నన్ను రక్షించుఁగాక.

శ్లో. ప్రాతస్మరామి రఘునాథముఖారవిందం
మందస్మితం మధురభాషివిశాలఫాలమ్
కర్ణావలంబిచలకుండలగండభాగం
కర్ణాంతదీర్ఘనయనం నయనాభిరామమ్. 68

ఉ. సుందరమందహాసపరి♦శోభితమై మధురోక్తియుక్తమై
కుందనసన్మణీఘటిత♦కుండలమండితమై విశాలకా
ర్ధేందునిభాళికంబయి ర♦హింతతనేత్రయుగాభిరామమై
యందము గుల్కు రాము వద♦నాబ్జము కల్యమునన్ స్మరించెదన్.

తా. మందహాసము గలిగినట్టియు తీయనిపలుకులు గలిగినట్టియు, విశాలమైన నుదురుగలిగినట్టియుఁ జెవులయందు వ్రేలఁబడు చలించుచున్న కుండలములచే శోభించు

గండస్థలములు గలిగినట్టియుఁ జెవులపర్యంతము విశాలములైననేత్రములు గలిగినట్టియు నేత్రముల కింపైన రామునిముఖపద్మమును బ్రాతఃకాలమున స్మరించుచున్నాను.

శ్లో. ప్రాతర్భజామి రఘునాథకరారవిందం
రక్షోగణాయభయదం వరదం నిజేభ్యః
యద్రాజసంసది విభిద్య మహేశచాపం
సీతాకరగ్రహణమంగళ మాపసద్యః. 69

చ. జనకసభాస్థలిన్ భవుని ♦ చాపము ఖండన మాచరించి యా
జనకసుతాకరగ్రహణ ♦ సౌఖ్యము తత్క్షణ మొందినట్టిన
జ్జనవరదు న్నిశాటగణ ♦ సాధ్వసదు న్రఘురామచంద్రు పా
వనసుకరారవిందములు ♦ భక్తి భజింతు నహర్ముఖంబునన్.

తా. రాక్షససమూహమునకు భయమునిచ్చునట్టియుఁ దనవారికి వరములనిచ్చునట్టియు, ఏదిరాజసభయందు శివధనుస్సుకు విఱిచి సీతావివాహమంగళమును బొందెనో అట్టిరాముని హస్తపద్మములఁ బ్రొద్దున సేవించుచున్నాను.

శ్లో. ప్రాతర్నమామి రఘునాథపదారవిందం
పద్మాంకుశాదిశుభరేఖశుభావహంచ
యోగీంద్రమానసమధువ్రతసేవ్యమానం
శాపాపహంసపది గౌతమధర్మపత్న్యాః. 70

మ. అరవిందాంకుశశంఖముఖ్యశుభరే ♦ ఖాలంకృతంబు న్మనో
హరము న్యోగిమనోమధువ్రతనిషే ♦ వ్యంబై యహల్యాసతీ
దురితాంతోపలరూపశాపఫలని ♦ ర్ధూతప్రభావప్రభా
కరమౌ రామపదాంబుజద్వయి నుషః ♦ కాలంబునన్ మ్రొక్కెదన్.

తా. పద్మము అంకుశము మొదలగు శుభరేఖలుగలిగినట్టిది గనుకనే శుభముల నొసంగునట్టియు మునీశ్వరుల మనస్సులనెడు తుమ్మెదలచేత సేవింపఁబడుచున్నట్టియు అహల్యయొక్క శాపమును బోఁగొట్టినట్టియు రాముని పాదారవిందమునుఁ బ్రొద్దుట నమస్కరించుచున్నాను.

శ్లో. ప్రాతర్వదామి వచసా రఘునాథనామ
వాగ్దోషహారిసకలం కలుషన్నిహంతృ
యత్పార్వతీస్వపతినాసహ భోక్తుకామా
ప్రీత్యాసహస్రహరినామసమం జజాప. 71

మ. దురితస్తోమవినాశమై ప్రబలవాగ్దోషాపహంబై రమే
శ్వరసాహస్రసమాఖ్యతుల్యమగు నే సంజ్ఞం జపించె న్మహే
శ్వరి మోదంబున భర్తృయుక్తముగఁ గాంక్షం గల్గి యారాఘవే
శ్వరునామంబు వచింతుఁ గల్మషమున నే సద్భక్తియుక్తుండనై.

తా. వాక్యదోషమును హరించునట్టియు నెల్లపాపములను గొట్టివేయునట్టియుఁ బార్వతీదేవి తనభర్తతో భోగించ నిచ్ఛఁ గడఁగుచు వేయివిష్ణునామములతోఁ దుల్యమైన యేనామమును సంతోషముచే జపించెనో అట్టి రామనామములను వాక్కుచేఁ బ్రొద్దునఁ బలుకుచున్నాను.

శ్లో. ప్రాతశ్శ్రయే శ్రుతినుతాం రఘునాథమూర్తిం
నీలాంబుదోత్పలసితేతరరత్ననీలామ్
ఆముక్తమౌక్తికవిశేషవిభూషణాఢ్యాం
ధ్యేయాం సమస్తమునిభిర్నిజభృత్యముఖ్యైః. 72

ఉ. నీలమణీపయోధరవినీలము తాపసముఖ్యసేవ్యమై
పాలితభృత్యవారమయి భవ్యశ్రుతిస్తుతమై సుమౌక్తికా
జాలవిభూషణాఢ్యమయి చారుతరం బగు రామమూర్తి యీ
కాలమునందు నాశ్రయతఁ గాంచెఁ దలంచెద నిష్టసిద్ధికిన్.

తా. వేదములచే స్తుతింపఁబడుచున్నట్టియు, నల్లమేఘమువలె నల్లగలువలవలె నల్లమణులవలె నల్లనైనట్టియు ఉంచఁబడిన ముత్యముల విశేషమైన యలంకారములతోఁ గూడినట్టియు ఎల్లమునులచేతను దనభృత్యశ్రేష్ఠులచేతను ధ్యానింపఁదగినట్టియు శ్రీరామునిస్వరూపమును బ్రొద్దుట నాశ్రయించెదను.

శ్లో. యశ్శ్లోకపంచకమిదం నియతః పఠేత
నిత్యం ప్రభాతసమయే పురుషః ప్రబుద్ధః
శ్రీరామకింకరజనేషు సఏవ ముఖ్యో
భూత్వా ప్రయాతి హరిలోకమనన్యలభ్యమ్. 73

మ. అనిశం బేనరుఁడైన నీయయిదుపద్యంబుల్ ప్రభాతంబునం
దున మేల్కాంచి పఠించునేని యతఁ డెంతో పుణ్యుఁడై రామపా
వనపాదాశ్రితుఁడై యనన్యజనలబ్ధంబై మహానందమై
ఘనతేజోమయమై చెలంగుహరిలోకప్రాప్తి గన్గొం డగున్.

తా. ఎవ్వఁ డీయైదుశ్లోకములను నిత్యము ప్రాతఃకాలమందు మేల్కాని నియ

ముముగలవాఁడై చదువునో అప్రయత్నముగా యానికింకరులలో ముఖ్యుఁడై యితరులకుఁ బొందశక్యముగాని విష్ణులోకములకుఁ బోవుచున్నాఁడు.

శ్లో. కింమంత్రైర్బహుభిర్వినశ్వరఫలై రాయాససాధ్యైర్మఖైః
కించిల్లోపవిధానమాత్రవిఫలైః సంసారదుఃఖావహైః
ఏకస్సన్నపి సర్వమంత్రఫలదో లోపాదిదోషోజ్ఝితః
శ్రీరామ శ్శరణం మమేతి పరమో మంత్రోఽయ మష్టాక్షరః. 74

శా. ఆరాధంబుగ సర్వమంత్రఫలసంపత్తిప్రదంబై నయీ
"శ్రీరామశ్శరణం మమే" తి యనఁగా జెప్పఁబడునష్టాక్షరిం
గోరంగా దగుమంత్రలోపమున కొక్కింతైన లేనట్టిదై
ప్రారంభంబు లసాధ్యమై ప్రబల దుర్గాంతిప్రదనిస్తారసం
సారార్త్యావహమైన మంత్రతతి కాంక్షల్ సేయఁగా నేటికిన్.

తా. విస్తారమైనట్టియు దుర్లభములైన ఫలములు గలిగినట్టియు, అమంత్రముల నెఱిఁగినవారి కాయాసము నిచ్చునట్టియు, కొంచెము లోపముఁ జేసినమాత్రముచే వ్యర్థములైనట్టియు సంసారదుఃఖములను జేయునట్టియు మంత్రములచేత నేమి ప్రయోజనము. ఒకటియైనను సమస్తమంత్రములఫలముల నిచ్చునట్టియు "రాముఁడు నాకు శరణు" అనునట్టి యీయెనిమిదియక్షరములుగల మంత్రము మిక్కిలి దోషము లేనిది.

శ్లో. రామభద్రాశ్రయ స్సాక్షా, ద్రామచంద్రో నసంశయః
తత్ర కోదండతూణీరా, వస్త్రదండకమండలూ. 75

ఉ. శ్రీరఘురామసత్పద కుశేశయయుగ్మము నాశ్రయించువాఁ
డారఘురామచంద్రసముఁడై చెలువొందును సందియంబు లే
దారఘువీరుఁ డెప్పుడు శరాసనబాణధరుండు డితండు సా
ధారణపాణిభృత్కరకమండలదండుఁడునై ప్రవర్తిలన్.

తా. శ్రీరామమూర్తి నాశ్రయించువాఁడు సాక్షాత్తు శ్రీరామమూర్తియే యగును సంశయము లేదు. (భేదమేమంటే) ఆరామమూర్తియందు ధనుస్సును అంబుల పొదియు నుండును. ఈభక్తునియందు దండము కమండలువు నుండును.

శ్లో. రఘునాథపదారవిందయో స్సే, వ్రనురీభూతభూతభ సుఘాంధకారసూర్య
అపరాధశతాలయం కలామ్, మనుగృహాణసీహా మంగళైః కటాక్షైః.

మ. నలినాప్తాన్వయసింధుచంద్ర ధరణీనాథా రఘుగ్రామణీ
కలుషధ్వాంతపతంగ రామహతమాహత్క్షంజాతసారంగమై

కలికాలం బపరాధకోటులకు నిక్కం బాలయం బైనన
న్నెలమిఁ భద్రము లొసఁగుటామ.ముల నాన్వీక్షించు టెం కెన్నఁడో.

తా. పాపములనెడు చీఁకట్లను సూర్యుఁడైనట్టి ఓ రామమూర్తీ! నీ పాదపద్మములయందుఁ దుష్టులైనట్టి ఈ కలియందు పాపకర్ములకు స్థానమైనట్టి నన్ను శుభకరములైన కెంగంటి చూపుల చేత ననుగ్రహింతు వన్నాను.

శ్లో. రామరామేతి వనామజపంతః, పామరా అపి తరంతి భవాబ్ధిమ్
అంగసంగిభవదంగుళిముద్రః, కింవిచిత్రమతరత్కపిరబ్ధిమ్. 77

ఉ. పామరులైనఁగాని తనపావననామజపం బొనర్చిన
న్బ్రేమ భవాంబురాశిని దరింతురు తానక మంగుళీయకం
బామిక చేతఁ బూనినహనూమత్స్వయమునం బ్రకటోర్మిమాలికా
భీమపయోధి క్రోశతి యతివేగతరించె విచిత్ర మెన్నఁగన్.

తా. ఓ శ్రీరామమూర్తీ! నీ పేరును జపించుచుండు మూఢులైనను సంసార సముద్రమును దాఁటుచున్నారు. తనశరీరముతోఁ గలసిన నీ వ్రేలిముద్రికగలవానరుఁడు సముద్రమును దాఁటెననుట యేమిచిత్రము

శ్లో. శ్రీరామనామామృతమంత్రబీజం, సంజీవనం చేన్మనసిప్రతిష్ఠమ్
హాలాహలం వా ప్రళయానలం వా, మృత్యోర్ముఖం వా వితథీకరోతి. 78

శా. శ్రీరామాక్షరమంత్ర సిద్ధ లసుధాసిక్తాత్ముఁడై నట్టియా
ధీరాగ్రేసరచక్రవర్తిని సమిద్దీప్తోగ్రకల్పాగ్నిదు
ర్వారోదగ్రహాలాహలం బమితసర్వగ్రాసియై సాధ్వసా
కారంబై తగుమృత్యువక్త్రములు నేకాలంబునం జెందునే.

తా. శ్రీరామనామమనెడు అమృతమంత్రముయొక్క బీజము సంజీవనమై మనసునందున్నట్లైతే కాలకూటవిషమును గాని ప్రళయకాలాగ్నిని గాని మృత్యుముఖమును గాని వ్యర్థమైనదానిఁగాఁ జేయును.

శ్లో. హాకృష్ణాచ్యుత హాకృపాలయ హరే హాపాండవానాం సఖే
క్వాసి క్వాసి సుయోధనాద్యపగతాం హారక్ష మాం ద్రౌపదీమ్
ఇత్యుక్తోఽక్షయవస్త్రరక్షితతనుర్యో రక్షితో దాసితః తే
ఆర్తత్రాణపరాయణస్స భగవాన్నారాయణో మే గతిః. 79

ఉ. కౌరవనాథుఁ డొప్పసభ దాసిన్ద్రౌపదివస్త్రము లూడ్చుచుండ నో
కారుణికాగ్రగణ్యరిపుకృష్ణ పాండవపక్షరక్షకా యని

యారడిబొందు నన్నుఁ గృప • నారయు మం చనఁ దక్షణంబునం
దారసి బ్రోచినట్టిహరి • యార్తశరణ్యుఁడు మాకు దిక్కుగున్.

తా. అయ్యో కృష్ణా! అయ్యో అచ్యుతా! అయ్యో దయాస్థానమైనవాఁడా! ఓ హరీ! అయ్యో పాండవులకు మిత్రుఁడా! ఎక్కడనున్నా వెక్కడనున్నావు? దుర్యోధనాదులచే అవమానము బొందినట్టి ద్రౌపదినైన నన్ను రక్షించుము. అని చెప్పఁబడినవాఁడై అంతములేనిబట్టలను రక్షించునట్టి దేహముగలవాఁడగుచు నేదేవుఁడు క్షణములోనే శీఘ్రముగా రక్షించెనో అట్టిపీడితులను రక్షించుటయం దాసక్తుఁడైన భగవంతుఁడగు నారాయణుఁడు నాకు గతి.

శ్లో. ఇందీవరదళశ్యామ, మిందుకోటినిభాననమ్
కందర్పకోటిలావణ్యం, వందేహం రఘునందనమ్. 80

చ. అమలసుధాకరాయుతస • హస్రనిభాస్యునకున్ స్వమూర్తికిన్
కమలధరాభవస్తుతునకుం • గాంచనచేలవిభాసిమూర్తికిన్
సుమశరకోటికోటినిభ • సుందరమూర్తికి భవ్యకీర్తికిన్
శమదమవర్తికిన్ సుగుణ • శాలికి రామున కేను మ్రొక్కెదన్.

తా. నల్లగలువరేకులవలె నల్లనైనట్టియు బహుచంద్రులతోఁ దుల్యమైన మొగము గలిగినట్టియు, కోటిమన్మథులవంటి సౌందర్యముగల రాముని నమస్కరించుచున్నాను.

శ్లో. కింయోగశాస్త్రైః కిము శేషవిద్యయా, కింయాగగంగాదివిశేషతీర్థైః
కిం బ్రహ్మచర్యాశ్రమసంచరేణ, భక్తిర్నచేత్తే రఘువంశకీర్త్యామ్.

మ. వరగంగాదివిశేషతీర్థములసే • వల్సేయఁగా నేల సు
స్థిరయోగంబులు సర్వవిద్యలు మఖా • దిప్రక్రియాయుక్తదు
ష్కరశాస్త్రంబులు నాలుగాశ్రమములుం • గాంక్షింపఁగా నేల భా
స్కరవంశుం డగురామచంద్రవిభునిన్ • సద్భక్తిఁ గీర్తించెదన్.

తా. ఓరఘువంశమందుఁబుట్టిన శ్రీరామా! నీకీర్తనమందు భక్తిలేనిచో యోగశాస్త్రములతో నేమి ప్రయోజనము? సమస్తవిద్యచేత నేమి ప్రయోజనము? యజ్ఞములచేత గంగాదితీర్థవిశేషములచేత నేమి ప్రయోజనము? బ్రహ్మచర్యాశ్రమమందు సంచరించుటచేత నేమి ప్రయోజనము?

శ్లో. హేరామభద్రాశ్రయ హేకృపాళో, హేభక్తలోకైకశరణ్యమూర్తే
పునీహిమాం త్వచ్చరణారవిందం, జగత్పవిత్రం శరణం మమాస్తు.

రా. కే ఓం

కిం యోగశాస్త్రైః కిము వేదవిద్యయా కిం యాగగంగాదిభి తీర్థైః।

కిం బ్రహ్మచర్యాశ్రమ సంచరేణ భక్తిర్న చేత్తే రఘువంశకేతౌ

ఉ. ఓరఘురామభద్ర హరి • యోకరుణాంబుధి యోధరిత్రిపు
త్రీరమణాబ్జలోచన సు•ధీజనజాలశరణ్యమూర్తి యో
సారసగర్భచంద్రధర•సన్నుతలోకపవిత్ర మైనమీ
చారుపదాబ్జము ల్గొలుతు • సమ్మతి నన్నుఁ బవిత్రుఁ జేయవే.

తా. ఓరామభద్రా! ఆధారమైనవాఁడా! ఓదయాశీలుఁడా! భక్తజనులకు ముఖ్య రక్షకమగుస్వరూపము గలవాఁడా! నన్నుఁ బవిత్రము జేయుము. జగములను బవిత్రముఁజేయు నీపాదపద్మము నాకు రక్షకమగుఁగాక.

శ్లో. శ్రీరామభద్రే శ్రితయోగిచంద్రే
ప్రసన్నమూర్త్యా పరిదృశ్యమానే
తాపత్రయం నాశ ముపైతి పుంసాం
తమోంధకారం వినిహంతు సద్యః. 83

మ. స్థిరయోగీంద్రసమాశ్రితాంఘ్రి యగునా•శ్రీరామచంద్రాకృతిన్
బరికింపఁ దగునట్టిపూరుషులకున్ • దాపత్రయం బప్పుడే
పరిహార్యం బగునేను నే ననెడిదు•ర్వారాంధకారంబు ని
ర్హారణం బౌ నని సత్య మీజగతి నా•రాముఁ బ్రశంసించెదన్.

తా. ఆశ్రయించినయోగులకుఁ జంద్రుఁడైనట్టియు నిర్మలమైన దేహముగలిగిన ట్టియు శ్రీరామచంద్రుఁడు చూడఁబడినవాఁడౌచుండఁగాఁ బురుషులకు ఆధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతికరూపములగు మూఁడుతాపములు నాశముఁ బొందుచున్నవి. అట్టిరామమూర్తి నాయజ్ఞానాంధకారమును తత్కాలమందుఁ గొట్టివేయుఁగాక.

శ్లో. నీలాభ్రదేహ నిఖిలేశ జగన్నివాస
రాజీవనేత్ర రమణీయగుణాభిరామ
శ్రీరామ దైత్యకులమర్దన రామచంద్ర
త్వత్పాదపద్మ మనిశం కలయామి చిత్తే. 84

ఉ. నీలఘనాఘనాంగ రమ•ణీయగుణాకర రామసర్వలో
కాలయ దైత్యవంశగహ•నానలకంజదళాయతాక్ష భూ
పాల లలామ రాఘవ శు•భప్రద సర్వవిభో ధరాసుతా
లోలభవత్పదాంబుజము•లున్ హృదయంబునఁ గాంచ నెంచెదన్.

తా. నల మేఘమువంటి దేహముగలవాఁడా! సమస్తమునకధిపతియగువాఁడా!

గుణములచే సొగసైనవాఁడా! శ్రీరామా! రాక్షసకులమును సంహరించువాఁడా! శ్రీ రామచంద్రా! నీపాదపద్మ మెల్లపుడూ నాచిత్తమందుండఁ దలఁచుచున్నాను.

శ్లో. కువలయదళనీలః పీతవాసాః స్మితాస్యో
వివిధరుచిరభూషాభూషితో దివ్యరూపః
దశరథకులనాథో జానకీప్రాణనాథో
నివసతు మమచిత్తే సర్వదా రామచంద్రః. 85

చ. కువలయపత్రనీలఘన•కోమలవర్ణుఁడు దివ్యమూర్తిమా
ధవుఁడు వినూత్నసన్మణివి•తానవిభూషణభూషితుండు రా
ఘవకులవర్ధనుండు నవ•కాంచనచేలుఁడు భూమిపుత్రికా
ధవుఁడు దరస్మితాస్యుఁడు ముకుందుఁడు వర్తిలు మన్మనంబునన్.

తా. నల్లగలువరేకువలె నల్లనైనట్టియుఁ బచ్చనివస్త్రము గలిగినట్టియు, చిఱునవ్వు మొగమందుఁ గలిగినట్టియు, పలువిధములగు నలంకారములచే నలంకరించఁబడినట్టియు, దివ్యరూపము గలిగినట్టియు, దశరథవంశమునకు నధిపతియైనట్టియు సీతకుఁ బ్రాణనాయకుఁడైనట్టియు, రామమూర్తి యెల్లపుడు నాచిత్తమం దుండుఁగాక.

శ్లో. సజలజలదనీలం సన్మునిస్తుత్యలీలం
సుగమనిగమమూలం యాతుధానాంతకాలమ్
దశరథనృపబాలం సత్కృపాపూర్ణలోలం
భజతు భువనఖేలం భక్తసంస్తుత్యశీలమ్. 86

చ. సకమలమేఘనీలు ముని•సన్నుతశీలుఁ గృపాలవాలు సే
వకజనపాలు దేవరిపు•వర్గవినాశనహేతుకాలునిఁ
బ్రకటసరోజజాండపరి•పాలనఖేలనశీలు నాజిభూ
పకవరబాలు సర్వశ్రుతి•పాలికమూలుని రాముఁ గొల్చెదన్.

తా. నీటితోఁగూడిన మేఘమువలె నల్లనైనట్టియు, యోగ్యమునులచే స్తుతింపఁ దగిన విలాసము గలిగినట్టియు, సులభమైన వేదములకుఁ గారణమైనట్టియు, రాక్షసులకు నాశకాలమైనట్టియు, దశరథరాజునకుఁ బిల్లవాఁడైనట్టియు, మంచిదయచే నిండినవారియుం దాసక్తుఁడైనట్టియు, లోకములయందు విహరించునట్టియు, భక్తులచే నుతింపఁదగిన విలాసముగలరాముని జనము సేవించుఁగాక.

శ్లో. దశరథవరపుత్రం జానకీసత్కళత్రం
దశముఖహరదక్షం పద్మపత్రాయతాక్షమ్

కరధృతశరచాపం చారుముక్తాకలాపం
రఘుకులనృవరేణ్యం రామమీడేశరణ్యమ్. 87

చ. దశరథరాజపుత్త్రు వసుధాతనయానుకళత్త్రు సత్త్వనిర్
దశముఖదైత్యజైత్రు నళినాతపత్ర నేత్రునిర్
బశుపతిమిత్త్రు జాపశరశాలికరు న్రఘువంశదీపకుర్
శశిముఖు మౌక్తికాభరణు సన్నుతు రాము సమాశ్రయించెదన్.

తా. దశరథునికొడుకైనట్టియు, సీత భార్యగలిగినట్టియు రావణుని హరించినట్టియు సమర్థుఁడైనట్టి పద్మపురేకులవంటికన్నులు గలిగినట్టి చేతఁ దాల్పఁబడిన ధనుర్బాణములు గలిగినట్టి సుందరమగు ముత్యముల యలంకారము గలిగినట్టియు రఘువంశమనుష్యులలో శ్రేష్ఠుఁడైన రక్షకుఁడగు రాముని స్తుతించుచున్నాను.

శ్లో. రామం వీరాసనస్థం విమలరవినిభం భాసమానస్వరూపం
శ్యామం సీతాసమేతం స్మితరుచిరముఖం కుండలోద్దీప్తగండమ్
శ్రీవత్సం శ్రీనివాసం సురవిటపితటన్యస్తసింహాసనస్థం
దివ్యాకల్పోజ్జ్వలాంగం నిజపతిమహితం ధ్యానయజ్ఞేనయక్ష్యే. 88

మ. సురభూజాంతికసింహపీఠనిలయు సూర్యప్రకాశు న్ధరా
వరపుత్రీయుతు భాసమానతను శ్రీవత్సాంకు వీరాసన
స్థితు శక్రస్తుతు శ్రీనివాసు మణిహారాజిభ్రాజితాకల్పు సుం
దరమందస్మితవక్త్రు నీలనిభు ధ్యానాధ్వరవ్రాతఁ జెందెదన్.

తా. వీరాసనమం దున్నట్టియు, నిర్మలసూర్యునితో సమానుఁడైనట్టియుఁ, బ్రకాశించుచున్న రూపము గలిగినట్టియు, నల్లనైనట్టియు, సీతతోఁగూడినట్టియు, నవ్వుతో సొగసైన మొగముగలిగినట్టియు, కుండలములచే బ్రకాశించుగండస్థలములం గలిగినట్టియు, శ్రీవత్సచిహ్నము గలిగినట్టియు, లక్ష్మికి నివాసమైనట్టియు, కల్పవృక్షస్థలమం దుంచఁబడిన సింహాసనమం దున్నట్టియుఁ, బ్రశస్తాలంకారములచే బ్రకాశించుచున్న దేహముగలిగినట్టి యింద్రునిచే నుతింపఁబడుచున్న రాముని ధ్యానమనెడి యజ్ఞముచేఁ బూజించఁగలను.

శ్లో. శ్రీరామభద్రాశ్రితసద్గుణానాం, పాదారవిందం భజతా నరాణామ్
ఆరోగ్య మైశ్వర్య మనంతకీర్తి, రంతేచ విష్ణోః పదమస్తి సత్యమ్. 89

ఉ. శ్రీరఘురామపాదసరసీజసమాశ్రితసజ్జనాంఘ్రిపం
కేరుహసేవకాళికి సుకీర్తియు నిభూతియు నారయంబు ని

స్తారతరాయువుర్ గలిగి • ధన్యత నొంది యనంతరంబునన్
సారసనేత్రుఁ డైనహరి•సన్నిధిఁ గల్గును సత్య మింతయున్.

తా. శ్రీరామమూర్తి నాశ్రయించిన యోగ్యగురువులపాదపద్మమును సేవించుచున్న మనుష్యులకు ఆరోగ్యము, ఐశ్వర్యము, అపరిమితమగుకీర్తి; అంతమందు నిత్యమగు విష్ణుమూర్తియొక్క స్థానమును గలదు.

శ్లో. రణహతదనుజేంద్రో రాజరాజాత్మచంద్ర
స్సమదరిపు మృగేంద్ర స్సన్మనోంభోధిచంద్రః
లలితఘననరేంద్రో లక్ష్మణానందసాంద్రో
మహితసుజనచంద్రో మైథిలీప్రాణచంద్రః 90

ఉ. మానిహృదబ్ధిచంద్రు రణ•మర్దితరాత్రిచరేంద్రు జానకీ
జానినరేంద్రచంద్రు రిపు•జాలమృగేంద్రుని లక్ష్మణప్రమో
దానయు రాజరాజహృద•యప్రవిభాసితచంద్రు భక్తసం
తానసురద్రుమంబు రఘు•నందను రాము సమాశ్రయించెదన్.

తా. యుద్ధమందుఁ గొట్టఁబడిన రావణుఁడు గలిగినట్టియు, రాజశ్రేష్ఠులయంతఃకరణమునకుఁ జంద్రుఁడైనట్టియు, మదముతోఁగూడిన శత్రువులకు సింహమైనట్టియు, యోగ్యులమనస్సముద్రమునకుఁ జంద్రుఁడైనట్టియు, సుందరుఁడును గొప్పవాఁడునగు రాజైనట్టియు, లక్ష్మణునియం దానందము చేదట్టమైనట్టియుఁ, బూజ్యులగు యోగ్యజనులకుఁ జంద్రుఁడైనట్టియు, సీతయొక్క ప్రాణమునకుఁ జంద్రుఁడైనరాముఁడు జయమునొందుఁగాక.

శ్లో. నమః కోదండహస్తాయ, సందీపితశరాయచ
దండితాఖిలదైత్యాయ, రామాయాపన్నివారిణే 91

ఉ. మానితహస్తమందు నన•మానశరాసము బూని బాణసం
ధానముఁ జేసి దానవవి•తానము లెల్ల వధించినట్టిసీ
తానయనోత్పలాంచితసు•ధాపరదీప్తికి రామమూర్తికిన్
ధీనిధి కార్తిహారి కతి•నిర్మలభక్తి నమస్కరించెదన్.

తా. ధనుస్సు హస్తమందుఁ గలిగినట్టియు, ప్రకాశింపఁజేయఁబడిన బాణము గలిగినట్టియు, శిక్షింపఁబడిన యెల్లరాక్షసులు గలిగినట్టియు, ఆపదలను మాన్పునట్టి రామునికొఱకు నమస్కారము.

శ్లో. నజానే జానకీజానిం, రామం తత్త్వమపి ప్రభుమ్
ధిక్కార్యా ద్యమదూతాన్ యో, నర స్తత్త్వ మిహాహతే. 92

చ. ధరణిసుతాధినాథుఁ డగు♦దాశరథిన్ రఘురాముఁ జిత్తమం
దెఱుఁగక యున్నవియ్యనకు♦లేశ్వరతత్త్వమునందుఁ గాంచి సు
స్థిరమతి గల్గువారలు ప్ర♦సిద్ధముగా యమదూతలం దిర
స్కరణముఁ జేతు రట్టిత్రిజ♦గత్ప్రభు నెంచి భజింతు నిత్యమున్.

తా. ఏమనుష్యుఁడు సీతాధర్తయైనట్టి ప్రభువగు రాముని బరమాత్మతత్త్వముఁగా నెఱుఁగకున్నను ఆతత్త్వమును సేవించునో వాఁడు యమదూతలను దిరస్కరించును.

శ్లో. రామో మే హృది సన్నిధిం రచయతాం రామంభజే దుష్కృతం
రామేణాపహృతం నమో భగవతే రామాయ రామాచ్ఛుభమ్
లక్ష్మే శ్రీరఘునందనస్య సుకృతే ర్దాసోస్మ్యహం సర్వదా
నిత్యం కోసలకన్యకాప్రియసుతే రామే మనోవర్తతామ్. 93

ఉ. రాముఁడు నిల్చు హృత్స్థలిని ♦ రాము నహర్నిశముల్ భజింతు శ్రీ
రామునిచే నఘం బణఁగు ♦ రామునికై నతు లే నొనర్తు శ్రీ
రామునివల్ల భద్ర మగు ♦ రాములకున్ బరిచర్యఁ జేసెదన్
రామునియందు నామది ని♦రంతర మేసురకన్ బ్రవర్తిలున్.

తా. శ్రీరామమూర్తి నామనసునందు సామీప్యమును జేయుఁగాక. రాముని సేవించుచున్నాను. రామునిచేఁ బాపము హరించఁబడినది. భగవంతుఁడగురామునికొఱకు నమస్కారము. రామునివలన శుభమును బొందుచున్నాను. పుణ్యాత్ముఁడైన రామునియొక్కదాసుఁడ నగుచున్నాను. ఎల్లపుడు కౌసల్య కిష్టపుత్రుఁడైన రామునియందు నామనసుండుఁగాక. (ఈశ్లోకమందు రామపర్యాయశబ్దములు సప్తవిభక్తులయందు గ్రహింపఁబడినవి.)

శ్లో. కోదండనిర్ముక్తశరాగ్రఖండనం, ప్రచండశౌర్యద్భుజదండమండనమ్
అఖండచండాంశుసమానభండనం, భజామి రామంరణరంగమండనమ్.

చ. సమదభుజాబలాఢ్యు లగు♦శత్రుల నైజధనుర్విముక్తబా
ణముల వధించి తీక్ష్ణకిర♦ణప్రవిభాసితచండమూర్తియై
సమరధరాభిరాముఁడయి ♦ సజ్జనబృందసుపర్వభూజమై
యమరినరామభూధవు న♦హర్నిశము న్భజియింపుచుండెదన్. 94

తా. ధనుస్సుచే విడువఁబడిన బాణాగ్రములచే (శత్రువులను) ఖండించుచున్నట్టియు, తీక్ష్ణమైన యెల్లప్రడైన భుజపరాక్రమము గలిగినట్టియు, అవిచ్ఛిన్నమైన సూర్యునివంటియుద్ధము గలిగినట్టియు, యుద్ధరంగమున కలంకారమైనరాముని సేవించుచున్నాను.

శ్లో. సింహాసనస్థం మునిసిద్ధసేవ్యం, రక్తోత్పలాలంకృతపాదపద్మమ్
సీతాసమేతం శశిసూర్యనేత్రం, రామంభజే రాఘవరామచంద్రమ్.

మ. రవిజైవాతృకనేత్రుఁడై మునిసుపర్వశ్రేణిసంసేవ్యుఁడై
నవరత్నోజ్జ్వలపీఠికోల్లసితుఁడై నవ్యస్ఫుటాంభోజకై
రవసంపూజితపాదపద్ముఁడయి గోరాపూసుతాయుక్తుఁడై
భువనేశుం డగురామభూభుజు హృదంభోజంబునం గొల్చెదన్.

తా. సింహాసనమం దున్నట్టియు, మునులచే సిద్ధులచే సేవించఁదగినట్టియు, ఎఱ్ఱదామరలచే నలంకరించఁబడిన పాదపద్మములు గలిగినట్టియు, సీతతోఁ గూడినట్టియు, చంద్రసూర్యులు కన్నులుగాఁ గలిగినట్టియు, రాఘవులను సంతోషింపఁజేయు చంద్రుఁడైనరాముని సేవించుచున్నాను.

శ్లో. దయారూపే భూపే రఘుకులకలాపే సుహృదయే
భుజాస్తంభే దంభేతరవిజయగుంభే విహరతామ్
మహావీరే ధీరే దశరథకుమారే పరిసర
ద్గుణారామే రామే దశముఖవిరామే మమమనః. 96

మ. సదయుండై ధరణీశుఁడై సుహృదుఁడై సర్వాత్ముఁడై ధీరుఁడై
మదమత్తారివిఖండచండభుజుఁడై మార్తాండవంశాబ్ధిప్రా
గుదితాబ్జుండయి యాజిసూనుఁడయి యాద్యుండై దశాస్యాదిభి
ద్విదురంబౌ రఘురామునం దెపుడు నావేశించు మత్స్వాంతమున్.

తా. దయాస్వరూపుఁడైనట్టియు, రాజైనట్టియు, రఘువంశమున కలంకారమైనట్టియు, మంచిమనస్సు గలిగినట్టియు, స్తంభములవంటి భుజములు గలిగినట్టియు, నిష్కపటమైన విజయసందర్భము గలిగినట్టియు, గొప్పవీరుఁడైనట్టియు ధైర్యవంతుఁడైనట్టియు, దశరథునికొమారుఁడైనట్టియు, వ్యాపించుచున్న గుణములకుఁ బూఁదోఁటయైనట్టియు, రావణుని సంహరించిన రామునియందు నామనస్సు విహరించుఁగాక.

శ్లో. గతే ష్వనేకేషు భవేషు పాప, వ్రతే ష్వపూర్ణేషు చ యోగతీర్థైః
విత్రస్తసర్వాఘనృణాంకుశేశే, నజాయతే భక్తిరనంతమీడే. 97

మ. అలయోగవ్రతతీర్థయాత్రరహితంబై కల్మషాసక్తమై
యిల జన్మంబు లనేకముల్ జరిగెనే నేకాలముం రాఘవుం
దలఁపం నేరకపోతి నిప్పుడయినం దాసానుదాసుండనై
కొలుతుం దద్రఘురామచంద్రుని మదంగోర్కుల్ ఫలింపం వెసన్.

తా. యోగములచేతను తీర్థములచేతను నిండనట్టియు పాపప్రతతులు గలిగినట్టియు ననేకములైన వెళ్ళిన జన్మములయందు జడియుచున్న యెల్లపాపములుగల (అనఁగాఁ బాపరహితులైన) మనుష్యులసమూహమునకు నధిపతియగు రామునియందు భక్తి పుట్టలేదు. (ఇప్పుడు) నాశనములేని రాముని స్తుతించుచున్నాను.

శ్లో. శ్రీరామభద్రాశ్రితయోగివర్యపాదాబ్జయుగ్మం సతతం భజేహమ్
యచ్చక్షుషీధామఘనప్రవేశే, తచ్చక్షుషీ పశ్యతి యస్యచేతః. 98

ఉ. శ్రీరఘురాముపాదసరసీజము లెప్పుడు నాశ్రయించున
త్పూరుషులైనయోగిజనపుంజపదంబులు గొల్చి యాశ్రితా
ధారుని దీప్తిధామమున దా పరికింపుదు రెట్టిచూపుచే
నారయుచుండు నాహృదయమంచు నిరంతర మట్టిచూపునన్.

తా. శ్రీరామమూర్తి నాశ్రయించిన యోగిశ్రేష్ఠులపాదపద్మద్వంద్వము నెల్లపుడు సేవించుచున్నాను. ఎవ్వరినేత్రములు తేజస్సును బ్రవేశించినవో వారినేత్రములు వారినేత్రము లేమహాత్ములచిత్తమును జూచునో అట్టియోగులని వెనుక కన్వయము.

శ్లో. నగ్రస్తస్తమసా నచాప్నిమలినో దర్శేనవోకర్శితో
నైవాస్తంగతవాన్ నచాంకితతను ర్నోషాతిక శ్రీరపి
లోకాలోకనగేంద్రలంఘనవిధౌ నోపంగుభావంగతో
నిర్దోషో గుణసాగరాద్రఘుపతి స్తేజో యశశ్చంద్రమాః. 99

మ. ఒకపక్షంబుననే ప్రకాశిలఁడు రాహుగ్రస్తుఁడుం గాఁడు ద
ర్శఁ గృశింపండు కళంకయుక్ గనఁడు ఏరీతిన్ బగల్ దీప్తిఁబో
పకయుండున్ వరచక్రవాళ మెగరన్ బంగుండు గాఁ డస్తమిం
పకయుం డాజిజనీగుణాబ్ధిభవశుంభత్కీర్తియాత్రేయుఁడున్.

తా. రాహువుచే మ్రింగఁబడనట్టియు, పగటిమలినుఁడు గానట్టియు, అమావాస్యచేఁ జిక్కనట్టియు, అస్తమయమును బొందనట్టియు, కళంకముగలదేహముగలవాఁడు కానట్టియు, ఒకపక్షమందే శోభకలవాఁడు గానట్టియుఁ, జక్రవాళపర్వతముదాఁటుట యందు సొట్టతనము బొందనట్టియు, దోషములేనట్టియుఁ దేజస్సుతోఁగూడిన కీర్తియను చంద్రుఁడు గుణసముద్రుఁడైనరామునివలనఁ బుట్టెను.

శ్లో. నాగానామయుతం తురంగనియుతం సార్థం రథానాం శతం
పాదాతా శ్శతకోటిసుద్ధదళితా న్మృత్యన్కబంధేరణే
ఏకంకోటిసహస్రన ర్తనవిధౌ చంచచ్ఛలఘ్నంటికా
మామార్ధం పరమాత్మనో రఘుపతేః కోదండఘంటారవః. 100

మ. అలరన్ వేయుగజంబులున్ దశసహ♦స్రాశ్వంబులున్ స్యందనం
బులు నూఱేబదినూఱుకోట్లసుభటుల్ ♦ భూమిం బడం దట్టమై
లలిన కంచరకోటి వేలువరుసన్ ♦ నర్తింప శ్రీరాముచే
విలు ఘంటారవ మొప్పునట్లు మొరసెన్ ♦ విఖ్యాతియామార్థమున్.

తా. ఆడుచున్న మొండెములుగల యుద్ధమందుఁ బదివేలయేనుఁగులు, లక్షగుఱ్ఱములు, నూటయేఁబదిరథములును, నూఱుకోట్ల కాల్బంట్లును గొట్టఁబడినట్లైతే ఇట్లు కోటివేలు నాట్యములుఁ జరుగుచుండఁగాఁ బ్రకాశించుచున్న కదలుచున్నఘంట ధ్వనించును. పరమాత్మస్వరూపుఁడైన శ్రీరాము ధనుస్సునందలి ఘంటయొక్క ధ్వని జామున్నర మ్రోఁగినది.

శ్లో. భజేహం సదా రామ మిందీవరాభం
భవారణ్యదావానలాభాభిధేయమ్
భవానీహృదాభావితానందరూపం
భవాభావహేతుం భవానీప్రసన్నమ్. 101

మ. కలుషారణ్యదవానలాహ్వయు నుమా♦కాంతాత్మసంభావితో
జ్వలసానందకరు నుత్పలాభుని భవా♦భావాదిహేతున్ విని
ర్మలు నానందమయున్ శ్రితార్తిహరు స♦న్మాణిక్యభూషున్ దినే
ట్కులవార్ధీందుని రామచంద్రు మదిగో♦రుక్కల్దీర భావించెదన్.

తా. నల్లగలువవంటి శోభగలిగినట్టియు, సంసారారణ్యమునకుఁ గార్చిచ్చైన పేరుగలిగినట్టియు, పార్వతియొక్క మనస్సుచే నూహింపఁబడిన యానందరూపము గలిగినట్టియు, సంసారనాశమునకు కారణమైనట్టియు, పార్వతికిఁ బ్రసన్నుఁడైనరాము నెల్లప్పుడు సేవించుచున్నాను.

శ్లో. సురానీకదుఃఖౌఘనాశైకహేతుం
నరాకారదేహం నిరాకారమీడ్యమ్
పరేశం పరానందరూపం వరేణ్యం
హరిం రామమీశం భజే భారనాశమ్. 102

మ. ధరణీభారనివారణున్ దివిజసం♦తానార్తివిచ్ఛేదనున్
హరిమాయామనుజాకృతిన్ బరుఁ బరా♦నందస్వరూపున్ బరా
త్పరు రూపాహ్వయశూన్యుఁ గేవలపరం♦ధాముస్ వరేణ్యున్ బరే
శ్వరునిన్ శ్రీరఘురామభద్రు మది సం♦భావించి సేవించెదన్.

తా. దేవతాసమూహముయొక్క దుఃఖసమూహము నశించుటకు ముఖ్యహేతు వైనట్టియు, మనుష్యాకారముగల శరీరము గలిగినట్టియు, ఆకారములేనట్టియు, స్తుతించఁదగినట్టియు, గొప్పయీశ్వరుఁ డైనట్టియు, గొప్పయానందరూపుఁడైనట్టియు, శ్రేష్ఠుఁడైనట్టియు, విష్ణురూపుఁడైనట్టియు, నీశ్వరుఁడైనట్టియు, సంసారాదిభారమును బోఁగొట్టునట్టిరాముని సేవించుచున్నాను.

శ్లో॥ ప్రసన్నాఖిలానందదోహం ప్రసన్నం
ప్రసన్నార్తినిశ్శేషనాశాభిధానమ్
తపోయోగయోగీశభావాభిభావ్యం
కపీశాదిమిత్రం భజే రామచంద్రమ్. 103

మ. సుజనార్తిఘ్నసమాహ్వయుఁ మునిజనస్తోమార్చితుఁ యోగిరా
డ్వ్రజహృద్భావితు సుప్రసన్నశ్రితవర్యశ్రేణికానందు నం
బుజమిత్రాత్మజముఖ్యవానరసఖుఁ భూపుత్రికాధీశ్వరుఁ
భజియింతు న్నిరతంబు రాఘవపరబ్రహ్మంబు నిష్టాప్తికిన్.

తా. శరణుఁజొచ్చిన యెల్లవారలకు నానందమును నిండించుటచేఁ బ్రసన్నుఁడైనట్టియు, శరణుఁజొచ్చినవారిబాధలను శేషములేకుండ నశింపఁజేయు పేరుగలిగినట్టియుఁ, దపస్సంబంధముగల యోగీశ్వరుల హృదయములయందు భావించఁదగినట్టియు సుగ్రీవాదులకు మిత్రుఁడైన రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో॥ స్ఫురద్రత్నకేయూరహారాభిరామం
ధరాభారభూతాసురానీకదావమ్
శరచ్చంద్రవక్త్రం లసత్పద్మనేత్రం
దురాసాద్యపాదం భజే రామచంద్రమ్. 104

మ. వనజాతాయతనేత్రు జంద్రవిలసద్వక్త్రుం దురాసాద్యపా
దుని ధాత్రీతలభారదైత్యగణనిర్ధూతాగ్నిసాదృశ్యుఁ గాం
చనమాణిక్యకిరీటకంకణవిరాజత్కుండలాలంకృతుఁ
ఘనవర్ణుఁ రఘురామభూభుజునిఁ గాంక్షుం గొల్తు నశ్రాంతమున్.

తా. ప్రకాశించుచున్న రత్నవికారగములగు భుజకీర్తులచే హారములచే సొగసైనట్టియు, భూమికి బరువైన రాక్షససమూహమునకుఁ గార్చిచ్చైనట్టియు, శరత్కాలచంద్రునివంటి మొగముగలిగినట్టియు, ప్రకాశించుచున్న పద్మములవంటి కన్నులుగలిగినట్టియుఁ, బొందశక్యముగాని పాదములు గలిగినట్టియు, రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. సురాధీశనీలాభనీలాంగకాంతిం, విరాధాదిరక్షోగణానీకనాశమ్
కిరీటాదిశోభం పురారాతిలాభం, భజే రామచన్ద్రం రఘూణామధీంద్రం.

చ. సురవరనీలరత్న పరిశోభితగాత్రు విరాధముఖ్యము
ష్కరదనుజౌఘకారహృతిసారసమిత్రుఁ బురారిసఖ్యుఁ గ
ర్బురమకుటాద్యలంకరణుఁ బుష్కరరత్నకులాబ్ధిచంద్రు శ్రీ
కరు రఘురామభద్రు మదిఁ గాంక్షలు దీర భజింతు నిత్యమున్.

తా. ఇంద్రనీలముల శోభగల నల్లని దేహకాంతి గలిగినట్టియు, విరాధుఁడు మొదలగు రాక్షససమూహమును వశింపఁజేయునట్టియుఁ, గిరీటము మొదలగువాని శోభ గలిగినట్టియు, ఈశ్వరునికి లాభస్వరూపుఁ డైనట్టియు, రఘువంశపురాజుల కధిపతి యగు రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. లసచ్చంద్రకోటిప్రకాశాదిపీఠే, సమాసీన మంకే సమాధాయ సీతామ్
స్ఫురద్ధేమవర్ణోల్లసత్కంజపుంజం, భజే రామచన్ద్రం నివృత్యాదితన్త్రమ్.

మ. ఘనజాంబూనదపద్మశోభితుని రాకాచంద్రకోటిప్రభా
సనసందీపితు వామభాగధరణీజాతాసమాయుక్తు రా
ముని నీలోత్పలనీలనీరదలసన్మూర్తిన్ నివృత్యాదితం
త్రుని గాకుత్స్థకులాబ్ధిచంద్రు భజియింతున్ నామనస్సిద్ధికిన్. 106

తా. ప్రకాశించుచున్న బహుచంద్రుల కాంతిగల యాదిపీఠమందుఁ గూర్చున్నట్టియుఁ, దొడయందు సీతనుంచుకొని ప్రకాశించుచున్న బంగారురంగుచేఁ బ్రకాశించుచున్న పద్మసమూహముగల నివృత్యాదితంత్రముగల రామచంద్రుని సేవించుచున్నాను.

శ్లో. సదాభోగభాజాం సుదూరేవ్యభాతం
ముదాయోగభాజా మదూరేవిభాతమ్
చిదానందకందం సదారాఘవేశం
విదేహాత్మజానందకందం ప్రపద్యే. 107

మ. తతభోగానువిహారచిత్తులకుఁ బొందం దూరమై భక్తసం
యుతయోగీంద్రులకెల్లఁ దా పగుచు వేద్యుండై చిదానందుఁడై
క్షితిపుత్రీహృదయప్రమోదకరుఁడై చెల్వొందు శ్రీరామునిన్
సతతంబున్ శరణంబు వేఁడెదను మాతృశ్రీసమాకాంక్షినై.

తా. ఎల్లపుడు భోగములు బొందినవారికి మిక్కిలి దూరమందున్నట్టియు సంతోషముచే యోగముఁ బొందువారికి సమీపమందుఁ బ్రకాశించుచున్నట్టియు,

నానందములకు దుంపయైనట్టియు, సీతయొక్క యానందమునకు దుంపయైన శ్రీ
రామమూర్తిని శరణు బొందుచున్నాను.

శ్లో. మహాయోగమాయావిశేషానుయుక్తో, విభాసీశలీలానరాకారవృత్తిః
త్వదానందలీలాకథాపూర్ణకర్ణా, స్సదానందరూపాభవంతీహలోకే.

స. లలితంబైన భవత్కథామృతము చాలం గ్రోలుచున్నట్టిని
శ్చలులానందమునన్కలొట కరయర్ణ సందేహామా భక్తవ
త్సలలీలామనుజాకృతిప్రకృతియోగాపాయుక్తకాకుత్స్థవం
శలసద్వారిధిశశాంకరామధరణీశా దేవదేవోత్తమా. 108

తా. ఓయీశ్వరుఁడా లీలామనుష్యరూపము గలవాఁడవై గొప్పదియైన యోగ
మాయతోఁ గూడినవాఁడవై ప్రకాశించుచున్నావు. నీయానందకరమైన విలాసకథలచే
నిండినచెవులుగలవారు ఈలోకమున నెల్లపుడు నానందసంపూర్ణు లగుచున్నారు.

శ్లో. యస్యప్రాణనివారణావనకృతేస్యాత్తాంనిదానోవిభో
రైంద్రధ్వాంక్షపతేః కృపాజలనిధేః కోపప్రసాదౌముదే
భూయాద్వాసవనీలసన్నిభతనుర్వామాంకసీదద్వధూః
సోయం దుష్టనిశాటపాటనపటుః శ్రీరాఘవోవస్సదా. 109

మ. పతిప్రాణావనశిక్షహేతుఁడయి గోపధ్వంసిసంబంధగ
ర్వితకాకాసురునందు క్రోధుఁడయి యర్థింపఁ బ్రసాదాత్ముఁడై
శతమన్యూపలవర్ణుఁడై సదయుఁడై క్ష్మాపుత్రికాయుక్తుఁడై
హతదుష్టాసురుఁడైన రాఘవుఁడు నన్నశ్రాంతము న్బ్రోవుతన్.

తా. దయాసముద్రుఁడైన యేశ్రీరామమూర్తియొక్క కోపమును అనుగ్రహ
మును ఇంద్రునికొడుకైన కాకియొక్క ప్రాణములయొక్క నివారించుటకొఱకును
రక్షించుటకొఱకును అగునో అట్టియింద్రనీలములతో సమానమైన దేహముగలిగినట్టియు
నెడమతొడయందున్న సీతగలిగినట్టియు దుర్మార్గరాక్షసులఁ గొట్టుటయందు సమర్థుఁడై
నట్టియు శ్రీరామమూర్తి మీ కెల్లపుడు సంతోషము కొఱకగుఁగాక.

శ్లో. దుష్టోవా కలుషాత్మకోపి పిశునో దుర్మార్గసంచారవాన్
మాతృఘ్నోపి పితృఘ్నవర్తనరతస్సన్న్యాసినిందాపరః
యోయం శుశ్రీత్యమృతం హితం మధురసం వక్త్రాచ్చ శ్రోత్రాలిభిః
సప్రాప్నోతి నిరంతరైహికసుఖం నిర్వాణసౌఖ్యంతతః. 110

మ. కలుషాత్ముండును మాతృపిత్రహఁడు దుష్కర్ముండునై మౌనివ
ర్యుల నిందించునతండు దుష్టుఁడు మహాక్రోధాంధుఁడై నం దినం

బులు కర్ణామృతముఁ లిఖింప శ్రుతులఁ • గ్రోలఁ బఠింపఁ మహిఁ
గలకాలంబు సుఖంబులం గని మహానందంబు నొందుఁ మదిన్.

తా. దుర్మార్గుఁడైనను పాపస్వభావుఁడైనను గొండెగాఁడైనను అయోగ్యపు త్రోవయందు సంచరించువాఁడైనను తల్లినిగొట్టువాఁడైనను దండ్రినిగొట్టు వ్యాపారము లయం దాసక్తుఁడైనను యోగ్యులగు మునులను నిందించుటయం దాసక్తుఁడైనను ఎవఁడైతే యిష్టమైనట్టియు తీయనిరుచిఁ గలిగిట్టియు నీకర్ణామృతమును చెప్పినవాఁడు (అనఁగా జదువువాఁడు)ను వినువాఁడును వ్రాయువాఁడును వినచో వాఁడు ఎడతెగని యిహలోకసౌఖ్యమును తరువాత మోక్షసుఖమును బొందుచున్నాఁడు.

మ. శివసామ్యం డగు నాదిశంకరులు మున్ • శ్రీరామకర్ణామృతం
బవనిఁ సంస్కృతి మేర్పరించె నది మో • క్షాపేక్షఁ జేకూరు వం
శవరాబ్ధీందు ప్రసిద్ధసిద్ధకవి నే • శ్రద్ధఁ దెనుఁగించి రా
ఘవ! పూవండఁగ నిచ్చినాఁడ గొనుమా • కల్పంబుగా సత్కృపన్.

మాలినీ. రఘుకులవరనాథో • జానకీప్రాణనాథః
పితృవచనవిధాతా • కీశరాజ్యప్రదాతా
ప్రతినిశిచరనాశః • ప్రాప్తరాజ్యప్రవేశో
విహితభువనరక్షః • పాతు పద్మాయతాక్షః.

తా. రఘుమహారాజువంశమునఁ బుట్టినమహారాజు సీతాదేవికి మిక్కిలి ప్రియుఁడు, తండ్రి చెప్పినపని చేయువాఁడు, సుగ్రీవునికి రాజ్య మిచ్చినవాఁడు, శత్రువులయినరాక్షసుల నశింపఁజేయువాఁడు, రాజ్యమును పొందినవాఁడు, లోకమును రక్షించినవాఁడు అయినశ్రీవిష్ణుస్వరూపుఁ డగు శ్రీరాముఁడు నన్ను రక్షించుఁగాక.
(ఈశ్లోకమునందు రామాయణకథ సంక్షేపముగఁ జెప్పఁబడినది.)

మ. ఇది శ్రీరామపదారవిందమకరం • దేచ్ఛాభక్తసన్మత్తమ
ట్పదవిజ్ఞానపదాబ్జరేణుపటలీ • ప్రాప్తోత్తమాంగోల్లస
న్ముదితాంతఃకరణుండు సిద్ధకవిమా • న్యుం డైన రామావనీ
శ! దయాలోకనఁ జెప్పె నాలుగవయా • శ్వాసం బభీష్టాప్తికిన్.

శ్రీరామకర్ణామృతము సమాప్తము.

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1921.